# చతుర

సంపుటి : 4 సెప్టెంబర్-1981 సంచిక : 8

## ఈ నెల సమగ్ర నవల

"నిన్నగాక మొన్నవొచ్చావు. వచ్చినప్పట్నుంచీ నాతో తగువు పెట్టుకోవాలని చూస్తున్నావు. ఇలా అయితే ఇక్కడ ఎన్నో రోజులుండవు. ఇక్కడే కాదు, ఎక్కడా నీకు దిక్కు లేకుండా చెయ్యగలను ! పైగా నన్ను కాదంటే వూరవతలి చెరువులో తేల్తావు" అంటూ మీది మీదికొచ్చిన ప్రెసిడెంటూ, యమకింకరుల్లాంటి అతని అనుచరులూ కలిసి ఏం చేశారామెను?

'సింగిల్ టీచర్'గా నియమింపబడి, ఒంటరిగా ఆ మారుమూల పల్లెలో అడుగు పెట్టిందా యువతి. బల్లలూ, కుర్చీ ఏదీ లేని ఆ స్కూలును దారికి తెజూచిన ఆమెపై పల్లె ప్రముఖులు అఘాయిత్యానికి పూనుకోవాల్సిన అవసరం ఏమిటి ?

# పల్లె

జీవితం ప్రశాంతమైనదనీ, ప్రకృతి అందమైనదనీ, ప్రజలు అమాయకులనీ అనుకొంటాం. మరి ఆ పచ్చని పల్లెల్లోని దారుణాలు, రక్తపాతాలు, అధికార దర్పాలూ ఎలాంటివి ?

## కొమ్మిరెడ్డి విశ్వమోహన రెడ్డి

వీటన్నింటిని మన కళ్ళ ముందుంచేలా రచించిన 'పల్లె' ఈ నెల చతుర సమగ్ర నవల.



ముఖచిత్రం : ఎస్. శివన్నారాయణ

రెండవ కవరు : మంగళగిరి ఆలయంలోని గరుడుడు

ఫొటో : గిరాదత్త

మూడవ కవరు : రాజస్థాన్‌లో ఒక బాలిక

ఫొటో : మురళీ ఎస్. శర్మ

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.
* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 – 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60–70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
* *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.
* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.
* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచననుబట్టి రు.1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

**చతుర**

*ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.*




# కోల్గేట్
## డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుండి. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోము కోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన మూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.

**నోటి దుర్వాసనను ఆపండి...**
**కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో**
**దంతక్షయాన్ని**
**ఎదుర్కోండి!**




DC.G.74 TL

# జ్ఞాపక శక్తి

# చతుర

క్షణం క్రితం చదివిన వ్యాసం సంగతి అటుంచి ఉదయంతిన్న కూరేమిటో కూడా గుర్తురాదు మనకి. తమ అద్భుతమైన జ్ఞాపకశక్తితో ప్రపంచరికార్డ్ స్థాపించిన వారు కూడా వున్నారు అక్కడక్కడా. ఇయాన్ మెక్‌లియాడ్ అనే అతను పార్లమెంటు అధికార రికార్డ్ ఓ సారి చూసి అందులోనివన్నీ పొల్లు



పోకుండా చెప్పగలిగేవాడు. ఫ్రెంచి నాయకుడు జనరల్ డీగాల్, ప్రముఖ రచయిత విక్టర్ హ్యూగో పుస్తకాల్లోని వేలాది పేజీలను గడగడా అప్పజెప్పే వారు.

దక్షిణాఫ్రికాకి చెందిన ఫీల్డ్‌మార్షల్ జాన్‌స్మిట్స్ అతని ఇంట్లోని గ్రంథాలయంలోగల ఐదు వందల పుస్తకాల్లో ఏ పేజీలో వాక్యాన్నయినా ఠకాల్న చెప్పగలడు. అద్భుతమైన జ్ఞాపకశక్తి సామర్థ్యం గురించి వాషింగ్టన్ విశ్వవిద్యాలయానికి చెందిన ఇద్దరు శాస్త్రజ్ఞులు పరిశోధనలు జరిపారు. తెలివితేటలకు, జ్ఞాపకశక్తికీ సంబంధంలేదని వీరి అభిప్రాయం. వీరి మెదడు అచ్చం కెమేరాలా పనిచేస్తుంది. వీరు చూసేవి, చదివేవీ అన్నీ వీరి జ్ఞాపకశక్తి అరలో భద్రపర్చబడతాయి. ఈ విషయాలను తిరిగి ఉన్నదున్నట్లు కొన్ని సంవత్సరాల తర్వాత కూడా చెప్పగల శక్తి వుంటుంది వీరి



మెదడుకి. అసలు మనుషులందరికీ సాధారణంగా వుండే జ్ఞాపకశక్తికన్నా ఆరురెట్లెక్కువ వుంటుంది. ఎక్కువ ఏకాగ్రత వుంటే జ్ఞాపకశక్తి పెరుగుతుంది. ప్రయత్నిస్తే చాలా మంది దీన్ని అభివృద్ధి చేసుకోవచ్చు.

న్యూయార్క్‌లో ఓ 23 ఏళ్ళ యువతికున్న జ్ఞాపకశక్తి అసాధారణమైనదిగా చెప్పుకోవచ్చు. ఈమె తనకు తెలియని భాషలోని కవితల పుస్తకంలో ఒక పేజీని కొన్ని సెకన్లు చూసి ఓ వారం తర్వాత ఒక్కపదమైనా తప్పు లేకుండా అచ్చుగుద్దినట్లు వాక్యాలను ముందునుంచీ, వెనకనుంచీ చెప్పగలదు. పోలెండ్‌కి చెందిన ఒక గణిత శాస్త్రజ్ఞుడు నాలుగున్నర సెకన్ల సేపు 624, 706,





# ప్రపంచం

845, 986, 193, 261, 841 అనే సంఖ్యలను చూసి తర్వాత ఒక్కతప్పు లేకుండా అప్పచెప్పగలిగాడు.

జ్ఞాపకశక్తికి, వయసుకీసంబంధంలేదని ఓకాహోమాకి చెందిన 12 ఏళ్ళ జెరాల్డ్ కార్ల్టన్ ఋజువు చేశాడు. ఇతను వాళ్ళూరు టెలిఫోన్ డైరెక్టరీలోని ఐదువేల పేర్లు, చిరునామాలు, నంబర్లు అన్నీ గడగడ చెప్పేయగలడు. టర్కీకి చెందిన 15 ఏళ్ళ మహమద్ ఆలి హాలిసి ఖొరాన్




లోని 6,666 పద్యాలనూ ఒక్క అక్షరం పొల్లు పోకుండా అప్పజెప్పగలడు. ఒకమ్మాయి ఎడింబరో విశ్వవిద్యాలయం కోసం తనకు గుర్తున్న వెయ్యి సామెతలను, 450 గేలిక్ పాటలను రాసిచ్చింది.

శాస్త్రజ్ఞుల అభిప్రాయం ప్రకారం మనందరి మెదళ్ళలో ఆధునికమైన కంప్యూటర్ కన్నా 30 లక్షల రెట్లు వివరాలు నిలవ వుంటాయి. ఒకవేళ మనం మన మెదడు గుర్తుంచుకొన్న విషయాలను పొల్లుబోకుండా రాయాలంటే రోజుకి 24 గంటల చొప్పున రెండు వేల సంవత్సరాల కాలం పడుతుంది. కనక మనిషి మెదడును మించిన కంప్యూటర్ 'నభూతో నభవిష్యతి' అనవచ్చు.

## రబ్బరు చర్మం

క్లాసులో అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పకపోతే కోపంతో కొద్ది క్షణాలు మాస్టరు బుగ్గ సాగదీస్తే 'కుయ్యో మొర్రో' మంటాం.

కానీ జేమ్స్ మోరిస్ అలా కాదు. అతని బుగ్గలు సాగదీసిన వాళ్ళ చెయ్యి నొప్పెట్టాలిగాని అతనికి మాత్రం చీమ కుట్టినట్లయినా వుండదు. జేమ్స్ తన




బుగ్గల మీద చర్మాన్ని 8 అంగుళాల పొడవు సాగదీయగలడు. అంతేగాక ఛాతీ మీది చర్మాన్ని తలదాకానూ, ఓ కాలిమీద చర్మాన్ని సాగదీసి మరో కాలు మీదికి వచ్చేలాగానూ చేయగలడు. అదేమన్నా చర్మమా, రబ్బరా అని ముక్కు మీద వేలేసుకోకండి. అతనిది రబ్బరులాంటి చర్మం. 5 లక్షల మందిలో జేమ్స్ లాంటివాడు ఒక్కడుండటం చాలా అరుదు. వారికి 'క్యూటిస్ హైపర్ ఎలాస్టికా' అనే అతి పల్చని సాగే గుణం

గల చర్మం వుంటుంది. చర్మం ఎలాస్టిక్‌లా సాగి మళ్ళీ వెనక్కి వెళ్ళిపోతుంది. చర్మం కింద పొరలు బలహీనంగా వుండడమేగాక వాటి కింది టిష్యూలు అందరిలాగాక వదులుగా అతికించబడి వుంటాయి. ఈ లక్షణం వంశపారంపర్యంగా వస్తుంది. దీన్ని సరిదిద్దడానికి వైద్యశాస్త్రంలో ఎటువంటి మందూ లేదు.

ఈ లక్షణాలున్న వారి చర్మం సాగుదలలో తేడాలుంటాయి. చర్మానికి సాగే గుణమున్నా కొందరివి ఎక్కువ దూరం




సాగితే కొందరివి కాస్త తక్కువగా సాగుతాయి. కొంతమంది నుదుటి మీది చర్మాన్ని నాసికా రంధ్రాలదాకా లాగగలిగితే, మరికొందరు నోటిదాకా, మెడదాకా సాగదీయగలుగుతారు.

స్పెయిన్ దేశస్థుడైన ఆల్బ్స అనే అతను మోకాలిచిప్ప మీద చర్మాన్ని 18 అంగుళాలు సాగదీస్తాడు. బుడాపెస్ట్‌లో 'ఇండియా రబ్బర్ మాన్'గా పేరు పొందిన షంగరీ ముక్కుని కూడా సాగదీస్తాట్ట.

ఎలాస్టిక్ చర్మమున్న ఆడ, మగా సర్కసుల్లోనూ, బహిరంగంగానూ దాన్ని ప్రదర్శనా యోగ్యంగా చేసి డబ్బు సంపాదిస్తుంటారు.

## పొరపాటా గ్రహపాటా?

మన దేశంలో కంప్యూటర్లు పరీక్షా ఫలితాలను తారుమారు చేస్తుంటే విదేశాల్లో కంప్యూటర్లు ప్రపంచ యుద్ధాలనే సృష్టించే పొరబాట్లు చేస్తున్నాయి.

కొన్నాళ్ళ కిందట అమెరికాలోని కొలారడ్ ప్రాంతంలో రహస్యంగా అమర్చిన 'విమెక్స్' అనే అమెరికన్ కంప్యూటరు ఓ వింతైన హెచ్చరిక ఇచ్చింది. "రష్యన్లు ఆటోమాటిక్ ఆయుధాలు పట్టుకుని ముందుకు దూసుకు వస్తున్నారు. అందరూ యుద్ధానికి సిద్ధంకండి" అని దాని సారాంశం. ఈ వార్త రక్షణ శాఖల్లో గొప్ప సంచలనాన్ని సృష్టించింది. అంతా శక్తివంతమైన మారణాయుధాలను గురిపెట్టి యుద్ధానికి సన్నద్ధులయ్యారు. ఉపగ్రహాలు, రాడారులు ముఖ్యమైన ఆధారాలకోసం వెతకడం ప్రారంభించాయి. కానీ రష్యన్లు యుద్ధానికి వస్తున్న ఛాయలేవీ కనబడక పోవడంతో అమెరికన్లు నిరుత్సాహపడ్డారు.

ఇదంతా కంప్యూటరు పొరపాటనీ, రష్యన్లు పోరాటానికి వస్తున్నారనడానికి ఎట్టి ఆధారమూ దొరకలేదనీ తేలాక ఈ పొరపాటును అధ్యక్షుడికి తెలియకుండా దాచి వుంచాలని నిశ్చయించుకున్నారు.

కానీ ఎలా తెలిసిందో ఏమో ఈ వార్త రక్షణ శాఖను దాటి బైటికి

పొక్కింది. ఒక పత్రిక కంప్యూటరు పొరపాటునీ, ఫలితంగా జరిగిన గ్రహపాటునీ వర్ణిస్తూ ఓ వ్యాసం రాసింది.

అది చదివిన అమెరికా ప్రజలు 'బుర్రలేని ఈ కంప్యూటర్లకు మా జీవితాల్ని రక్షించే పని అప్పగించటం ఏం న్యాయం ?' అని ఆగ్రహావేశాలు వెలిబుచ్చారు.

ఇబ్బందిలో పడిన అమెరికా ప్రభుత్వం కంప్యూటర్లో వుండే ఓ చిన్న ట్యూబు అరిగి పాడయిపోయిన కారణంగా 'విమెక్స్' ఆ పొరబాటు చేసిందనీ, ఇకమీదట ఎప్పటికప్పుడు నిపుణులతో వాటిని తనిఖీ చేస్తుంటారనీ ప్రజలకు వాగ్దానం చేసింది.

## భయానికి మారు పేరు

దొంగతనాలు చేసేవారు వేలూ లక్షలూ దోచేసి ఆ డబ్బుతో సుఖంగా ఉంటారని మనమంతా అనుకుంటాం గానీ




దొంగలు సుఖంగా ఉండలేరని మనస్తత్వ శాస్త్రవేత్తలంటున్నారు. దొంగతనం చేయాలన్న ఐడియా వచ్చినప్పట్నుంచీ మొదలైన మానసిక సంఘర్షణ వస్తువుని దొంగిలించే సమయంలో ఎవరి కంటా పడకుండా ఎలా తప్పించుకోవాలన్న ఆలోచనతో తారస్థాయి నందుకుంటుంది.

దొంగతనం అంటే కేవలం వస్తువుల్ని, డబ్బుని దొంగిలించడం కాదు, అది చాలా క్లిష్టతరమైన ఆట. భయానికి మారు పేరు. మామూలువాళ్ళకంటే దొంగతనాలు ఎక్కువగా చేసేవారు త్వరగా చనిపోడానికి నరాల ఉద్రిక్తత, మానసిక సంఘర్షణ కారణాలని మనస్తత్వవేత్తలంటున్నారు. దొంగ ఎంత ధైర్యవంతుడు, బలవంతుడు అయినాగాని రంగంలోకి దిగాక తన గుండె చప్పుడు తనే వినక తప్పదు. దొంగతనం కోసం లోపలికి వెళ్ళడం సులభం గాని దొంగిలించిన వస్తువుతో బైటపడ్డమంటే తమాషా కాదు.

బ్రిటన్లో దొంగతనాలు చేసేవారిలో 27 శాతం మంది మాత్రమే బాగా గడించగలుగుతున్నారు. మిగతా 73 శాతం మందికి చాలా తక్కువ మొత్తం లభిస్తుంది. కిటికీలగుండా ఇళ్ళలోకి దూకి దొంగతనాలు చేసేవారిపట్ల కొంతమంది విద్యార్థులతో చేసిన ప్రయోగాల్లో మరి కొన్ని విషయాలు బైటపడ్డాయి. ఆ ప్రయోగ సమయంలో విద్యార్థుల్లో కొందరు చీకటి గదుల్లోకి, కొందరు వెల్తురున్న గదిలోకి దూకాల్సి వచ్చింది. చీకటి గదిలోకి దూకిన విద్యార్థి దొంగలను పరీక్షించడానికి లైటు వేయగానే సగం మంది బిత్తర పోయారు. ముందుగానే పథకం అంతా వివరించి చెప్పినాగాని, నిజంగానే దొంగతనం చేస్తూ పట్టు

# బాక్సాఫీస్ హిట్...?

బాక్సాఫీస్ హిట్ సినిమాలు తీయటంలో రికార్డులు పగల గొట్టిన పెద్ద మనిషిని అరువు తెచ్చుకున్నారా కంపెనీ వాళ్లు...హీరోయిన్ పదకొండేళ్లపిల్ల. అయితేనేం గాక...ఆ మాత్రం పిల్లకు సెక్సప్పీల్ ఉండదా...? గ్లామర్ ఉండదా...? ఎత్తు పల్లాలుండవా...? పోస్టర్లు చూసి జనం థియేటర్ దగ్గరికి పరుగెత్తుకు రారా...? అని దబాయించి అద్భుతమైన కళాఖండం నిర్మాణానికి పూనుకున్నాడాయన.

ఆ తర్వాత ఏం జరిగింది. ఆ సినిమాని ఆయన ఎలా 'బాక్సాఫీస్ హిట్'గా మలిచాడు? ఆ తరువాతి కథ వెండి తెర మీద గాక 'విపుల' సెప్టెంబరు సంచికలో ఆశాభంజ్ దేవ్ కథ "బాక్సాఫీస్ హిట్" చదివి తెలుసుకోండి.

ఈ కథతో పాటు మరెన్నో భాషల వైవిధ్యంగల కథలను జాను తెలుగులో అందజేస్తుంది విపుల.

అదనంగా నవ్వించె జోకులు, కార్టూన్లు, విచిత్రవిశ్వ సరదా విశేషాలు, పంచ వర్ణ చిత్రాలు... 'విపుల' మాత్రమే అందజేసే విశిష్టతలు.

## విపుల

132 పేజీలు — రెండు రూపాయలే

ప్రతి నెలా 1వ తేదీకి వెలువడే విశ్వకథా విపంచి 'విపుల'



కథా ప్రియులకు షడ్రసోపేత విందు 'విపుల'



బడినట్లు వారి గుండెలు మామూలుకంటె వేగంగా కొట్టుకుంటున్నాయని వైద్య పరీక్షలో తేలింది.

## స్మారక చిహ్నాలు

మానవాళి సంరక్షణకు ప్రాణాలను సైతం ధారపోసి తెరమరుగున వుండిపోయిన త్యాగధనులెందరోవున్నారు ప్రపంచంలో. అలాంటి అజ్ఞాత వీరుల సంస్మరణార్థం ప్రతి దేశం స్మారక చిహ్నాలను నిర్మించి కృతజ్ఞతలు తెలియజెప్పడం జరుగుతోంది. జపానులోని టోక్యోలో ఇలాంటి అజ్ఞాత వీరుల స్మారక చిహ్నం ఒకటి వుంది. ఆ స్మారకచిహ్నం కప్పల గౌరవార్థం నిర్మించినది. దీనిక్కారణం వైజ్ఞానిక పరిశోధనల కోసం దాదాపు లక్ష కప్పల్ని చంపటమేనట. కప్పలు మానవాళికి చేసిన సహాయానికి గుర్తుగా శాస్త్రజ్ఞులు ఈ స్మారక చిహ్నాన్ని నిర్మించారు. టోక్యోలోనే మరో స్మారకచిహ్నం ఒక కుక్క జ్ఞాపకార్థం నిర్మించబడింది. దీని యజమాని ఇంపీరియల్ యూనివర్సిటీలో ప్రొఫెసర్. రోజూ ఇతను యూనివర్సిటీకి రైల్లో వెళ్లి వస్తుండేవాడు. ఈ కుక్క ఉదయం రైల్వేస్టేషన్‌కి వెళ్ళి యజమాని రైలెక్కే వరకూ వుండి ఇంటికి తిరిగి వచ్చేది. అలాగే సాయంత్రం స్టేషన్‌కెళ్ళి యజమాన్ని ఇంటికి తీసుకొచ్చేది. ఒకరోజు ఆ ప్రొఫెసర్ హఠాత్తుగా కాలేజీలోనే మరణించాడు. అతను ఒంటరివాడు గనక శవాన్ని ఇంటికి తీసుకురాకుండా అటునుంచటే శ్మశానానికి తీసికెళ్లి పాతిపెట్టేశారు. ఈ విషయాలేమీ తెలియని కుక్క యథాప్రకారం రైల్వేస్టేషన్‌కెళ్ళి యజమాని కోసం ఎదురు చూస్తూ కూర్చుంది. ఎంతకీ రాలేదతను. చివరికి ఆరోజుకిక రాడనుకొని ఇంటికెళ్ళిపోయింది. మర్నాడు మళ్ళీ వెళ్లింది. అయినా యజమాని రాలేదు. ఆ కుక్క ప్రతిరోజూ రైల్వే స్టేషన్‌కెళ్ళి యజమాని కోసం ఎదురు చూసేది. ఒక రోజు కాకపోతే ఒక రోజున్నా రాడా అని దాని ఆశ. అది ఆ విధంగా ఎనిమిది సంవత్సరాల పాటు ఎదురు చూసింది. దాన్ని చూసినస్థానికుల గుండెలు ద్రవించేవి. ఆ నిరీక్షణలోనే అది ఓరోజు మరణించింది. యజమాని పట్ల దానికున్న విశ్వాసానికి చలించిపోయిన స్థానికులు విరాళాలు వసూలు చేసి దాని గౌరవార్థం రైల్వే స్టేషన్ సమీపాన ఓ స్మారక చిహ్నాన్ని నిర్మించారు.



దేశంలోని దరిద్రాన్నంతా వెంట వేసు కొచ్చినట్లు, రోడ్డుమీదున్న దుమ్ము లేపు కుంటూ బర్రున వచ్చి, సడన్ బ్రేకుతో నిలబడింది బస్సు. డ్రైవర్ తల బయటకు పెట్టి చూసి—

"ఏందయ్యోవ్! మరీ కండ్లు కన్పించ కుండా నడుస్తున్నావేం? పరలోకం చూడాలనుకున్నావేటి?" అన్నాడు వెట కారంగా.

నడుస్తున్న వ్యక్తి నిలబడి, డ్రైవరు వైపు చెయ్యి చాపి "ఒళ్లు కొవ్వెక్కిందే మోయ్! జబర్దస్తీగా బస్సు నడపడమే గాకుండా, పైగా నన్నే బెదరిస్తున్నావ్! ఇట్లా అయితే ఈ రోడ్డుమీద నీ బస్సు తిరగదు. జాగ్రత్త" అంటూ హెచ్చరిం చాడు.

"మీ బాబు సొమ్ము కాదోయ్ రోడ్డు" అంటూ దిగడానికుపక్రమించి తిరిగి సీట్లోనే సర్దుకొని హూంకరించాడు డ్రైవర్.

"బస్సు పోనియ్యరా నాయనా! ఈ పల్లెటూరి వారితో మనకెందుకు తగవు! పద పద. వాళ్ళ నోటి నుండి మాట వస్తే చాలు చీలుస్తామంటారు!" అన్నాడు కండక్టర్ 'రైట్' చెప్తూ.

ప్రయాణికుని వైపు చుర్రున చూస్తూ, గేరు మార్చి బస్సు ముందుకు పోనిచ్చాడు డ్రైవర్.

తాడూరు అడ్డరోడ్డు వద్ద బస్సు ఆగుతూనే, అందులోనుండి మేరీ దిగింది. బస్సు వెళ్ళిపోయాక బాగ్ భుజానికి తగిలించుకొని చుట్టూ చూసింది. రోడ్డుకు ఒక పక్కగా చిన్నపాకలో టీ స్టాల్. బయట బెంచీ మీద ముగ్గురు మనుషులు కూర్చున్నారు. ఎటు చూసినా పచ్చటి పొలాలే. కనుచూపు మేరలో గ్రామం కన్పించడం లేదు. చేతికున్న వాచీ చూసుకుంది. సాయంత్రం నాల్గు గంటలు. టీ స్టాల్ వైపు కదిలింది.

బెంచీ మీద కూర్చున్నవారు ఆమె వైపే చూస్తున్నారు. ఈ నవనాగరిక యువతి ఎవరా, ఎందుకిక్కడ దిగిందా అని!

"ఏమండీ! మోదేపల్లె ఎంతదూరం ఉంటుందండీ?" అంది వారి వద్దకు వచ్చి నిలబడి.

"మోదేపల్లా? ఓయబ్బో! చాలా దూరం రెండు క్రోసులు పైనే ఉంటుంది" అన్నాడు ఓ ముసలాయన బీడీ దమ్ము లాగుతూ.

రెండు క్రోసులు; ఐదు మైళ్లు; ఎనిమిది కిలోమీటర్లు; బరువుగా ఊపిరి పీల్చి వదలింది.

"ఇక్కడినుండి రిక్షాలు గానీ, జట్కాలుగానీ ఏమైనా దొరకుతాయాండీ"

ఆ పక్కనున్న యువకుడు గలగల నవ్వాడు. "ఇది పట్నం కాదండీ! మొద్దు పల్లెటూరుఇది. రిక్షాలు, జట్కాలు ఏవీ వుండవు. నడిచి వెళ్ళాల్సిందే!" అన్నాడు.

అలా వెళ్ళాలంటే కనీసం రెండు గంటల నడక. చాలా మంచి గ్రామానికే బదిలీ చేయించగలిగారనుకుంది. ఔను; తనను పీడించడానికి అధికారులు చేసిన పనే ఇది.

"మోదేపల్లె వెళ్ళాలామ్మా?" అడిగాడు ముసలతను.

మేరీ తల ఊపింది వెళ్ళాలన్నట్లుగా!

"ఎవరింటికి వెళ్ళాలి?"

"ఆ వూరికి టీచర్‌గా వేశారు."

ముసలాయన ఆమెను కిందనుండి

పైదాకా చూసి, "ఈ సమయంలో నీవు నడిచి ఎప్పుడు వెళ్తావు? చీకటి పడు తున్నది. పెందలకడే బయలుదేరక పోయావా?" అన్నాడు లేస్తూ.

"ఒంగోలు నుండి ఇటువైపు ఉన్నవే రెండు బస్సులండీ! ఉదయం ఐదు గంటలకు రావాలంటే సాధ్యం కాలేదు. మధ్యాహ్నం బస్సుకు బయలుదేరితే ఈ సమయమయింది" అంది వాచీ చూసు కుంటూ.

"ఈ పల్లెటూళ్ళకు వచ్చే బస్సులు ఎద్దు బండ్లకంటే అధ్వాన్నం. ఛార్జి మాత్రం ఎక్కువే. నేను కూడా ఆ త్రోవే వెళ్ళాలి. పదమ్మా ! పొద్దుపోతుంది" అన్నాడు ముసలతను.

ముందు ఆయన, వెనుక మేరీ నడుస్తు న్నారు. టీ స్టాల్ దాటి కొంత ముందుకు వెళ్ళిన తరువాత కుడివైపున బండ్లబాట కన్పించింది. ఆ బాట వెంట ముందుకు సాగారు.

"ఇక్కడ దగ్గర్లో ఏ ఊరూ లేదా తాతా ?

"రోడ్డుకు ఫర్లాంగు దూరంలో తాడూరు ఉందమ్మా ! చుట్టూ జొన్న పొలం ఉండడం వల్ల మనకు కన్పించడం లేదు."

"నీవు కూడా మోదేపల్లెకేనా తాతా?"

"కాదమ్మా ! మజానగరం వరకూ వస్తాను. అక్కడి నుండి మైలు దూరం ఉంటుంది మోదేపల్లె!"

కొత్త వ్యక్తితో మరింకేమి మాట్లాడాలో తోచక చుట్టూ ప్రకృతిని చూస్తూ నడుస్తున్నది. ముందు వ్యక్తి చాలా నిదానంగా నడుస్తున్నాడు. ఈ లెక్కన గ్రామం చేరేటప్పటికి ఏడు గంటలు దాటుతుంది. మజానగరం నుండి చీకట్లో ఒంటరిగా పోవాలంటే – అసలే దారి తెలియదు. ప్రాంత పరిస్థితులు తెలియవు. ఆమెకు భయంగా ఉంది. ఉదయం వచ్చినా బాగుండేదేమో? ఉదయమే లేవడానికి బద్ధకించినందుకు ఈ పరిస్థితులు దాపురించాయి.

వాతావరణం ప్రశాంతంగా ఉంది. బావుల దగ్గరున్న ఇంజనులు శబ్దంచేస్తూ, నీటిని తోడిపోస్తున్నాయి. మరికొంత ముందుకు వెళ్ళేటప్పటికి, పచ్చటి పొలం అయిపోయింది. ఎండుపొలం నల్లగా చెత్తా, చెదారంతో కన్పిస్తున్నది. అంతకు క్రితం వర్షంపడిందేమో బురద చెక్కా లుగా లేచి, గడ్డకట్టి, ఎండిపోయి, కాళ్ళకు కొట్టుకుంటున్నాయి. చల్లటిగాలివల్ల ప్రయాణభారం కన్పించడం లేదు. సూర్యుడు పడమటి వైపు గ్రుంకడానికి సిద్ధపడుతున్నాడు. మరికొంత దూరంలో గ్రామం కన్పించింది.

"ఇదే మజానగరం. ప్రొద్దు పోతోంది. ఒక్కదానివీ ఎలా పోతావమ్మా ? పైగా సందె చీకటి. తోవంతా ముళ్ళకంపతో నిండి ఉంటుంది" అన్నాడు ముసలాయన. మేరీ గుండెలు గుబగుబలాడుతున్నాయి. ఇటువంటి పరిస్థితి దాపురించినందుకు బాధపడు తున్నది.

"తప్పేదేముంది తాతా? రేపు ఉదయం స్కూలులో జాయిన్ కావాలి. పైగా ఈ ప్రాంతాలలో ఎవరూ తెలిసినవారు లేరు. ఈ ఊరిలో స్కూల్ ఉందా ?"

"ఆ ఉందమ్మా! ఇద్దరు టీచర్లున్నారు. ఈ రాత్రి అక్కడ ఉండవచ్చమ్మా !" అన్నాడు

"వాళ్లు ఈ ఊరిలోనే కాపుర మున్నారా?"

# మీ డబ్బుకి ఇంతకంటె మంచి రక్షణ అవసరం!



ఫలానా చోట భద్రత ఉంటుందని గట్టిగా నమ్మి మీ డబ్బును అక్కడ దాస్తారు. ఆ నమ్మకం కాస్తా వమ్మయితే...! అలా జరిగే అవకాశాలు లేకపోలేదు. అందుకే - కష్టార్జితాన్ని ఎక్కడ మదుపు పెట్టాలా అన్న విషయంలో మీరు బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి రావడం చాలా ముఖ్యం.

రెండు దశాబ్దాల అనుభవం ఉన్న మార్గదర్శిలో మీరు పొదుపుచేసే మొత్తాలకు పూర్తి రక్షణ ఉంటుంది. అందరి అవసరాలకూ సరిపడే విధంగా వివిధ రకాల చిట్‌లు మార్గదర్శిలో మీకు అందుబాటులో ఉన్నాయి. అంతేకాదు, మీరు పొదుపుచేసే మొత్తాలకు ఆకర్షణీయమైన డివిడెండ్లు కూడా తోడవుతాయి.

మార్గదర్శిలోని హితులు మీ ఆశలకూ, ఆశయాలకూ ఒక ఆకృతి కల్పిస్తారు. మార్గదర్శిలో పొదుపు చేస్తే ధనానికి పూర్తి రక్షణ ఉంటుందని లక్షమందికి పైగా ఇప్పటికే గ్రహించారు.

మరి మీ మాటేమిటి ?

డబ్బు కోసమేనా మీ చింత - మార్గదర్శి ఉన్నది మీ చెంత!



**మార్గదర్శి**

చిట్ ఫండ్ ప్రైవేటు లిమిటెడ్

మార్గదర్శి హౌస్, అబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

శాఖలు: ● అబిడ్ సెంటర్, హైదరాబాద్ ● లక్డీకాపూల్, హైదరాబాద్ ● చిక్కడపల్లి, హైదరాబాద్ ● అమీర్‌పేట, హైదరాబాద్ ● చంద్రలోక్ కాంప్లెక్స్, సికిందరాబాద్ ● బిసెంట్ రోడ్, విజయవాడ ● బందరు రోడ్, విజయవాడ ● మెయిన్ రోడ్, గుంటూరు ● మెయిన్ రోడ్, కాకినాడ ● ఇన్నీసుపేట, రాజమండ్రి ● నెహ్రూ రోడ్, కర్నూలు ● మెయిన్ రోడ్, విశాఖపట్నం ● జె. పి. ఎన్. రోడ్, వరంగల్

KIRON/MCF/81/1

"ఎలీశమ్మ అనే ఆమె ఇక్కడే స్థిరపడింది. ఆమె పల్లెలో కాపుర ముంటుంది. కిరస్తానీ మనిషి. మీరేమిట్లమ్మా?"

"మేము హరిజనులం తాతా?"

"మేముకూడా మాదిగోళ్లమే అమ్మా! అయితే ఈ రోజు ఆమెదగ్గర ఉండి ఉద యమే వెళ్తే బాగుంటుంది" అన్నాడు.

"ఆమెతో నాకు పరిచయం లేదు. సరే! అక్కడికే వెళ్తాను. ఈ రాత్రి గడపాలి ఏదో విధంగా!" అంది.

ముసలాయన గ్రామం శివారులోనే ఉన్న పల్లెవైపు దారి తీశాడు. అన్నీ పూరి గుడిసెలే! కొన్నింటి మీద కప్పు కూడా లేచింది. మొలన గుడ్డ కూడా లేని పిల్లలు కొందరు ఆడుకుంటున్నారు.

పల్లె మధ్యలో వేపచెట్టు, దాని చుట్టు అరుగు, ఆ పక్కనే ఉన్న పూరింటి వద్దకు దారి తీశాడు అతడు.

"ఎలీశమ్మా! ఓ ఎలీశమ్మా!" అంటూ కేక వేసేసరికి లోపలనుంచి నడివయస్సు స్త్రీ బయటకు వచ్చింది. వీరిద్దరినీ చూసి "ఏమిటి బాబాయ్! రా! కూర్చో!" అంది.

"నే కూర్చొడానికేంగానీ, ఈమె టీచరమ్మట. మోదేపల్లె వెళ్ళాలని అడ్డ రోడ్డులో దిగింది. ఇప్పుడు మోదేపల్లె వెళ్ళాలంటే చీకటి పడుతుందని, నీ పేరు చెప్పి ఇక్కడికి తీసుకొని వచ్చాను" అన్నాడు ఆమెను చూపిస్తూ.

ఇద్దరూ ఒకరినొకరు పరిచయం చేసు కున్న తర్వాత "కూర్చోండి!" అంది మంచం వాల్చుతూ. బ్యాగ్ మంచంమీద పెడుతూ "కొంచెం మంచినీళ్లు ఇస్తారా?" అంది ముసలాయన వెళ్ళాక.

"దొడ్లో కాళ్లు కడుక్కోండి." అంటి చెంబు తెచ్చి ఇస్తూ. కాళ్లు కడుక్కొని టవల్‌తో ముఖం తుడుచుకుంటుండగా మంచినీరు తెచ్చి ఇచ్చింది.

"ఇక్కడే కూర్చోండి. వంట కార్య క్రమంలో ఉన్నాను. పది నిముషాల్లో వస్తాను" అంటూ లోనికి వెళ్ళింది. మంచినీళ్లు తాగి మేరీ చుట్టూ చూస్తూ కూర్చుంది. వాతావరణం రణగొణధ్వనిగా ఉంది. పల్లెలో పిల్లల అరుపులూ, పెద్దల పిలుపులూ, కాకుల అరుపులు విన్పిస్తున్నాయి. దూరంగా పిల్లలు కొత్త వ్యక్తి ఎవరా అని చూస్తూ నిలబడ్డారు క్రమంగా చీకటి పడుతున్నది. వేప చెట్టు మీద పక్షులు అరుస్తూ, స్థావరాల్ని వెతుక్కుంటున్నవి.

"ఏ ఊరు మీది?" అంటూ బయటకు వచ్చింది ఎలీశమ్మ చేతులు తుడుచు కుంటూ.

"ఒంగోలండీ! మోదేపల్లెకు ట్రాన్స్ ఫర్ చేశారు. ఇంతకుముందు సనక లూరులో పనిచేశాను."

"సర్వీసెంత?"

"ఒక సంవత్సరం ఉంది!"

"సనకలూరులో ఎందరు టీచర్లు న్నారు?"

"నలుగురున్నారండీ?"

"ఇంతకంటే దరిద్రపు ఊర్లు దొరక కనా ఇక్కడకు రావడం? ఏ సౌకర్యమూ లేదు. పైగా అడవిలాంటి ప్రాంతాలు. జనం కూడా అలాంటివారే! పెత్తం దారులకి లొంగి ఉండకుంటే హింసలూ, బెదిరింపులూ! ఇంత చిన్న వయస్సులో ఈ ప్రాంతంలో నీవు టీచర్‌గా పని చేద్దా మనే వచ్చావా?"

"నేనేం చేయగలనండీ! బతకలేక బడిపంతులుద్యోగం అన్నారు. ఏదీ గతి

లేకనే ఈ ఉద్యోగం. ఇది కూడా ఎందరి కాళ్ళా వేళ్ళానోబడి సంపాదించుకున్నాను. ఆదిలోనే హంసపాదులాగా ఈ బి.డి.వో. ఇక్కడ పడేశాడు. గతిలేనప్పుడు చేయక తప్పదు కదా?"

"అలా చెప్పు! ఈ ఆఫీసర్లకు వ్యతిరేకం అయిన వారందరినీ ఖైదీలలాగా ఏ సౌకర్యమూ లేని ప్రాంతాలకు తరలించడం అలవాటు".

మేరీ మాట్లాడలేదు. ఆమె వైపే చూస్తూ కూర్చుంది.

"నేను ఇక్కడికి వచ్చి పది సంవత్సరాలయింది. ఇక్కడ ఇద్దరు టీచర్లం. పల్లెలో నాకు బంధువర్గం ఉంది. మోదేపల్లె మా స్వగ్రామం. నాకు ఇక్కడ అసౌకర్యమేం లేదు. కాని, మీరు ఇంత వరకూ టౌన్ ఏరియాలో ఉన్నవారు. ఒక్కసారిగా ఈ ప్రాంతాలలో ఇమడాలంటే చాలా కష్టం. స్కూళ్లలో వసతులుండవు; అడిగే హక్కు ఉన్నా ఉపయోగించలేము. పైగా పెత్తందారుల దౌర్జన్యాలకు నిలయం. అందువల్లే తెలిసినవారెవరూ ఇటువంటి గ్రామాలకురాకుండా ప్రయత్నాలు చేసుకుంటారు. సరే! లేవండి, ఎప్పుడు భోజనం చేశారో?" అంది ఎలీశమ్మ.

"భోజనానికేం తొందరలెండి. ఈ ప్రాంత పరిస్థితులేమిటండీ? మోదేపల్లె స్కూలు పూరికొంపా, బిల్డింగుకట్టారా?"

"బిల్డింగే కట్టారు. ఆ గ్రామం చిన్నది. ఈ రెండు గ్రామాలు కలిసి ఒకే పంచాయతీ; ప్రెసిడెంటు అప్పారెడ్డి ఆ ఊరు వ్యక్తే! పరిస్థితులు నేను చెప్పే కంటే, మీకే తొందరగా అర్థమవుతాయి. వీళ్లు విషపు కత్తులు. పట్టణాల్లో పైకి పంచదార పలుకుల్లా ఉంటారు; లోన ఎంత విషంగా ఉన్నా! ఇలాంటి మారుమూల పల్లెల్లో పైకే విషం కక్కుతుంటారు. వాళ్ళకు ఎదురులేదు. వాళ్ళ ప్రతాపం టీచర్ల మీదే చూపిస్తుంటారు. అది పేరుకు మోదేపల్లె కాదు. నిజంగానే అది మోదడంలో (కొట్టడంలో) ఆరితేరిన పల్లె. మీరే గ్రహిస్తారు త్వరలో!"

మేరీ దీర్ఘంగా నిట్టూర్చింది. సౌకర్యాలు లేని గ్రామానికే తనను తరలిస్తారని ముందుగానే ఊహించింది గానీ మరీ ఇలాంటి ప్రాంతానికి వేస్తారను కోలేదు. అయినా తప్పదు. రాజీనామా చేసి వెళ్ళే ధైర్యం, స్థాయి తనకు లేదు. ఎట్టి ఇబ్బందు లెదురయినా, ఎన్నిబాధలు కలిగినా చచ్చినట్లు పడివుండక తప్పదు.

భోజనం చేసి పడుకొనేటప్పటికి తొమ్మిది దాటింది. ఎలీశమ్మ తప్ప ఆ ఇంట్లో మరెవ్వరూ లేరు. ఆమె వివరాలు అడగడం మర్యాద కాదేమోనని విచారించ లేదు. బయటి చల్లటి పిల్లగాలులతో ప్రయాణ బడలిక తీర్చుకుంటూ పడుకుంది మేరీ.

* * *

ఉదయం ఐదు గంటలకే లేచి, ఎలీశమ్మకు కృతజ్ఞతలు తెలిపి మోదేపల్లె బాట వెంట సాగింది మేరీ. అప్పుడే అరకలు పొలాలకు సాగుతున్నాయి. పొలం పనులకు వెళ్ళే జనం బాటవెంట చాలా మందే వెళ్తున్నారు. దారి అంతా ఎగుడు దిగుడుగా, అడవి తుమ్మలు తోవ కిరువైపులా పెరిగి ఉన్నాయి. ఏడు గంటలకు మోదేపల్లెకి వచ్చింది. గ్రామం ప్రారంభంలో దేవాలయం ఉంది. కొంచెం దూరం ముందుకు వెడుతూనే స్కూల్ బిల్డింగ్ కన్పించింది. దానిమీద

 

'పంచాయతీ సమితి ఎలిమెంటరీ స్కూలు మోదేపల్లె' అని ఉంది. ఆవరణలో అడుగు పెట్టింది. వసారాలో అప్పటికే పిల్లలు చేరి గోలికాయలు ఆడుకుంటున్నారు. మరికొందరు బొంగరాలు తిప్పుతున్నారు. ఒకచోట ఇద్దరు పిల్లలు కలియబడి కొట్టుకుంటున్నారు. ఆవరణలో ఉన్న బావి వద్ద నుండి నీళ్ళు చేదుకొని వెళ్తున్నారు కూడా! బావిలో నీళ్ళు సరిగా లేవేమో చిన్న డబ్బాలతో చేదుకుంటున్నారు. వాతావరణం ఉదయం పూట సందడితో నిండి ఉంది. తలుపుకు వేసిన తాళం చూసి వెనుతిరిగింది.

అంతవరకూ ఆమెనే చూస్తూ బావి వద్ద నిల్చున్న యువతి "ఏవూరు మీది?" అని పలకరించింది.

"నేను ఈ స్కూలుకు టీచర్‌గా వచ్చాను. ప్రెసిడెంటుగారి ఇల్లు ఎక్కడమ్మా?"

"సరాసరి ఇదే బజారు వెంట వెళ్ళండి. కొంత దూరం వెళ్ళినతరువాత పెద్ద వసారా, ఆ వసారాలో జనం కూర్చొని ఉంటారు; అదే"

మేరీ ముందుకు నడిచింది. ఆ గ్రామంలో అదొక్కటే బజారులాగున్నది. అటు ఇటు ఇళ్లున్నాయి. అన్నీ పెద్ద లోగిళ్ళతో, రాతి కట్టడాలతో ఉన్నాయి.

కొంత దూరం వెళ్ళి, త్రోవన వెళ్తున్న మరొక పిల్లవాడిని ప్రెసిడెంటు ఇల్లు గురించి అడిగింది.

చీమిడి చీదుకుంటూ, లాగు ఎగ త్రోసుకుంటూ ఆమె వైపు చూసి, "నేనూ అక్కడికే వెళ్తున్నాను: చూపిస్తారా!" అంటూ దారితీశాడు.

ప్రెసిడెంటు ఇంటి ముందు మంచాలు వేసుకొని కొందరు కూర్చునున్నారు. మరి కొందరు కింద, ఇంకొందరు వసారాలో కూర్చున్నారు. అంత మంది ముందుకు వెళ్ళాలంటే బిడియంగా ఉన్నా పోక తప్పదు.

వస్తున్న మనిషిని చూసి 'ఎవరా' అని అందరూ కుతూహలంగా ఆమె వైపే చూస్తున్నారు. వారి చూపులు ఎదుర్కోలేక తల వంచుకుని వసారాల్లో వెళ్ళి నిలబడి "ప్రెసిడెంటుతో మాట్లాడాలని వచ్చానండీ!" అంది అక్కడున్న ఒకరితో.

"ఆయనగారు ఊరిలో లేరండీ! సాయంత్రం రావచ్చు. ఎవరు మీరు?" అన్నాడావ్యక్తి.

"ఈ గ్రామం స్కూల్‌కు బదిలీ చేశారండీ! ఈ రోజు జాయిన్ అవుదామని వచ్చాను. స్కూల్‌కు తాళాలు వేసి ఉన్నాయి"

"తాళం చెవులు ఇంట్లోనే ఉంటాయండీ ఆయన భార్యను అడిగితే ఇస్తుంది. అంటూ "రాజమ్మా!" అని కేకేశాడు.

పదేళ్ల అమ్మాయి బయటకు వచ్చింది.

"స్కూల్ తాళాలు తెచ్చివ్వమ్మా! ఈమె మీ టీచరమ్మ" అన్నాడు.

ఆ పాప లోనికి వెళ్ళి తిరిగి బయటకు వచ్చి "లోనికి రా టీచర్" అంది. ఇంట్లో విశాలంగా ఉంది. జనం కూడా లేరు–ఇద్దరు ఆడవాళ్ళు తప్ప!

ముసలమ్మ ఎదురువచ్చి "కూర్చోమ్మా" అంది.

కుర్చీలో కూర్చుంటూ "ఈ రోజు నుండీ స్కూలు తెరవాలని వచ్చాను. తాళాలు యిస్తే వెళ్ళి స్కూలు తెరుస్తానండీ" అంది.

ఆమె నవ్వింది. "ఏమంత తొందర? ఈ స్కూల్ మూతపడి మూడు నెలలు అయింది. ఏ టీచరు వచ్చినా నెలకు మించి ఉండరు. మళ్ళీ ఇంకోరు రావడానికి నెల పడుతుంది. పిల్లలకు చదువుకోవాలనే అభిలాష కూడా చచ్చింది. తెరవచ్చులే! తొందరేం!" అంటూ లోనికి వెళ్ళింది.



"ఏం చదువుతున్నావ్ పాపా!" అంది మేరీ ఎదురుగా నిలిచి తననే చూస్తున్న పాపతో. రాజమ్మ సిగ్గుతో మెలికలు తిరుగుతూ "నాలుగు" అంది.

నడి వయస్సు స్త్రీ మేరీ వద్దకు వచ్చి తాళాలు ఇచ్చింది. తాళాలు తీసుకొని లేచింది. బయట తలోక విధంగా మాట్లాడు కుంటున్నారు. కొత్త వ్యక్తి, అందులో స్త్రీ కన్పిస్తే కావలసినంత పురాణం పుకార్లు పుట్టించడంలో మేధావులు చాలా మందే ఉంటారు.

అక్కడినుండి స్కూలుకు వచ్చింది. కనీసం కాఫీ అయినా ఇస్తారేమో అను కుంది. తీరా మంచినీరు కూడా లేదు. పట్నంలో ఉంటే ఈపాటికి కాఫీ తాగడం పూర్తయ్యేది. గ్రామ పరిస్థితి చూస్తే హోటళ్లు ఉంటాయనే నమ్మకం లేదు. స్కూల్ తాళం తెరచి లోపలకు వెళ్ళింది.

అది ఒకే ఒక రూము. హాలులో ఒక టేబుల్ తప్ప మరింకేమీ లేవు. అదీ డొక్కు టేబిల్. హాలు దుమ్ము ధూళితో నిండి ఉంది. ఊడ్చి దిక్కు కూడా లేన ట్లుంది. ఇప్పుడు ఊడవాలంటే ఏం చెయ్యాలి? తాను ఊడ్చుకోక తప్పదు. వివరాలడిగేందుకు ప్రెసిడెంటు ఊళ్లో లేడు. చీపురు లాంటిది కన్పిస్తుందేమో నని చుట్టూ చూసింది. ఏమీ కన్పించక బయటకు వచ్చింది. స్కూల్ గంట బయట వేలాడదీసి ఉంది. కనీసం అదన్నా ఉన్నందుకు సంతోషించి లోపలున్న ఇనుప బద్ద తెచ్చి గంట మోగించింది.

ఆవరణలోని పిల్లలు భళ్లున పరు గెత్తుకుంటూ వచ్చారు. బావి దగ్గర నీళ్ల

చేదుకుంటున్నవారు స్కూల్ వైపు తిరిగి చూస్తున్నారు.

ముసలమ్మ ఒకామె చీపురు చేతపట్టుకుని మేరీ వద్దకు వచ్చి నిలబడింది. ప్రశ్నార్థకంగా చూసింది మేరీ.

"ప్రెసిడెంటు భార్య పంపిందమ్మా! చిమ్మమంటారా?" అంది. ముసలమ్మతో పాటు లోనికి వెళ్లింది మేరీ.

"ఈ స్కూలులో వస్తువులేమయ్యాయి?" అంది ఆమె ఊడుస్తుంటే వెనుక నిలబడి.

"ఏమోనమ్మా నాకేం ఎరిక! అదంతా ప్రెసిడెంటుగారే చూసుకుంటారు. ఏ పూరమ్మా మనది?"

"ఒంగోలులే. ఈ ఊళ్లో కాఫీ హోటల్ ఏదయినా ఉందా? ముందు తిండి తినాలి"

"హోటలెక్కడుందమ్మా! ఈ ఊరికి అదొక్కటే తక్కువ? పాపం! ఎక్కడ నుండి వచ్చావో... ప్రెసిడెంటుగారి ఇంటి వద్ద తాగకూడదమ్మా?" అని మేరీ ముఖం చూసి "అయినా వాళ్లు ఇచ్చేవాళ్లు కూడా కాదులే - మంది సొమ్ము తినడం తప్పు!" అంటూ కసవు చిమ్మి వసారా ఊడుస్తున్నది. అంతవరకూ టేబిల్ మీద కూర్చొని రాసుకుంటున్నది మేరీ.

పిల్లలు ఒకరొకరే రాసాగారు. హాజరు పట్టీలేదు. ప్రెసిడెంటు వస్తేగానీ అది ఎక్కడున్నదీ తెలియదు.

ముసలమ్మ ఆమె వద్దకు వచ్చి నిలబడి "అమ్మగారి పేరేమిటో?" అంది ప్రశ్నార్థకంగా చూస్తూ.

"నాపేరా? మేరీ. కనీసం ఇక్కడ పాలయినా దొరుకుతాయా ముసలమ్మా"

"ఆఁ! పాలకేం కరువు? ఈ ఊళ్ళో పాల డిపో లేదు. అందువల్ల పాలు మాత్రం దొరుకుతాయి. తెమ్మంటావా అమ్మా?"

చిన్న పిల్లవాడు ముందుకు వచ్చి "టీచర్! టీచర్! మా యింట్లో పాలు ఉన్నాయి; తెమ్మంటావా?" అన్నాడు చొక్కాతో ముక్కు తుడుచుకుంటూ.

"ఎక్కడ మీ యిల్లు?"

"దగ్గిరే టీచర్! ఇప్పుడే తెస్తాను" అంటూ బయటకు పరుగెత్తాడు.

"నా పేరు దేవమ్మ! మేము కిరస్తానీలం! ఊరి పక్కన పల్లె ఉంది. అక్కడే మా కాపురం. ఏం కాపురాలోలే.. మా బతుకులు మహా భయంకరం. నోరెత్తి మాట్లాడితే తంతారు. ఈ ప్రెసిడెంటుగారింట్లో పనిచేస్తూ ఇరవై ఏండ్లయింది. ఇంతవరకూ వాళ్ళకు అప్పేగానీ మేం కడుపునిండా తిండి తిన్నదీ లేదు. గొడ్డుగొడ్డి పని చేయిస్తారు. మీరేమిట్లమ్మా!"

ముసలమ్మ మాటలు వింటూ ఆమెనే చూస్తున్న మేరీ "నేను కూడా నీ కులం దాన్నే ముసలమ్మా!" అంది నవ్వుతూ.

"అంటే నీవు కూడా మాదిగోళ్ళ కూతురివేనన్న మాట! నా కర్మ! ఒంటిగా నీవు ఇక్కడ ఎలా ఉంటావు? ఇది రావణాసురుని రాజ్యమే. మాల, మాదిగలంటేనే ఈ రెడ్లకు అలుసు. అందులో ఒంటిగా ఉన్న ఆడది ఇంకా అలుసు" అంటుండగానే ఒక యువకుడు లోనికి తొంగి చూశాడు.

ముసలమ్మ నోరు మూసుకుంది. మేరీ కొంగు సవరించుకుని, టేబిల్ దిగి నిలబడింది. పిల్లలు పలకలు చేతపట్టుకొని వరుసగా కూర్చున్నారు. ఒకరిద్దరు గోడకు ఆనుకొని కూర్చున్నారు.

అతడు లోనికి వచ్చి మర్యాదగా సమస్కారం చేసి "మీరేనా పంతులమ్మ గారు?" అన్నాడు. మేరీ ప్రతినమస్కారం చేసి "అవునండీ!" అంది.

"మా ఊర్లో ఇక స్కూల్ తెరుస్తారో లేదో అనుకున్నాం. సరే! సమయం మించిపోయినా తెరిచారు. అదే చాలనుకోండి. నా పేరు రమేష్! మాది ఈ ఊరే లెండి. స్కూల్‌కు సంబంధించి సంతవరకూ మీకు ఏం కావాలన్నా అడగండి. మేము సహకరిస్తాము" అన్నాడు హాలును కిందికి, పైకి చూస్తూ.

పిల్లవాడు పాలు గ్లాసుతో తెచ్చి మేరీ ముందు పెట్టాడు.

"పాలు తీసుకోండి" అంది మర్యాద కొరకు. అతడు తాగితే తాను పస్తు ఉండాల్సి వస్తుందని తెలుసు. అయినా మర్యాద తప్పదు.

రమేష్ నవ్వాడు. "ఇప్పుడే కాఫీ తాగివస్తున్నాను. ఊర్లో ఇల్లు మాట్లాడుతున్నారా? వంట కార్యక్రమమేమిటి? ఇక్కడ హోటల్ కూడా లేదు"

"ఇంకా ఆలోచించలేదండి. ఎంత పల్లెటూరయినా హోటల్స్ ఉంటాయి కదా! ఇక్కడా ఉంటవచ్చనుకున్నాను. పరిస్థితి అలా లేదు. రెండు రోజులలో మా వూరు వెళ్ళి సామాన్లు తెచ్చుకుంటాను. అంతవరకు ఏదో ప్రయత్నం చేస్తాను."

"ముందు ఇల్లు చూసుకోవాలి కదా! సరే పొలం వెళ్తూ స్కూలు తెరచి వుంటే ఇట్లా వచ్చాను. మధ్యాహ్నం మా యింటి నుండి అన్నం ఇక్కడికే పంపిస్తాను. ఎక్కడికీ వెళ్ళకండి" అంటూ వెళ్ళాడు.

అతన్ని చూస్తూ ముసలమ్మ "బాపనోళ్ల పిల్లగాడు. ఏదేదో మాట్లాడుతుంటాడు. ఏదేదో చేస్తుంటాడు. అన్నీ చేస్తానని పంచాయితీ ఓట్లలో నిలబడ్డాడు. అప్పారెడ్డి చేతిలో ఓడిపోయాడు. పిల్లోడు మంచోడే గానీ ఏం లాభం? ఏదేదో వాగుతుంటాడు. సరేనమ్మా నే వెళ్తాను మరి! మళ్ళీ ప్రెసిడెంటు ఇంటివద్ద కూడా పనులు చేయాలి" అంది.

"సరేగాని దేవమ్మా! నాకొక మంచి ఇల్లు చూసిపెడతావా? గ్రామంలో తిరుగుతుంటావు కదా? ఖాళీ ఇల్లు తెలిసే ఉంటాయి."

"గ్రామంలో నిన్ను ఉండనివ్వరమ్మా! మాల, మాదిగోళ్లు వాళ్ళెంత ఉద్యోగులయినా ఊర్లో ఉండనివ్వరు. ఉంటానంటే మా పల్లెలో చూస్తాను".

"సరే ఎక్కడయితే ఏం? నీళ్ళకు అందుబాటులో ఉండాలి."

"మధ్యాహ్నం నాకు తీరికగా ఉంటుంది. అప్పుడు మళ్ళీ వస్తాగా?" అంటూ చీపురు అక్కడే పడేసి వెళ్ళింది.

వచ్చిన పిల్లలు ఏయే తరగతివారో తెలుసుకుని, తరగతి చొప్పున విడదీసి కూర్చుండబెట్టింది. మొత్తం కలిపి పన్నెండు మంది పిల్లలున్నారు. వారి హాజరు పట్టీ తెల్ల కాగితం మీద రాసుకుంది. ఈ పూట వాళ్ళకు చెప్పే ఓపిక లేదు. శరీరం బడలికగా ఉంది. ఉదయం లేస్తూనే స్నానం చేయడం అలవాటు. ఇక్కడ ఏ వసతీ లేదు. కనీసం పలకరించే దిక్కయినా లేనట్లుంది. తను మగవాడయితే వెళ్ళి పరిచయం చేసుకుని కావలసిన సౌకర్యాలు పొందవచ్చు. స్త్రీ కావడం, పైగా కులపట్టింపు ఉన్న ఈ పల్లెటూళ్ళో తనో తక్కువ జాతి వ్యక్తి కావడం, ఇవన్నీ ఆమెకు ఇబ్బందిగా తయారయ్యాయి. మరో రెండు రోజులు ఎలాగో కాలం గడిపి తల్లిని వెంట తెచ్చుకుంటే

సరిపోతుంది. ఎట్టి ఇబ్బందులు లేకుండా తల్లి సర్దుకుపోతుంది.

ఆ పూట పిల్లలకు ఏమీ చెప్పలేదు. వాళ్ళకు తెలిసింది రాసి చూపించమంది. పది గంటలకు ఇళ్లకు పంపింది. తలుపు చేరవేసి, వసారాలో దుప్పటి పరుచుకుని చదువుకుంటూ కూర్చుంది.

కాసేపటికి దేవమ్మ పెద్ద గిన్నె, బుంగ చేత పట్టుకొని వచ్చింది. గిన్నె అక్కడ పెట్టి "బాపనోళ్ళబ్బాయి బజార్లో కన్పించి, నన్ను ఇంటికి తీసుకెళ్ళి గిన్నెలో అన్నం పెట్టి పంపించాడమ్మా! ఉండు నీళ్లు తెస్తాను" అంటూ బుంగ తీసుకుని వెళ్ళిపోయింది.

ఆమె తిరిగి వచ్చేటప్పటికి గిన్నె లోపల పెట్టి, దుప్పటి కూడా లోపల వేసుకుని కూర్చుంది మేరీ.

"ఈ బావి నీళ్ళు తాగేవి కావా? చాలా దూరం వెళ్ళి తెస్తున్నావు?"

"మనల్ని చేదుకోనివ్వరు. అది గ్రామం వాటికి మాత్రమే"

దీర్ఘంగా శ్వాస విడిచింది మేరీ. వచ్చి నాలుగు గంటలు కాలేదు. తన కులం సాయి ఏమిటో బయట పడుతున్నది. ఈ గ్రామంలో ఈ విధంగా ఎన్ని అవమానాలు భరిస్తూ నిలబడాలో. 'పట్టణాలలో లాగా సమానత్వం లేదు; కనీసం చూచీ చూడకుండా సర్దుకుపోయే తత్వం లాగా కూడా కన్పించడంలేదు' అనుకుంది.

'సరే దేవమ్మా! నీవు కూడా చేతులు కడుక్కో! ఇక్కడే అన్నం తిందాం" అంది.

"వద్దమ్మా! నేను ఇంటికి వెళ్తాగా!"

"భలేదానివే! ఇదంతా నేను తింటానా ఏం! కావాలంటే ఇంటికి వెళ్ళి మళ్ళీ తిందువుగానీ; లేచి చేతులు కడుక్కో!"

బలవంతం మీద లేచింది దేవమ్మ. గిన్నెలో అన్నం ఆకులో పెట్టి మిగిలిన గిన్నె ఆమె చేతికిచ్చింది.



"ఈ రెండు రోజులు నాకు తోడుగా ఉండు దేవమ్మా! నేనూ ఒంటరి దాన్ని; తొందరగా ఇల్లు దొరికితే బాగుంటుంది" అంది.

"తప్పకుండా ఉంటానమ్మా! ఈరోజే పల్లెలో మాట్లాడతాను. పల్లెలో, అయితే మాకు తోడుగా ఉంటావు".

అన్నం తిని, గిన్నెలు కడిగి, హాలులో ఒక మూలన పెట్టింది దేవమ్మ. కళ్లు మూసుకుపోతున్నా, తెగని ఆలోచనలతో పడుకున్నది మేరీ. దేవమ్మ బయట వసారాలో కొంగు పరచుకొని పడుకుంది.




సాయంత్రం ఐదు గంటలకు దేవమ్మ వెంట పల్లెకు వెళ్ళింది మేరీ. అప్పటికే తమ కులం అమ్మాయి పంతులమ్మగా వచ్చిందని తెలిసి ఉండడంతో పిల్లలు, ఆడవారు చుట్టుముట్టారు. దేవమ్మ తన ఇంటి వద్దకు తీసుకెళ్ళి మంచం వేసి కూర్చోబెట్టింది. పల్లెలో మహా ఉంటే ముప్పై ఇల్లు ఉండవచ్చు. అవి ఇల్లనడం కంటే గొడ్ల చావిళ్లు అనడం మేలు! కొన్ని అంతకంటే అధ్వాన్నంగా ఉన్నాయి. పైన తాటాకు లేదు. కొన్ని కూలడానికి సిద్ధంగా ఉన్న మట్టిగోడలు. పల్లె కంతకూ కలిసి రెండు చెట్లు. అందులో ఒకటి రచ్చబండ వద్ద, మరొకటి చర్చి వద్ద ఉన్నాయి. ఎక్కడ చూసినా ఇండ్ల ముందు మురికి నీరు నిలువ ఉంది. వాటి మీద ఈగలు గుంపు గుంపులుగా లేచి రొద చేస్తున్నాయి. వీధులనేవే లేవు. అన్నీ ఛిన్న చిన్న గొందులే. చెత్తా చెదారంతో నిండి ఉన్నాయి అవి.

అసలే వెనుకబడిన గ్రామం. అందులో మరింత వెనుకబడిన పల్లె. చదువువచ్చిన వారు ఏ ఐదారుగురో! పిల్లలకు చదువు చెప్పించడానికి వాళ్ళు సిద్ధంగా లేరు. ఈ చదువులు చదివి అందుకూ-ఇందుకూ కొరగాకుండా పోవడం కంటే, చిన్నప్పట్నుంచీ కూలి చేసుకుంటే పొట్ట నిండుతుందని వారి ఆలోచన.

అందరిలోనూ ముసలి వ్యక్తి ఆమె ముందుకు వచ్చి చూస్తూ నిలబడ్డాడు.

"ఎన్నాళ్ళయిందమ్మా పనిలో చేరి?" అన్నాడు బీడీ కాల్చుకుంటూ.

"ఇది రెండో సంవత్సరం తాతా!"

"అమ్మా నాన్నా ఉన్నారా?"

"అమ్మ ఉంది. నాన్న చనిపోయి రెండు సంవత్సరాలవుతుంది. తమ్ముడున్నాడు"

"పెళ్ళయిందా?"

తలూపింది.

"ఆయన ఏం చేస్తాడు?"

"లేదు; చనిపోయాడు".

"అయ్యో! ఇంత చిన్న వయస్సులోనా?" అంది ముసలమ్మ సానుభూతిగా. పల్లెటూళ్ళలో ప్రశ్నలతో వేధిస్తారు. చెప్పకపోతే అహంకారం కింద జమ కడతారు.

కొద్దిసేపు నిశ్శబ్దంగా నిలబడ్డారు. చీకటి పడుతున్నది. ఒక్కొక్కరే ఇళ్లకు వెళ్తున్నారు. దేవమ్మ బయటకు వచ్చి "ఏసు అన్నయ్యా! నీయింట్లో ఒక

భాగం ఆమెకివ్వు ! మన పల్లెలోనే ఉంటుంది" అంది.

"ఆమె ఉండాలేగాని, ఎవరు వద్దంటున్నారే ? అయినా నా ఇల్లెందుకు మురికి కంపు కొడుతూ ! వర్షం పడితే లోపల తప్ప బయట కురవదు. పేరయ్య ఇల్లుంది గదా! ఎలాగూ వాడు ఊరిలో లేడు"

"వాడు తాళం వేసుకుని వెళ్ళాడు గదా! ఎట్లా మరి?"

"ఎట్లా ఏంది? తాళం తీయించి ఇంట్లో చేరడమే ! వాడు వచ్చిన తర్వాత చెప్పొచ్చులే!"

అప్పటికప్పుడే మారు తాళం చెవితో ఆ ఇల్లు తెరచారు. ఇల్లు చిన్నదేఅయినా శుభ్రంగా ఉంది. గోడలు మట్టివేఅయినా అలికి ఉంచారు. పైకప్పు కూడా గట్టిగానే ఉంది. చాలా రోజుల నుండి కాపురం లేకపోవడంతో బూజు పట్టి ఉంది. బయటి నుండి దీపం తీసుకొని వచ్చారు ఒకరు.

"నీకు అయితే ఈ ఇల్లు బాగుంటుందమ్మా! పల్లె మధ్యలో రచ్చబండ ఆనుకొని ఉంది. రచ్చబండ మీద ఎప్పుడూ ఎవరో ఒకరు ఉంటారు. నీకేం భయం లేదు. ఉండదలచుకుంటే వచ్చి చేరు" అన్నాడు ఏసు.

"ఉంటాను తాతా ! అద్దె ఎంత ఇవ్వమంటారో కనుక్కో మరి! రెండు రోజుల్లో వచ్చి చేరతాను".

ముసలతను నవ్వి "అద్దె ఎవరడుగుతారమ్మా! నేను అతడికి చెప్పేస్తా; నీవు వచ్చి చేరు" అంటూ బయటకు వచ్చి వెళ్ళిపోయాడు. మేరీ దేవమ్మ ఇంటికి వచ్చింది. ఆ రాత్రి భోజనం, పడక కూడా అక్కడే!

విరామ సమయంలో పల్లె పిల్లలకు చదువు చెప్పాలనుకుంది. ఎలాగూ వాళ్లు స్కూలుకు రాలేరు. రాత్రి రోజూ ఒక గంట సేపు చెప్పినా కొంతవరకూ చదువుకోగలరు. తన వాళ్ళకు తనూ కనీస సహాయం చేసినట్లు ఉంటుంది. ఈ మురికి నుండి తేరుకోవడానికి తోడ్పడినట్లుంటుంది అనుకుంది.

అలసటతో చాలా తొందరగానే నిద్ర పట్టింది మేరీకి.

* * *

మరుసటి రోజు స్కూలు విడిచిన తర్వాత ప్రెసిడెంటు వచ్చిన వార్త తెలిసి, అతడి ఇంటికి వెళ్ళింది మేరీ.

వసారాలో కూర్చొని చుట్ట తాగుతూ ఆలోచిస్తున్నాడు. దూరంగా ఒక వ్యక్తి మంచంలో పడుకొని నిద్రపోతున్నాడు. వెళ్ళి ఎదురుగా నిలబడి నమస్కరించింది.

"నీవేనా పంతులమ్మవు?" అన్నాడు పైకి, కిందకూ చూస్తూ.

"అవునండీ!"

"స్కూలుకు పిల్లలెందరు వస్తున్నారు?"

"నిన్న పన్నెండు మంది వచ్చారండీ ! ఈ రోజు ఇరవై మంది దాకా వచ్చారు. నిన్న మీ కొరకు వస్తే లేరు. అటెండెన్స్ రిజిష్టర్స్ మీ దగ్గరున్నాయని తెలిసి, వాటి కొరకు వచ్చాను".

"ఆ! ఉన్నాయి. తీసుకెళ్ళు ! ఆ మహానుభావుడు శలవులకు వెళ్తూ ఇక్కడ పడేసి వెళ్ళాడు. తిరిగి పత్తా లేడు"

"స్కూల్లో పిల్లలకు బెంచీలు పలకలు ఏమీ లేవండీ! బ్లాక్ బోర్డు కూడా లేదు. టేబుల్ ఉన్నా కుర్చీ లేదు."

"ఏమయ్యాయో నాకు మాత్రం ఏం తెలుసు? పనికిరాని వెధవ ఒకడు టీచరుగా

వచ్చి వెళ్ళాడు. వాడున్నప్పుడు అన్ని వస్తువులూ ఉన్నాయి. అమ్ముకొని తిన్నాడేమో!" అన్నాడు ముఖం మాడ్చుకుంటూ.

వాటిని గురించి అడుగడమే పొరపాటేమో అనుకుంది మేరీ. వాటిని టీచర్ అమ్ముకొని తిన్నాడో, ఈయన ఇంట్లో వేసుకున్నాడో అరా తీయవలసిన అవసరం తనకు లేదు. ఉన్నంత వరకే సర్దుకోవడం మంచిది. ఈ ప్రెసిడెంట్లకు వ్యతిరేకమయితే పట్టుబట్టి ట్రాన్స్‌ఫర్ చేయించేదాకా నిద్రపోరు. చీటికి, మాటికి తాము అవమానం చేయడం గాక, ఇతరులతో కూడా చేయిస్తుంటారు. అందువల్ల అతడితో ఎక్కువ మాట్లాడకుండానే, పుస్తకాలు తీసుకొని "వస్తానండీ!" అని సమాధానం కొరకు ఎదురు చూడకుండానే స్కూలు వైపు సాగింది. పోతున్న పంతులమ్మను వెనుకనుండి చూస్తూ, చుట్ట సలుస్తూ కూర్చున్నాడు ప్రెసిడెంటు అప్పారెడ్డి.

స్కూలు వద్దకు వచ్చేసరికి రమేష్ అక్కడే ఉన్నాడు.

"గుడ్‌మార్నింగ్ మేడమ్!" అన్నాడు నవ్వుతూ. ఆమె కూడా గుడ్ మార్నింగ్ చెప్పి వసారాలో కూర్చుంది.

"ఎక్కడికి వెళ్ళివస్తున్నారు?"

"ప్రెసిడెంటు ఇంటి నుండి వస్తున్నానండీ! నిన్నటినుండీ కన్పించలేదు కదా? పరిచయం చేసుకుందామని వెళ్ళాను."

"స్కూలు విషయాలేమయినా అడిగారా?"

"అడిగారు. ఇక్కడ వస్తువులు లేవని చెప్పాను. అందుకు ఆయన ముఖం మాడ్చుకొని, ఇంతకు ముందున్న టీచరును తిట్టాడు. వాడే అమ్ముకొని తిని ఉంటాడని అన్నాడు."

"అవి పీడి ఇల్లే చేరిఉంటాయి. ఎలాగూ పాత టీచర్ లేడు, గనుక అతడి నెత్తిన ఈ పాపం వేసి ఉంటాడు. ఇక్కడ ఏదే



వస్తువులున్నాయో తెలుపుతూ, పరిషత్ వారికి రాసి కొత్తవి తెప్పించేదానికి ఇండెంటు పంపండి. లేకుంటే కింద కూర్చొని ఎన్నాళ్ల పాఠాలు చెబుతారు మీరు?"

"ఆలోచించాలి. ప్రెసిడెంటు గారి ద్వారానే తెప్పించే ఏర్పాటు చేస్తాను. ఆయనను వ్యతిరేకించినట్లు ప్రవర్తించడం మంచిదికాదు. వాళ్ళకు కోపాలు తెప్పిస్తే ఏమవుతుందో ఒకసారి అనుభవమయింది నాకు."

"అంటే వాళ్ళకు లొంగి మసలు కుంటారా ఏమిటి? వాళ్ళకు ఏమాత్రం లొంగినట్లు కన్పించినా మంచంలో ఉండే సల్లికీ, స్కూలులోని టీచర్‌కూ, ఏమాత్రం తేడాచూపరు. ఇప్పుడీ మారుమూల ప్రాంతానికి వచ్చారంటే, తప్పకుండా ఏ ప్రెసిడెంటుకో, బి. డి. వో.కో వ్యతిరేకమై వచ్చి ఉండాలి. సౌకర్యాలులేని ఇటువంటి ప్రాంతాలకు కాకాలు పట్టే టీచర్లు, బలసంపదగల టీచర్లు రారు"

"మీరు చెప్పిందీ నిజమే! నిజాయితితో ప్రవర్తించినందుకే ఇలా వచ్చాను. దాని వల్ల లాభం లేదని మీ మాటల ద్వారా తెలుసున్నది. తిరిగి ఈ గ్రామంలో కూడా అలాగే ప్రవర్తిస్తే, ఈ సారి సస్పెండ్ చేయించుకోవలసివస్తుంది".

అయినా మీలాంటి యువకులు ఈ సామాను గురించి పట్టించుకుంటే బాగుంటుంది. ప్రైవేట్ వ్యక్తులయితే నిర్బంధాలు రావు"

"అవును, అదీ నిజమే ! గ్రామంలో యువకులందర్నీ కూడగట్టి, కనీసం స్కూలుకు సంబంధించిన విషయాల లోనయినా ఏదైనా చేయాలి"

స్కూలు మొదలయింది. పిల్లలు వచ్చి లోపల కూర్చున్నారు. రమేష్ వెళ్ళిపోయాడు. పిల్లలకు పాఠంచెబుతూ, రమేష్ మాటలు, నడవడిక గురించి ఆలోచిస్తున్నది. ఇక్కడికి వస్తూనే పరిచయమయిన మొదటి వ్యక్తి. ప్రెసిడెంటుగా పోటీచేసి, ఓడిపోయి, ఇలా ప్రెసిడెంటు మీద దుష్ప్రచారం చేస్తున్నాడేమో అనుకుంది. లేక నిజంగానే స్కూల్ బాగు కొరకు కలుగ చేసుకొని నిలబడగలడా?

ఐదు గంటలకు స్కూలు విడిచి పల్లె చేరింది. దేవమ్మ ఇల్లు శుభ్రం చేయించి, రెండు కొత్త కుండలు తెప్పించి వాటి నిండా నీళ్లు తెచ్చి పోసింది. బయట పడి పోయిన దొడ్డిని స్నానం చేయడానికి వీలుగా చుట్టూ తడిక కట్టించింది. దేవమ్మ, ఏసు చేసిన సహాయానికి మనసులోనే కృతజ్ఞతలు తెలుపుకుంటూ కాళ్ళు, ముఖం కడుక్కొని, ఫర్లాంగు దూరంలో ఉన్న గుండ్ల కమ్మవైపు సాగింది.

సాయం సమయం ప్రశాంతంగా ఉంది. పైన ఎక్కడ వర్షం పడిందో గుండ్ల కమ్మ బురద నీటితో పారుతోంది. విలాసంగా చేపలు పట్టడానికి వచ్చిన ఒకరిద్దరు గాలం నీటిలో విడిచి, ఒడ్డున కర్రపట్టుకొని కూర్చున్నారు. ఇసుకలో కూర్చుంటే చల్లగా ఉంది. బుట్టలో చేపలు పట్టుకొస్తున్న ఏసు ఆమెను చూసి దగ్గరగా వచ్చాడు. పలకరింపుగా నవ్వి "ఏమ్మా! ఇట్లా వచ్చావ్?" అన్నాడు.

"ఏం లేదు తాతా! చల్లగాలి పీల్చుకోవచ్చు కదా అని వచ్చాను. చేపలు బాగా పడ్డాయా?" అంది నవ్వుతూ బుట్ట వైపు చూసి.

 

"లేదమ్మా! మహా అయితే ఆరకిలో అవుతాయి. ఇంటికి వెళ్ళిన తర్వాత తోమిస్తాను. వండుకో అమ్మా!"

"వద్దు తాతా! నేను చేపలు తినను. ఇక్కడ మీరందరూ ఏం పనులు చేస్తుంటారు తాతా?"

"ఏమున్నాయమ్మా? కొందరికి సెంటో, కుంటో భూమి ఉంది. కొందరికి అదీ లేదు. అది చేసుకుంటూ రైతులకు కూలికి వెళ్తాము. ఉదయం పనికి వెడితే రాత్రి చీకటి పడ్డాక గానీ మెట్ట పొలాల్లో పని నుండి రాము. ఇంతా చేస్తే ఇచ్చేకూలి చేసిన వాడి తిండికి చాలదు. అడిగితే తిడతారు. ఇంకా ఆగ్రహం వస్తే కొడతారు. నోరెత్తి మాట్లాడే ధైర్యం కూడా లేదు మాకు"

ఊపిరి విడుస్తూ, ఇసుకలో సున్నాలు చుడుతూ కూర్చున్న మేరీ తల ఎత్తి అతని వైపు చూసి "ఈ బాధలు పడడానికి కారణం కనీస చదువు కూడా లేకపోయి, అజ్ఞానంలో బతకడమే తాతా! మన పల్లెలో రాత్రిపూట చదువు చెప్పుతాను. వస్తారా?" అంది.

ముసలాయన సంతోషంగా నవ్వాడు. "అలాంటివారు లేకేకదా మాకు ఈ బాధ! ఈ పిల్లలు తిండికొరకు పగలు ఏదో ఒక కష్టం చేయాలి. అందువల్ల బడికి రాలేరు. రాత్రిపూట చెప్పేవారుంటే ఎందుకురారు? వస్తారు"

"సరే! ఈ రోజే ఏర్పాటుచేద్దాం. నేను మాత్రం రాత్రిపూట చేసేపనే ముంది. మనవాళ్ళకు కొంత తెలివి తేటలయినా వస్తాయి" అంది లేస్తూ.

పొద్దు క్రుంకింది. సందె చీకట్లు తారాడుతున్నాయి. ఇద్దరూ పల్లెకు వచ్చారు. మేరీ ఇంట్లోకి వచ్చేటప్పటికి దీపం వెలిగించింది దేవమ్మ.

"నేను రేపు ఊరు వెళ్ళి అమ్మను తీసుకొస్తాను. ఎలాగూ రేపు శనివారం. ఒక్కపూటే కదా స్కూలు. ఎల్లుండి రాత్రికి తిరిగి వస్తాను" అంది మేరీ.

స్నానంచేసి, అన్నం తినేటప్పటికి ఎనిమిదయింది. ఆపాటికి కొందరు పిల్లలు, ఏసుతోపాటు కొందరు పెద్దలు అక్కడకు వచ్చి బయట కూర్చున్నారు. ఆమె వారితో మాట్లాడుతుండగానే ఒక వ్యక్తి అటుగా వచ్చాడు. నిషా మీద తూలుతున్నాడు. కోరమీసం దువ్వు కుంటూ "ఏందీ సమావేశం?" అన్నాడు అధికారికంగా.

"సమావేశం కాదురా దానం! చదువు. ఈయమ్మ మన పిల్లలకు రాత్రిపూట చదువు నేర్పుతున్నదిరా! మనవాళ్ళు పగలు ఆ బడికి వెళ్ళి ఏం చదువుతారు?" అంది దేవమ్మ.

"ఓయబ్బో! చదివి చదివి కలెక్టర్లు కావాలా? సూపర్నెంట్లు కావాలా? కష్టం చేసుకుంటే తిండి పెట్టే వెధవనా కొడుకు లేడు గానీ..."

"అదేం మాటరా? చదువుకోకనేగదా మనం ఇలా తయారయింది. పిల్లలయినా బాగుపడతారు. ఆయమ్మ మన కులం నుండి వచ్చిందేకదా! చదువుకోబట్టే ఈ రోజు పంతులమ్మ కాగలిగింది" అన్నాడు ఏసు మెతగా.

"ఓసినీయవ్వ! మాటలకేం మన లోడా కోటలు దాటుతాయి. చూద్దాం చూద్దాం. ఈ చదువులు ఏం భూము లేల్తాయో?" అంటూ కర్ర నేలకేసి కొట్టి ముందుకు సాగాడు.

"ఎవరతను?" అంది మేరీ.

"వాడు ఈ పల్లెకు పంచాయతీ

సెంబరు. ప్రెసిడెంటు నమ్మినబంటు. పచ్చి రౌడీ ముండాకొడుకు. పనీపాటా లేకుండా తేరగా తిని తాగి రెడ్డివెంట తిరుగుతూ, ఆయన ఏం చేయమంటే అది చేస్తాడు. వాడేం కూసినా పట్టించుకో కమ్మా! వాడి పాపాన వాడేపోతాడు" అంది ఒక ముసలమ్మ.

"వెధవ బూతులు తప్ప సరిగా మాట్లాడ చావడు" అంది దేవమ్మ.

రాత్రి తొమ్మిది గంటలదాకా పిల్లలకు రాయిస్తూ కూర్చుంది మేరీ.

మరునటిరోజు స్కూల్ తెరుస్తూనే రమేష్ వచ్చాడు.

"ఈ రోజు నేను ఒంగోలు వెళ్తున్నాను. ఇక్కడ ఏమేం వస్తువులుండాలో వివరాలు చెప్పండి. రాసుకుంటాను. పరిషత్‌లో ఎంక్వయిరీ చేస్తాను" అన్నాడు.

"కొన్ని రోజులు ఆగండి. మీరు తొందర పడడం ద్వారా నన్ను మధ్యన ఇరికింపేస్తారు. ఇప్పటికే ఒకసారి బాధ పడ్డాను. మళ్ళీ నేను బాధలకు లోనయితే



కోలుకోవడం కష్టం" అంది మేరీ.

"అదేంటండీ! మీరు రిపోర్టు ఇవ్వడం లేదు కదా! నేనేదో మా గ్రామ స్కూలు బాగుకొరకు ప్రయత్నం చేసుకుంటున్నాను. అందులో కాదనవలసిన పనేముంది? మిమ్మల్ని సంతకం పెట్టమంటే కదా మీకు బాధ" అన్నాడు రమేష్.

అతడి ముఖంలోకి చూసింది మేరీ.

ఇతడితో పరిచయమై రెండు రోజులు కాలేదు. జలగలా తయారయ్యాడేమిటా అనుకుంది. ఆలోచిస్తే అతడు చెప్పిందే నిజమే! తన సంతకాలు ఏవీలేవు కనుక తనకా బాధ్యత లేదు. పైగా తన గ్రామ స్కూలు బాగుకొరకు అతడు పోరాడటం తప్పుకాదు. దీనివల్ల ప్రెసిడెంటుకు కోపం వస్తే, తనను ఎందుకు అడగ లేదని అతడు మండిపడితే తాను బాధ్యు రాలు కాదు. అమాయక పిల్లలకు వచ్చే సౌకర్యాలు ఈ విధంగా లాగి తినడం తప్పు! దీన్ని అరికట్టాల్సిందే!

అతన్నే రాసుకోమని ఏవి ఉండాలో, ఏవి లేవో వివరంగా చెప్పింది.

"నేను కూడా మధ్యాహ్నం అటు వస్తున్నాను. మా గ్రామం వెళ్లి అమ్మను తెచ్చుకోవాలి" అంది మేరీ.

"అయితే ఇద్దరం అదే బస్సుకు వెళ్ళొచ్చు. మూడు గంటలకు బస్సు ఉంది." అని వెళ్లిపోయాడు రమేష్.

స్కూల్ విడిచి ఇంటికి వచ్చింది. రచ్చబండ వద్ద ఏసు కూర్చుని ఉన్నాడు. "నేను ఒంగోలు వెళుతున్నాను తాతా! రేపు రాత్రికి అమ్మను తీసుకొనివస్తాను. ఈ రోజు కుర్రాళ్ళను రావద్దని చెప్పు"

"ఒక్కదానివి అంతదూరం ఎలా నడిచి వెళ్తావమ్మా! నేను బస్సుదాకా వచ్చి దిగబెట్టనా?"

"వద్దులే తాతా! రమేష్ అనే అబ్బాయి కూడా అటే వస్తున్నాడు"

ఏసు ఆమె కళ్లల్లోకి చూసి తల తిప్పుకున్నాడు. ఆ మాట అన్నందుకు తర్వాత బాధపడింది. ఒక యువతీ, యువ కుడూ కలిసిపోవడమంటే ఈ పల్లెటూరి వారి దృష్టిలో మరొక విధంగా ఉంటుంది. అతని పేరు అనవసరంగా తెచ్చానేమో అనుకుంది.

"సరేనమ్మా నీ యిష్టం! రేపు సాయంత్రం నాలుగ్గంటల బస్సుకు రమ్మంటావా? సామాన్లు అవీ ఉంటా యేమో?"

"మరచేపోయాను తాతా! రేపు ఏదైనా అద్దెబండి ఒకటి మాట్లాడి బస్సు వద్దకు తీసుకుని రావాలి. సామాన్లు తీసు కొని వస్తాను. ఐదు మైళ్ళు అవి ఎక్కడ మోసుకొని వస్తాము. అందువల్ల తప్ప కుండా నీవు రావాలి. బాడుగ ఎంతయినా ఫరవాలేదులే" అంది బాగ్ భుజానికి తగిలించుకుని. తలుపు దగ్గరగా లాగి గొళ్ళెం పెట్టింది.

ఏసు ఊరి వెలుపలదాకా ఆమె వెంట వచ్చాడు. ఆ పాటికి రమేష్ వచ్చి దేవా లయం వద్ద కూర్చున్నాడు. అతడిని చూసి ఏసు వెనుకకు తగ్గుతూ "ఇక ఉంటానమ్మా!" అన్నాడు.

"సరే తాతా! రేపు బండికట్టుకరావడం మరచిపోవద్దు" అంటూ ముందుకు నడి చింది. రమేష్ ఆమెతోపాటు నడిచాడు. పోతున్న ఇద్దరినీ చూస్తూ ఏసు నిల బడ్డాడు.

వయస్సులో నున్న పిల్ల. ఏదో భ్రమలు. పైగా భర్తలేని జీవితం. ఇటు వంటి వాళ్ళను ఆకర్షించి, నాశనం చేసి వెళ్ళేవారు చాలామందే! ఈ అవకాశం రమేష్ ఉపయోగించుకుంటాడేమో! అయినా తను ఏమీ చేయలేడు. కనీసం సలహా ఇవ్వడం కూడా సాధ్యం కాదు.

మహానగరం వెళ్ళిన తరువాత "మీరు వెళుతుంటారా? ఇక్కడో టీచర్ ఉంది, ఆమెతో మాట్లాడి వస్తాను" అంది మేరీ పల్లెవైపు నడుస్తూ.

"ఏం? నేను రాకూడదా?" అన్నాడు

రమేష్ నవ్వుతూ.

"అబ్బే! అదేంలేదు. మీరు మాలపల్లె లోకి రారేమోనని. ఎంతయినా బ్రాహ్మణులు కదా! సరే రండి" అంది.

ఇద్దరూ ఎలీశమ్మ ఇంటి వద్దకు వచ్చే సరికి ఆమె భోజనం చేస్తూ వీరిని చూసి ఆహ్వానించింది.

"ఏమిటి రమేష్‌బాబూ ? ఎక్కడికి ప్రయాణం?" అంది ఎలీశమ్మ నవ్వుతూ.

మేరీ "ఇతడు మీకు తెలుసా?" అంది ఆమె వైపు చూస్తూ.

"తెలియక పోవడమేమిటి ? రెండు గ్రామాలు ఒకే పంచాయతీలో ఉన్నాయి, పైగా ఈయన మొన్న ఎన్నికలలో పోటీ చేశాడు" అంది ఎలీశమ్మ – వీరిద్దరు ఎలా తోడయ్యారా అని ఆలోచిస్తూ.

ఎలక్షన్లలో ఆమె రెడ్డికే ప్రచారం చేసింది.

కాసేపుండి ఆమె దగ్గర శలవు తీసుకొని బయలుదేరారు.

"ఈమెను గురించి మీకు తెలుసా ?" అన్నాడు రమేష్.

"మొన్న నేను ఇదే త్రోవన వస్తూ, ఇక్కడికి వచ్చేటప్పటికి చీకటి పడింది. మోదేపల్లికి ఆ చీకటిలో రాలేక, ఈమె ఆశ్రయం కోరాను. తోటి టీచర్ కాబట్టి ఆతిథ్యం ఇచ్చింది. అందుకే ఇప్పుడు రావడం. పైగా ఒకే సమితిలో దగ్గరగా ఉన్నామని కూడా ఇటు వచ్చాను అంతే!"

"ఈమె ప్రెసిడెంటుకు సన్నిహితురాలూ, సలహాదారూ కూడాను. నే చేసే ప్రయత్నం తెలిసిందంటే, పరుగెత్తుకు వెళ్ళి ఆయనకు చెప్పేస్తుంది".

"మీరు చేసే ప్రయత్నం తర్వాతైనా తెలియదనుకుంటున్నారా?"

"పని అయిన తర్వాత తెలిస్తే వచ్చే నష్టంలేదు. ముందుగా అయితే అది జరక్కుండా చేయడానికి అన్ని ప్రయత్నాలు చేస్తారు. కావలసినన్ని హంగులు వారికి ఉన్నాయి".

"ఏమో బాబూ! నాకీ ప్రాంతం కొత్త! ఎవరు ఎటువంటివారో అసలే తెలియదు. నా మీదకు నింద రాకుండా చూడండి దయచేసి" అంది తనేదో మధ్యన ఇరుక్కుంటున్నానేమోనని బాధ పడుతూ.

రమేష్ నవ్వుకున్నాడు. ప్రెసిడెంటును సాధించాలంటే, అతడికి మార్గాలు కావాలి. అందులో భాగమే ఇది. పంచాయతీ ఎన్నికలలో తనను అందరూ కలిసి భ్రష్టు పట్టించి నాశనం చేశారు. వీళ్ళందరికీ ఎదురు నిలబడి ఏదో ఒకటి చేస్తుంటే గానీ గ్రామంలో తనకు గుర్తింపు రాదు. ఏదో ఒకటి కెలుకుతూ వుండాలి. యువకుల్ని కూడగట్టి యువజన సంఘం పేరుతో ఏదో చేద్దామని ప్రయత్నిస్తే, తాను అభాసుపాలు గావడం కాకుండా, ఆ యువకులందరూ మరొకడికి నమ్మిన బంట్లుగా తయారయ్యారు. ఆ విధంగా అందులోనూ దెబ్బ తీశారు. పంచాయతి తనకు దక్కితే ఎన్నో మంచిపనులు చేద్దామనుకున్నాడు. ఈ యువజన సంఘం బలంతో గెలుస్తాననుకున్నాడు. తీరా డిపాజిట్ లేకుండా ఓడిపోవలసి వచ్చింది.

ఆ విధంగా అప్పారెడ్డి చేతిలో ఓడిపోయిన రమేష్, అతన్ని ఏదో ఒకదానిలో ఇరికించి అల్లరి పట్టించాలని చూస్తున్నాడు. కాని కిందనుండి పైదాకా యంత్రాంగం అంతా అప్పారెడ్డి వర్గం చేతిలో ఉంది.

రమేష్ గురించి మేరీకి ఏమీ తెలియ




తున్నా, ఆవిడను గురించి రమేష్ అంతకు ముందే సేకరించాడు. తమ గ్రామానికి ట్రాన్స్‌ఫర్ అయ్యే టీచర్‌తో ముందుగానే స్నేహంచేసి, ప్రెసిడెంటుకు దూరంగా ఉంచాలని అతడి ఉద్దేశం! ఆ విధంగా కొంత విలువ సంపాదించవచ్చు. మేరీ భర్త చనిపోయిన విధవ అనీ, ననకలూరులో ఆమెను లొంగించుకోవడానికి ప్రెసిడెంటు చేసిన ప్రయత్నంలో అతన్ని ఎదిరించి అవమాన పరిచిందనీ, తత్ఫలితమే అక్కడినుండి ట్రాన్స్‌ఫర్ చేయించబడిందనీ, సౌకర్యాలులేని మారుమూలకు వేయడానికి సమితి ప్రెసిడెంటు ద్వారా ఒత్తిడి జరిగించనీ అతడు వివరాలు సేకరించగలిగాడు. ఒక గ్రామంలో ప్రెసిడెంటును ఎదిరించిందంటే కొంతైనా ధైర్యం కలదే అయి ఉంటుందనుకున్నాడు. ప్రెసిడెంటును ఎదిరించాల్సిన పరిస్థితి ఏర్పడితే తనతో తప్పక సహకరించగలదనుకున్నాడు. అందువల్ల అందరికంటే ముందుగానే స్కూలు వద్దకు వెళ్ళి, ఆమెతో పరిచయం సంపాదించుకోవడమేగాకుండా, ఆమెకు భోజన ఏర్పాటుచేసి అభిమానం కూడా సంపాదించుకున్నాడు. మేరీకి కూడా అతడంటే కొంత గౌరవం ఏర్పడింది. ఇక్కడ తనమీద సానుభూతి చూపి, సహాయం చేసే వాళ్ళుండడం అవసరం. అందువల్ల కూడా ఆమె పరిచయం చేసుకుంది.

కాని ఇది ఒంగోలుగానీ, ననకలూరు



గానీ కాదనీ, అవసరమొస్తే మనుషుల్ని కూడా గొడ్లను కోసినట్లుకోసే పల్లెటూరి మోతుబరుల రాజ్యమనీ ఆమెకు తెలియ లేదు. నిన్నటిదాకా టౌనులోనూ, ఆ పరిస రాలలోనూ ఉంది. మరింకే ఆధారం లేని పరిస్థితిలో ఈ ఉద్యోగం చేయవలసి వచ్చింది. ఏమాత్రం ఆధారమున్నా సనకలూరులో ప్రెసిడెంటుతో తగవు వచ్చినప్పుడే రాజీనామా ఇచ్చేది. ఉన్న ఆధారం పోగొట్టుకోలేకనూ, వారికి లొంగడానికి ఇష్టపడక పోవడం వల్లనూ ఎదురు తిరగడంతో చివరకు దూరంగా తరలించారు. అందుకే బాధల్ని భరించి మోదేపల్లె చేరింది. ఆ గ్రామ పరిస్థితులు పూర్తిగా తెలిసి ఉంటే, రమేష్‌ను దూరంగా ఉంచేదేమో గానీ పూర్తిగా తెలియక ముందే రమేష్‌కు దగ్గరయింది.

ఒంగోలు చేరేసరికి ఆరు గంట లయింది. తమ ఇంటికి రావలసిందిగా ఆహ్వానించింది.

"ఎందుకండీ! టౌనులో కావలసినంత సౌకర్యం ఉంది. ఎక్కడో చోట కాలం గడపవచ్చు!" అన్నాడు మొహమాట పడుతూ.

"మీరు మాకు సహాయం చేయవచ్చు గాని, మేం చేయకూడదా? లేక కుల పట్టింపులేమయినా ఉన్నాయా?"

"నాకు కుల పట్టింపులు ఏవీ లేవండీ! సరే! మీరు బలవంతం చేసినప్పుడు కాదనడ మెందుకు? పదండి!" అన్నాడు.

* * *

సోమవారం ఉదయం తొమ్మిది గంటల ప్రాంతంలో మనిషి వచ్చి పిలిచాడు ప్రెసిడెంటు రమ్మంటున్నాడని! మేరీ పిల్లలకు పాఠాలు చెబుతున్నది. స్కూల్ విడిచిన తర్వాత వస్తానని చెప్పి పంపింది.

ఆదివారం రాత్రికే తల్లితోసహా మోదేపల్లె చేరింది. రమేష్ పని చూసు కొని వస్తానని ఒంగోలులోనే ఉన్నాడు. తాడూరు అడ్డరోడ్డు వద్దకు ఏసు తీసు కొచ్చిన అద్దె బండిలో సామాను వేసు కొని రాత్రి ఏడుగంటలకు పల్లె చేరారు.

స్కూలు విడిచిన తర్వాత ప్రెసిడెంటు ఇంటికి వెళ్లింది. ఆ పాటికి ప్రెసిడెంటు భోజనంచేసి, తాంబూలం నములుతూ కూర్చున్నాడు. మేరీని చూసి "అరుగు మీద కూర్చో" అన్నాడు.

"ఏంది పంతులమ్మా! నిన్న రమేష్‌ను వెంటబెట్టుకుని ఒంగోలు వెళ్ళేవట?" అన్నాడు నవ్వుతూ.

"ఇక్కడికి వచ్చిన తర్వాత మొదట అతనే పరిచయమయ్యాడండీ! సరే! శని వారం సామానులు తెచ్చుకోండికి నేను వెళుంటే అతడు కూడా ఒంగోలుకు వస్తున్నట్లు చెప్పాడు. బస్సుదాకా తోడుగా ఉంటాడని కలిసి వెళ్ళాను" అంది తలవంచుకొని.

"వెళ్తే ఏముందిలే గానీ, వాడు పోకిరీ వెధవ. ఎప్పుడూ ఏదో ఒక తగవు పెట్టుకోకుండా నిద్రపోవడం అతగాడికిష్టం ఉండదు. అందువల్ల నీవు కొంచెం జాగ్రత్తగుండు. ఆ తర్వాత బాధపడితే లాభం లేదు!" అన్నాడు కటువుగానూ, మందలింపు ధోరణిలో.

అతని మాటలు అర్థం చేసుకుంటూ కూర్చుంది.

"స్వాతంత్రదినం వస్తున్నది కదా! ఈ సారి చాలా ఆడంబరంగా చేయాలను కుంటున్నాం. పంచాయతీ ఎలెక్షన్లు జరిగాయి గనుక, పెద్ద ఎత్తున ఈ ఉత్సవం చేయాలని! నీవు కూడా ఉంటావు

చోద్యంగా చెప్పుకుంటున్నారు. పిల్లలు చదువుకుంటూ ఒక్కోసారి రమేష్ వైపు చూస్తున్నారు.

"ప్రెసిడెంటు మిమ్మల్ని పిలిపించాడట కదా"

"మీకెట్ల తెలుసు అప్పుడే?" అంది ఆశ్చర్యంగా.

నవ్వాడు రమేష్. "నా విషయాలు వారికి చెప్పేవారు ఉన్నట్లే వారి విషయాలు నాకు చెప్పేవారు కూడా ఉండడం సహజం. అయితే ఎందుకు పిలిచినట్లు?"

"మనం ఇద్దరం కలిసి ఒంగోలు వెళ్ళడం గురించే. మీతో తిరగడం అంత మంచిది గాదని ఆయన హెచ్చరిక చేశాడు".

"మీరేమనుకుంటున్నారు ?"

"నిన్నటిదాకా పట్టణ పరిసరాల్లో తిరిగిన వ్యక్తిని. ఈ వాతావరణం నాకు ఇంకా అవగాహన కాలేదు. అయినా వాళ్ల చెప్పేదానిలోనూ నిజం ఉందేమో".

రమేష్ ఎగఊపిరి పీలుస్తూ కూర్చున్నాడు. కొంచెంసేపు కూర్చొని, "వస్తానండీ! బడలికగా వుంది. రేపు స్కూలు వద్ద కలుస్తాను" అంటూ వెళ్లాడు. ఎందుకొచ్చాడో చెప్పకుండానే వెళ్ళిపోయాడు. నొప్పించానేమో అనుకుంది మేరీ!

మరుసటి రోజు ఇంకా స్కూలుకు వెళ్ళకముందే దానం వచ్చి ఇంటిముందు నిలబడ్డాడు కోరమీసం దువ్వుకుంటూ. "పంతులమ్మా! ప్రెసిడెంటుగారు నిన్ను రమ్మన్నారు" అన్నాడు.

"ఇప్పుడు నేను స్కూలుకు వెళ్లాలి దానమన్నా! మధ్యాహ్నంగానీ, సాయంత్రంగానీ వస్తానని చెప్పు" అంది పుస్తకాలు తీసుకొని.

"అవన్నీ నాకు తెలియదు. రమ్మన్నాడు. అంతే! పోతేపో, మానుకో" అంటూ కర్ర తాటించుకుంటూ తన ఇంటివైపు వెళ్ళిపోయాడు.

రోజూ పీడితో తలనొప్పి అనుకుంది. ఇలాగే రోజూ పిలిపిస్తాడేమో? అప్పారెడ్డి ఇంటి ముందుకు వచ్చేసరికి కొలువుతీరి ఉన్నాడు మీసం దువ్వుకుంటూ. అల్లంత దూరంలోనే కన్పించిన మేరీని చూసి, లేచి లోనికి వెళ్ళాడు. మేరీ కూడా లోనికి వెళ్ళింది.

"కూర్చో పంతులమ్మా, ఏమిటి సంగతులు?" అన్నాడు. మామూలుగా మాట్లాడుతున్నాననుకున్నా, మాట కటువుగానే వచ్చింది.

"ఏమీ లేవండీ! మీరు పిలిచారంటే వచ్చాను" అంది కూర్చుంటూ.

"రమేష్ ఒంగోలు నుండి వచ్చిన తరువాత రాత్రి నీ వద్దకు వచ్చాడట గదా?" అన్నాడు కళ్ళలోనికి గుచ్చి గుచ్చి చూస్తూ. తల దించుకుంది ఆ చూపులకు తట్టుకోలేక.

"ఔను; వచ్చి వెంటనే వెళ్లాడు".

"వాడు ఏమిటేమిటి మాట్లాడాడు?"

"రాత్రి ఏమీ మాట్లాడలేదు. ఏ ప్రసక్తి రాలేదండీ !"

"నేను నమ్మను. మీరిద్దరూ కలిసి ఏదో కుట్ర చేస్తున్నట్లున్నారు. వాడు స్కూల్లో వస్తువులే లేవని, దండకం రాసుకొని వెళ్ళి బి. డి. ఓ.గారికి రిపోర్టు ఇచ్చాడని ఇప్పుడే తెలిసింది. వాడొక్కడే ఈ పని చేశాడంటే నేను నమ్మను. ఇందులో నీ సహకారం ఎంత ?" అన్నాడు నొక్కి పలుకుతూ.

గాబరాగా చూసింది మేరీ. "నాకేమీ తెలియదండీ! అతడు ఏం చేసినది కూడా తెలియదు. నిజమండీ!" ఆదుర్దాగా అంది




మధ్యన తాను ఇరుక్కుంటున్నానని తెలిసి.

అప్పారెడ్డి కోపంగా చూస్తూ అన్నాడు "నిన్నగాక మొన్న వచ్చావు. వచ్చినప్పటినుండీ నాతో తగవు పెట్టుకోవాలని చూస్తున్నావేం? ఇట్లా అయితే ఇక్కడ ఎన్నో రోజులు ఉండవు. ఆ తర్వాత నీ యిష్టం!"

మేరీ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"వాడో గొడ్డుపోతు. వాడేదో పెద్ద మొనగాడని నీవు భ్రమపడితే, చివరకు నీవూ గుండ్లకమ్మలో తేలిపోతావు. నీకు ఇక్కడే కాదు ఎక్కడా దిక్కులేదు. మర్యాదగా చెపుతున్నాను విను. స్కూలుకు సంబంధించిన విషయాలు నాతో మాట్లాడు. వీలుంటే ఏర్పాటుచేస్తాం. వాడెవడు మధ్యన? వాడూ, నీవూ రిపోర్టు ఇచ్చినంత మాత్రాన పనులు కావడానికి వాడి మనుషులూ, నీ మనుషులూ లేరు అక్కడ. నీ యిష్టం!"

మేరీ నోరెత్తి మాట్లాడలేదు. తల వంచుకుంది. దానం పంచలో గడపనాను కొని నిలబడ్డాడు.

"సరే సువ్వెళ్ళు!" అన్నాడు తల ఎగిరేస్తూ. లేచి తలవంచుకొని స్కూలు వైపు తొందర తొందరగా సాగిపోయింది.

అప్పారెడ్డి బయటకు వచ్చాడు.

"ఏమంటోంది మా పంతులమ్మ! బలే చలాకీ పిల్లలాగుంది" అన్నాడు నర్సింహులు నవ్వుతూ.

"దానికి రోజులు మూడి ఈ ఊరికి బదిలీ అయిందిలే. అందుకే టింగురంగా అంటోంది. ఇటువంటి పంతులమ్మలను ఎందర్ని చూడలేదు" అన్నాడు గోపాల్ సకిలిస్తూ.

రంగయ్య చుట్ట ముట్టించి పీల్చి కాండ్రించి ఉమ్మేస్తూ "దీనికేం తిమ్మిరి? వచ్చీరాగానే తగవుకు దిగింది" అన్నాడు.

"వెనుక పంతులుగాడు చేస్తున్నాడు ఇదంతా! వీడిని ఒకపట్టు పడితే బాగుంటుంది" అన్నాడు నర్సింహులు.

"ఒరేయ్! ఈ ఊరికేదో చేటు తేవడానికి దాపురించాడురా ఈ బాపనోడు! వీడు ఊరిలో లేనన్నాళ్ళూ ఊరు బాగానే ఉంది. వచ్చి పది నెలలు కాలేదు. పది వందల తంటాలు తెచ్చాడు" అన్నాడు ప్రెసిడెంటు.

"బాపనబిడ్డ గదా తెలివితేటలు చూపించి, నాయకత్వం పొందుదామనుకొని ఉంటాడు."

"వీడి తలకాయ. వీడేం చేస్తాడు బోడి వెధవ! మొనగాళ్ళే ఏమీ చేయలేక నోరు మూసుకున్నారు."

మనిషో విధంగా మాట్లాడుతున్నారు. దానాన్ని పక్కకుపిలిచాడు ప్రెసిడెంటు.

"ఒరేయ్! ఇది ఏమేం మాట్లాడుతుందో ఎప్పటి కప్పుడు తెలుసుకుంటూ ఉండు. ఇదేదో వచ్చినప్పటినుండి నాయకురాలు నాగమ్మలాగ ఫోజు కొడుతున్నది. దీని అంతు చూడాలి."

"అదేం చేస్తాదయ్యా! మాట్లాడితే గుడ్డలిప్పి, గుండ్లకమ్మలో తొక్కెయ్యనూ! మీరు 'ఊఁ' అంటే రేపే దాని గతి గోయిందా!" అన్నాడు చేతులు తిప్పుతూ దానం.

"తొందరేం లేదులే! దానంతటదే రామచిలుకలాగా చేతిలో పడిపోయే రోజు రాక తప్పదు. ఈ రమేష్‌గాడు దాన్ని ఆక్రమించుకోవాలని ప్రయత్నిస్తున్నట్లున్నాడు. ముందు వీడి పని చూడాలి"

"అతగాడేం చేసాడు రెడ్డీ! మీరు 'ఊఁ' అంటే ఈ రాత్రికే చేస్తాను."

అప్పారెడ్డి మాట్లాడలేదు. అగ్గిపుల్ల గీసి చుట్ట ముట్టించి, పీలుస్తూ నిలబడ్డాడు.

* * *

మేరీ మధ్యాహ్నం ఇంటికి వెళ్తూనే ఏసు వచ్చాడు

"రా తాతా! నిన్నంతా కన్పించలేదేం? ఎక్కడికెళ్ళావు?"

బీడీ పీలుస్తూ వచ్చి గడపలో కూర్చున్నాడు ఏసు "చేపల కోసమని వల తీసుకొని వెళ్ళానమ్మా? అంతకంటే పనేంలేదమ్మా! ఇంకా పొలం పనులు కలిసి రాలేదు. అరక పనులుంటే చేయ గలిగినోళ్లు ఒకరిద్దరు వెళుతున్నారు"

కాసేపాగి అన్నాడు. "ఏందమ్మా! ప్రెసిడెంటుగారు పిలిపించారట?"

అన్ని వివరాలు చెప్పింది. "నేనేం చేయగలను తాతా? అతడేదో 'రిపోర్టు' ఇచ్చి అన్ని వస్తువులూ స్కూలుకు అమరేలా చేయాలి, అదే నా ప్రయత్నం' అంటాడు. ప్రెసిడెంటేమో అతడిని ఏదో విధంగా తొక్కి పైకి రాకుండా చేయాలని ఆలోచన. మధ్య నన్ను బాధ పెడుతున్నారు" అంది విచారంగా.

"నీవు ఆరోజు ఆ రమేష్ వెంట పోవడమే తప్పయిందమ్మా! ఈ రభసకు కారణం అదే. వారిద్దరి మధ్య పచ్చగడ్డి వేస్తే మండేస్థితి. నీవు, అందులో ఒక వ్యక్తి వెంట నడిస్తే అన్నీ అనుమానాలే! పైగా అధికారం కలిగిఉన్నవాడు అప్పారెడ్డి.తన అధికారం ఎక్కడ కూలుతుందో నని ప్రతి ఘడియ అనుమానం. అధికారం లేనివాడు రమేష్‌బాబు. అధికారం పెంచుకోవాలని అతడి ఆరాటం. పైగా రౌడీల్లాంటి ఈ రెడ్లు నీ లాంటివారు కన్పిస్తేనే హీనంగా చూస్తారు. ఎలీశమ్మ ఏమయింది? నీకంటే ముందున్న టీచర్ ఏమయ్యాడు? అంతకు ముందున్న మనిషి ఏమయింది? అంటే వారికి లొంగే వారిని ఉంచి, లొంగనివారిని తరిమేస్తున్నారు. అటువంటి రౌడీలకు ఇక్కడ పట్టుఉంది. మేమూ వాళ్లనే అనుసరిస్తున్నామనుకో! మరి అంతకు మించి గతి లేనప్పుడు, వారిని అనవసరంగా ఎదిరించి తగవు పెట్టుకోకుండా నోరుమూసుకోవడమే మంచిది. వాళ్ళలో వాళ్ళకు చీలిక వస్తే చావడమో, చంపడమో తేల్చుకుంటారు. ఇతరుల విషయానికి వస్తే అందరూ ఏకమై చంపుతారు."

"ఒక మగవాడు, ఆడది కలసి వెళితే ఇన్ని అపార్థాలు ఎందుకు తాతా?"

చిన్నగా నవ్వాడు ఏసు. "నీవు పట్నవాసంలో తిరిగినదానివి. కాబట్టి అర్థం కాలేదు పరిస్థితి. పల్లెటూర్లో ఒక పరాయి మగాడివెంట స్త్రీ వెళితే వెంటనే వారి దరి గురించి 'టముకు' వేయించినంతపని చేస్తారు. మన నీతి ఎవడూ చూడడు. అవినీతినే చూడ్డానికి సిద్ధపడతారు."

మేరీ మాట్లాడలేదు. తనే ఏదో తప్పు చేస్తున్నాననుకుంది. వచ్చి నాలుగురోజులు కాలేదు. అప్పుడే మూడుసార్లు ప్రెసిడెంటుచే పిలుపులు. ఈ స్థితిచూస్తే ముందు ముందు ఎలా ఉంటుందో తెలుస్తున్నది. అయినా ఈ రమేష్ తన వెంటబడి తిరగడమేమిటి? చేతనయితే తనే ఏదో పోరాడుకోకూడదూ?

"ఈ రమేష్ ఏం చదువుకున్నాడు తాతయ్యా?"

"చదువు సంగతి నాకు తెలియదమ్మా! గ్రామంలో ఉన్న ముఠాలలో ఒక ముఠాకు నాయకత్వం వహిస్తున్న కరణం క్రిష్ణయ్య పంతులు కొడుకు




కొంత కుర్రకారును తయారు చేసి, అప్పారెడ్డి మీద నిలబడి గెలుద్దామనుకున్నాడు. కాని, రెండో ముఠా ఈయనకు సహాయం చేయకుండా అప్పారెడ్డికే వేయడంతో తగ్గిపోయాడు. కుర్రకారు సంఘంలో ఈయనే ముందుండేవాడు. చివరకు దాని మీద నాయకత్వం ఇంకొకరు అందుకోవడంతో బయటపడ్డాడు. అందుకే అందరినీ సాధించాలని అతడి ఆరాటం. గతంలో ఉన్న పంతుల్తో కలిసి తిరిగేవాడు. చివరకు ఆ పంతుల్ని తన్ని పంపించారు. ఇప్పుడు నీ వంతు వచ్చింది" అన్నాడు ఆమె ముఖంలోకి చూస్తూ.

మేరీ ఆలోచిస్తూ "ఇక్కడ మనవాళ్లు అందరూ అప్పారెడ్డివైపేనా ?" అంది.

"ఈ ముప్పై ఇండ్లలో దానంగాడు ఒకడు తప్ప అప్పారెడ్డికి అనుకూలంగా ఎవరూ లేరు. కాకపోతే అప్పారెడ్డికి ఎదురు నిలువకుండా తప్పుకుంటారు. ఇక్కడ మూడో ముఠా ఉంది. మనవాళ్లు ఎక్కువ మంది ఆవైపు ఉంటారు. పైగా మన కుర్రకారంతా యువజన సంఘంలో చేరారు. దానికి వాళ్ళే నాయకులు. అది ఆ అబ్బాయికీ, అప్పారెడ్డికీ కూడా వ్యతిరేకమే ! అయినా అప్పారెడ్డి కంటే వాళ్ళకే బలం ఎక్కువ ఉండడం వల్ల అప్పారెడ్డి వాళ్ళను ఏమీ చేయలేక పోతున్నాడు. ఈ దానంగాడు వార్డు మెంబరు. పచ్చిరౌడీ, త్రాగుబోతుగాడు. అప్పారెడ్డి ఏం చేయమంటే అది చేయడమే వాడి పని."

"వీడి దౌర్జన్యాన్ని ఎదుర్కోలేరా?"

"వాడి వెనుకనున్న బలం కూడా చూడాలమ్మా? వాడిని ఒక్కడ్నే అయితే ఎప్పుడో కీళ్ళు తిప్పేవారే! వెనుక అప్పారెడ్డి ఇస్తున్న మద్దతు వల్ల ఏమీ అనడం లేదు. కుర్రకారు ఊరకుండడం లేదులే! వాణ్ని మాటలతో విడిచే విధంగా లేరు. ఎప్పుడో ఒకరోజు వాడికి మూడుతుంది. అది సరే! పల్లెలో నిన్ను గురించి అప్పుడే పుకార్లు పుడుతున్నాయి. జాగ్రత్తపడటం నీదే బాధ్యత. ఒకసారి విశ్వాసం పోగొట్టుకుంటే తర్వాత జనం గౌరవం ఇవ్వరు" అంటూ లేచి వెళ్లాడు ఏసు.

మేరీ తల పట్టుకుని కూర్చుంది. నిప్పులో కాలు పెట్టినట్లయింది. ఈ పంతుళ్ల బతుకు, అందునా స్త్రీల బతుకులు పరాయివాళ్ళ చేతిలో ఎంతహీనం? గుమస్తా మొదలు ఆఫీసరు వరకు వాళ్ళ మీదనే ప్రతాపం చూపిస్తారు. నాయకులేమో తమ చెడ్డ పనులకు ఉపయోగించుకోవడం అలవాటు చేసుకున్నారు. ఎదిరించిన వారిని ఏదోవిధంగా బాధ పెట్టడం మామూలయిపోయింది.

లేచి స్కూలుకు వెళ్ళింది.

పాఠం చెబుతుండగా రమేష్ వచ్చాడు. టేబుల్‌మీద కూర్చుని పాఠం చెబుతున్న మేరీని చూసి నవ్వుతూ "మీరు అలా కూర్చొంటే, అచ్చం ఆదిశక్తిలాగున్నారండీ!" అన్నాడు.

"ఆ మాటేమోగానీ, ఇప్పుడు మాత్రం పరాధీనశక్తిగా తయారవుతున్నాను." అంది నవ్వుతూ దిగి కింద కూర్చుని.

అతడు కూడా కూర్చుంటూ "బాధ పడుతున్నారేమిటి?" అన్నాడు

"పరిస్థితులు అలా ఉన్నాయి."

"మీరేవిధంగా ఊహించుకున్నా గానీ, ఒక విషయం గమనించండి. ప్రభుత్వం ఎన్నో చట్టాలు చేసింది. ప్రణాళికలల్లింది. నీతుల్ని ప్రచారం చేసింది. అవి కార్యరూపం దాల్చాలంటే ఉదాహరణకు అంతా సమానమేనంటూ

ప్రధానినుండి పంచాయతీ బోర్డు ప్రెసిడెంటు దాకా కేకలేస్తున్నారు. మన స్కూల్లో చూడండి. మాలమాదిగ పిల్లల్ని విడిగా కూర్చోబెడుతున్నారు. కలిపి కూర్చోపెట్టాలన్నా ఈ అగ్ర కులపు పిల్లలే వ్యతిరేకిస్తారు. చిన్నప్పటినుండి ఈ విధంగా పిల్లలలో కూడా కుల అహంకారం లేపి, పెద్ద అయిన తర్వాత కలిసి పొమ్మంటే ఎలా కలుస్తారు? నేను మాట పరసకంటున్నాను. కనీసం అంతో ఇంతో మేధాశక్తి ఉన్న మీరు కూడా తెగించి నిలబడి పోరాడలేకుంటే అమాయక మాలమాదిగలల్లో చైతన్యం ఏం వస్తుంది?"

"ఈ రాజకీయ ఉపన్యాసాలంటే నా కళ్ళు తిరుగుతాయి బాబూ! అట్టడుగు కులాలవారికి చైతన్యం ఎంతున్నా, అగ్ర కులాల మూర్ఖులముందు కూడా గడ్డి పోచకు పనికిరాదది. అందువల్ల 'ఎంత చెట్టుకు అంత గాలి, అనువుగానిచోట అధికుల మనరాదు' అనుకోవడం తప్ప చేసేదేముంది?"

"టీచర్! టీచర్! టైమయింది" అన్నాడు ఒక పిల్లవాడు లేచి పలక పట్టుకొని పోవడానికి సిద్ధపడుతూ. ఐదు గంటలు కూడా దాటింది. మాటల్లో మరచి పోయినందుకు బాధపడుతూ, 'బెల్' కొట్టమంది. గంట కొడుతూనే పిల్లలు పోలోమని పరుగెత్తడం ఆరంభించారు. బయట ప్రపంచంలోకి ఎప్పుడు వెళ్తామా అని ఎదురు చూస్తున్నారు.

మేరీ కూడా లేచింది వెళ్ళడానికి.

"వెళుతున్నారా?" అన్నాడు రమేష్ తనూ లేస్తూ.

"ఆఁ!" వెళుతున్నాను. రండి, అలా గుండ్లకమ్మ ఒడ్డుకు వెళ్దాం" అంది బయటకు వస్తూ.

"నేను మీ వెంటవస్తే ఇప్పటికే నానా రకాలుగా భావిస్తున్నారు కదా? మరింత బాధపడటమెందుకు, వెళ్ళండి"

తలుపు తాళం వేసి, తాళంచెవి పర్సులో వేసుకొని పుస్తకాలు తీసుకొంది.

"నేను పల్లెటూరిలో పుట్టనూలేదు, పెరగనూ లేదు. వీళ్ళేదో అనుకుంటారని నాకు భయమూలేదు. నా నీతి నాకుంటుంది. ఎవరో ఏమో అంటే నాకేమిటి భయం?" అంది ముందుకు సాగుతూ. ఆమెతోపాటు రమేష్ నడిచాడు. ఇంటికి వచ్చిముఖం కడుక్కొని కుర్చీలో కూర్చుంది. ఇద్దరూ స్కూలునుండి కలిసి రావడం అందరూ చూస్తూనే ఉన్నారు. మాలపల్లెలో ఇంతకుముందే చెవులు కొరుక్కోవడం సాగించారు. ఇప్పుడది మరింత ఎక్కువయింది. సుజాతమ్మ కాఫీ ఇస్తే తాగి, ఇద్దరూ గుండ్లకమ్మ వైపు సాగారు.

"మీరో తప్పు చేశారనుకుంటున్నాను" అన్నాడు రమేష్ ఇసుకలో కూర్చుంటూ.

మేరీ తటాలున అతనివైపు తల తిప్పి చూసింది కోపంగా! అతడు నవ్వుకున్నాడు.

"ఆ రోజు సనకలూరు ప్రెసిడెంటుకు దేహశుద్ధి చేసి ఉంటే, మిగిలిన ప్రెసిడెంట్లకు మీరంటే కొంత భయంగా ఉండేది. ప్రతి స్త్రీని తమ అవసరాలకు ఉపయోగపడే వారుగా భావించకుండా ఉండేవారు గదా" అన్నాడు.

"నా పరిస్థితులు మీకు తెలియవు. నాకు తల్లి, తమ్ముడు తప్ప మరోదిక్కులేదు. ఎంతో ప్రయత్నం మీద ఈ ఉద్యోగం సంపాదించుకున్నాను. అప్పటికే మా తండ్రి హఠాత్తుగా చనిపోయాడు. తమ్ముడు చదువుకుంటున్నాడు. వాడి




ఖర్చంతా ఉద్యోగం మీదే భరించాలి. నేను, మా తల్లి మిగిలిన డబ్బుతో కాలం గడపాలి. ఇది పోతే మేము అడుక్కొని తినాలి. అందువల్లనే నాకు తెగింపులేదు, వెనక్కూ ముందుకూ చూసుకునే వ్యక్తికి ఎన్నో సమస్యలు గనుక తెగించడం సాధ్యం కాదు. మొండిగా ఏమైనా కానివ్వమనే ధీమాతో ఉన్నప్పుడే తెగింపు. ఆ తెగింపు నాకు లేదు మరి. అందుకే ఈ విధంగా ఉన్నాను."

"మీ భర్త ఏదయినా ఉద్యోగం చేసేవాడా?"

దీర్ఘంగా ఊపిరి విడిచింది. "యం.ఏ. చదువుకుంటున్నాడు. వచ్చిన అవకాశాన్ని పోగొట్టుకోకూడదని, వాళ్ళే వచ్చి అడిగిన తక్షణం మా నాన్న పెళ్ళికి ఒప్పుకున్నాడు. నేనూ ఇంటర్ చదువుతున్నాను. 'చదువు పూర్తిగాకుండా పెళ్ళెందుకు చేయడం' అన్నారు చాలా మంది. ఈ పెళ్ళి చదువుకు అడ్డంకి కాదని అన్నారు మా నాన్న. వివాహం అయిపోయింది. ఆ పెళ్ళికొడుకును నేను పెళ్ళిలో చూసిందే చివరి చూపు. ఆ తర్వాత నేను ఆయన ముఖం చూడలేదు. వివాహమయిన ఆరు నెలల తర్వాత అనుకుంటాను. యూనివర్శిటీలో గూండాల చేతుల్లో కత్తిపోట్లు తిని చంపబడ్డాడని మా నాన్నకు వార్త వచ్చింది. నాకు ఇంటర్ పరీక్షలు జరుగుతున్నాయి. నాకా వార్త చెప్పలేదు. మా అమ్మా, నాన్న



వెళ్ళారు. వాళ్ల ఎందుకు వెళ్తున్నది కూడా చెప్పలేదు. పరీక్షలయిన తరువాత నాకు చెప్పారు. నేనేం చేయగలను? కనీసం శవాన్ని కూడా చూడలేకపో యాను. బతుకుతెరువు కల్పించాలని మా నాన్న ఆలోచించి, అంతటితో చదువు ఆపి, టీచర్ ట్రైనింగ్‌లో చేర్పిం చాడు. చివరకు ఈ విధంగా ఇక్కడకు రాగలిగాను"

తలవంచుకొని చెబుతున్న ఆమెను చూస్తూ కూర్చున్నాడు. ఏడుస్తున్నదో, బాధపడుతున్నదో అతనికి ముఖం కన్పిం చడం లేదు. పెద్ద అందమైనది కాదు. కాని, అనాకారి కూడా కాదు. ఎరుపు ఛాయ. కష్టం లేని జీవితం కావడం వల్ల నాజూకు తేరిన శరీరం. మొగవాడిని వెర్రెత్తించే ఆకర్షణ లేకున్నా, ఇష్టం కలి గించే సౌందర్యం. నల్ల రంగు చీరా, రవికలో ఎరుపుదనం కొట్టవచ్చినట్లు కన్పిస్తున్నది. వయసు పొంగులు కొట్ట వచ్చినట్లు కన్పిస్తున్నవి. అతి చిన్న జీవితం. అంత పెద్ద దెబ్బలు తిన్నా నిబ్బరంగా కన్పిస్తున్నది. ఇటువంటి వారిని సమాజం ఓర్చలేదు. తోటి స్త్రీలు కూడా విధవ అంటే హీనంగానే భావి స్తారు. చూస్తారు. మొగుడంటూ ఎవడో ఒకడు ఉంటే, ఆ స్త్రీ ఎలాంటిదయినా విలువ ఉంటుంది.

నీరెండ పడుతున్నది. ఆవుల మంద అటు వైపు ఒడ్డు నుంచి నీళ్ళలో దిగి నీళ్ళు తాగుతున్నాయి. లేగదూడలు అరుస్తూ ఎగురుతున్నాయి. వాటిని నాకుతూ ఆవులు సంతోషిస్తున్నాయి.

"మీరు పునర్వివాహం చేసుకోవచ్చు కదా?"

అతని వైపు తల తిప్పి చూసి, పేల వంగా నవ్వుతూ "ఇలా బ్రతుకనివ్వండి చాలు" అంది. లేచి ఇసుక విదిలించు కుంటూ నిలబడింది. రమేష్ కూడా లేచి నిలబడుతూ "నా వల్ల మీకు ఎలాంటి బాధ కలిగినా సహించను. మీకు బాధ కలుగుతుందంటే దూరంగానే ఉండ గలను" అన్నాడు.

"అబ్బెబ్బే! అదేం లేదండి. నేను ముందే చెప్పాను కదా. ఈ సమాజం గురించి మనం పెద్దగా ఆలోచించాల్సిన పని లేదు. వాళ్ళేదో ఊహించుకుంటూ ఉంటారు. నా దృష్టిలో ఇద్దరు స్త్రీలు లేక ఇద్దరు పురుషులు చేసే స్నేహం ఎలాంటిదో, ఒక స్త్రీ, పురుషుడు కూడా చేసే స్నేహం అటువంటిదే. మీకు స్నేహితుడిగానే విలువ ఇస్తున్నాను. నన్నెందుకు ఇక్కడ పడవేశారో నాకు ముందే తెలుసు. ఇటువంటి చోట మీలాంటి వారి సహకారం నాకు ఎప్పుడూ అవసరమే. అటువంటప్పుడు దూరంగా ఉండమని ఎలా చెప్పను? కాని, మీరు మన స్నేహాన్ని అపార్థం చేసుకోకుంటే నాకు అంతే చాలు" అంది అభ్యర్థనగా అతడి ముఖంలోనికి చూసి.

"నాకు ఇంత విలువ ఇచ్చినందుకు సంతోషంగా ఉంది. మిమ్మల్ని అర్థం చేసుకుంటాను. అయినా మనిద్దరి మధ్య పెరిగే స్నేహం వారికి కడుపు మంటగా ఉంటుంది. అందువల్ల సాధ్యమైనంత దూరంగా ఉండడమే మంచిది. మీకు అవసరం వచ్చినప్పుడు ఎవరితో పిలి పించినా వస్తాను" అన్నాడు.

పల్లె వద్దకు వచ్చి చెరొక తోవా చీలారు. మేరీ ఆలోచిస్తూ పల్లెలోకి నడి చింది. 'అతని మనసు నొప్పించానా?' అనుకుంది. అప్పారెడ్డి గురించి మనస్సు

బెదరిపోతున్నది. ఈ సమయంలో కనీస రక్షణగా నిలబడేవాడు స్థానికంగా అవసరం. కనుచూపు మేరలో రమేష్ తప్ప మరెవరూ కన్పించడం లేదు. అత డెంతవరకు నిలబడగలడో తెలియదు. నలుగురూ చెప్పేదాన్ని బట్టి ఊగిసలాట మనిషి అని తెలుస్తున్నది.

బయట మంచంలో పడుకున్న తల్లి, మేరీ ఇంటిలోకి వెళ్తుంటే చూస్తూ మళ్ళీ పడుకొని ఉంది. చుట్టుపట్ల అమ్మలక్కలు చెప్పే మాటలు వింటుంటే ఇది పట్నం కాదన్న విషయం ప్రతి నిముషం గుర్తుకు వస్తున్నది. ఇటువంటి చోట ఎంతో జాగ్రత్తగా ఉండాలని ఆమె ఉద్దేశం.

స్నానం చేసి, తల దువ్వుకుంటూ బయటకు వచ్చి అరుగు మీద కూర్చుంది మేరీ.




మరో నెల గడిచినా పంతులమ్మను ప్రెసిడెంటు పిలిపించలేదు. రమేష్ అప్పుడప్పుడు వచ్చిపోతున్నాడు స్కూలు వద్దకు. గ్రామంలోని ప్రజలలో కొంత గౌరవం సంపాదించుకోగలిగింది ఈ మధ్య కాలంలో. పిల్లలకు శ్రద్ధగా పాఠాలు చెప్పడం, క్రమశిక్షణతో తీర్చిదిద్దడం, గత టీచర్లలా పిల్లలను గాలికి వదలకుండా స్కూలు అయిన వెంటనే ఆటలు నేర్పి ఆడించడం జరుగుతోంది.

ఇతరత్రా వ్యాపకాలు ఏవీ లేనందువల్ల పిల్లలను తీర్చిదిద్దాలన్న ఆలోచనతో ఉదయం ఎనిమిది గంటల నుండి సాయంత్రం ఆరు గంటలదాకా స్కూలు వద్దనే గడపడం ప్రారంభించింది. మధ్యాహ్నం పూట ఆడపిల్లలు వచ్చి ఎంబ్రాయిడరీ నేర్పించుకో సాగారు పల్లెలో. రాత్రి ఎనిమిది గంటల నుండి పది గంటలదాకా చెప్పడం! ఆ విధంగా అందరి అభిమానం సంపాదించు కోగలిగిలిగినా మరికొందరికి ఆ కారణంగానే కడుపు మంటగా ఉంది. ఈ కాలంలో కూడా ప్రెసిడెంటు ఆమెను ఏమీ పలుకరించలేదు. అతడి పనులతో అతడు సతమతమవుతున్నాడు. స్కూలులో పిల్లలు కూర్చొనుటకు బెంచీలు లేవు. టీచర్‌కు కుర్చీ లేదు. బ్లాక్‌బోర్డు అసలే లేదు. వాటికొరకు ప్రెసిడెంటు చుట్టూ తిరుగుతూ అవమానకరంగా తయారయ్యేదానికంటే, అతని ఇంటికి పోకుండా ఉండాలనే నిర్ణయించుకుంది. సామాను వస్తే మంచిదే! రాకుంటే వచ్చేనష్టమూలేదు. రమేష్ ఈ విషయంలో మొదట అట్టహాసంగా ప్రవర్తించాడు. తర్వాత ఏంచేశాడో అతడు చెప్పనూలేదు; ఆమె అడుగనూలేదు. అతనివల్ల సాధించే పని కాదని ఎప్పుడో నిర్ణయించుకుంది. ప్రెసిడెంటుతో పోట్లాట పెట్టుకొని రమేష్ సాధించేదేమీ లేదు. ఇద్దరికీ వ్యత్యాసం చాలా ఉంది. పైగా ఆర్థికంగా ఏనుగు ముందు చీమలాంటి పరిస్థితి రమేష్‌ది.

స్వాతంత్రదినం మరో పది రోజులుందనగా అప్పారెడ్డి, అతని అనుచరులు స్కూల్ ఆవరణలోనికి వచ్చేరు. ఆ పాటికి టేబుల్ మీద కూర్చొని 'కాకి-పిచ్చుక' పాఠం చెపుతున్నది మేరీ.

అప్పారెడ్డితో పాటు మిగిలినవారు కూడా వసారాలో నిలబడి వింటున్నారు. వాళ్ళను చూడలేదు ఆమె. తన పనిలో తాను నిమగ్నమై ఉంది. పిల్లలు పాఠం విన కుండా బయటకు చూస్తుంటే, ఆమెకూడా బయటకు చూసింది ఏమిటోనని! బయట నిలబడున్నవారిని చూసి, టేబుల్ దిగి నిలబడింది. అప్పారెడ్డితో పాటు అందరూ లోపలికి వచ్చారు.

"ఏం పంతులమ్మా! స్కూలు బాగా సాగుతోందా?" అన్నాడు చేతులు వెనుక పెట్టుకొని అటు ఇటు తిరుగుతూ. పిల్లలు పలకలు చేత పట్టుకొని వాళ్ళనే చూస్తూ కూర్చున్నారు.

"స్కూల్ ఆవరణలో స్వతంత్ర దినం జరపాలని నిర్ణయించాము. పందిర్లు వేయడానికి వీలు చూడడానికి వచ్చాం" అన్నాడు అప్పారెడ్డి.

"పిల్లల్ని ఆ రోజు శుభ్రంగా రమ్మని చెప్పు. గ్రామంలో ఊరేగింపు పెడదాం! పిల్లలకు జెండాలిచ్చి ఊరేగింపులో చేర్చాలి" అన్నాడు.

"అలాగే చేస్తానండీ!" అంది.

"ఇంతకు ముందు స్కూలుకు ఏవో వస్తువులు కావాలన్నావు కదా! కావలసిన వేమిటో లిస్టు రాసుకొని, సాయంత్రం తెచ్చివ్వు !"

"సరేనండీ" అంది తలూపి.

"ఆ సామాను రమేష్ ఇంకా తెప్పించ లేదా?" అన్నాడు ఆశ్చర్యం నటిస్తూ మునసబు. అందరూ ఘొల్లున నవ్వారు.

"వాడో చట్టు వెధవ. ఈపంతులమ్మ వాడిని పెద్ద హీరోగా భావించి వాడితో తిరిగింది. వాడేం చేస్తాడు?" అన్నాడు. ప్రెసిడెంటు 'తిరిగింది' వత్తి పలుకుతూ.

వాళ్ళ వద్ద రమేష్‌కు, తనకు ఉన్న విలువేమిటో పరోక్షంగా చెబుతున్నారు. వాళ్లు తిరిగిపోవడానికి బయటకు వచ్చారు. ఆవరణ ఇంతకు ముందులాగా గడ్డి గాదం మొలిచి లేదు. అంతా ఊడ్చినట్లు శుభ్రంగా ఉంది. వాళ్లు వెళ్ళిపోయారు. తిరిగి రూమ్‌లోకి వచ్చింది. పిల్లలు రాసు కుంటూ కూర్చున్నారు. సమయం పది గంటలకు పైగానే అయింది. గంట మోగించింది; పిల్లలు ఇల్ల దారిపట్టారు. తలుపుకు తాళం వేసి స్కూల్ ఆవరణ దాటి వస్తుంటే ఒక వ్యక్తి ఎదురు వచ్చాడు. అతని వైపు చూసి తల తిప్పు కొని వెళ్తూ, తిరిగి మళ్ళీ చూచింది. అతడు కూడా తనను చూస్తున్నాడు. ఎక్కడో చూసినట్లుంది; కాని జ్ఞాపకం రావడం లేదు. 'ఎక్కడ చూశాను' అని ఆలోచిస్తూ ఇల్లు చేరింది.

అప్పటికి రమేష్ వచ్చి పుస్తకం చదువుతూ కూర్చున్నాడు. అతడికి ఎదురుగా తల్లి కూర్చొని రవికకు గుండీలు కుడుతున్నది. రచ్చబండ మీద ఎవరో ఇద్దరు కూర్చొని మాట్లాడు తున్నారు. పిల్లలు చెట్టు కింద ఎగురుతూ ఆడుకుంటున్నారు. అరుగు మీద పడు కొని నిద్రపోతున్నారు ఎవరో!

"ఎప్పుడు వచ్చారు మీరు?" అంది లోనికి వస్తూనే.

"ఒక గంట అయింది. మీరు ఇంకా రాలేదేమిటని చూస్తున్నాను" అన్నాడు పుస్తకం మడిచి పక్కన పెట్టి.

"ప్రెసిడెంటుగారు స్కూలు చూడ డానికి వచ్చాడు. స్వతంత్రదినం అక్కడ జరుపుతున్నారట. పెద్ద పెద్ద అధికారులూ, నాయకులూ వస్తారట; స్కూలుకు కావలసిన వస్తువులు ఏం కావాలో

స్వాయం[త్రం లిస్టు రాసుకుని రమ్మ న్నాడు" అంది.

సుజాతమ్మ కూతురి వైపు చూసింది. మేరీ ముఖం నిర్మలంగా ఉంది.

"ఔను; నేనూ విన్నాను. స్వతం[త దినం జరపడానికి ఐదు వేలు ఖర్చులకని రాబట్టారు. వాళ్ళలోనే ఒక వర్గం వ్యతి రేకిస్తున్నారట. ఐదు వేలు [గామ అభ్యు దయం కోసం ఖర్చు చేయడానికి బదులు, జల్సాలకు తగలేస్తున్నారని అంటున్నా రట! మళ్ళీ వారిలో వారికే చీలికలు వస్తాయి" అన్నాడు రమేష్.

"వారి చీలిక వల్ల మీరేం లాభపడ తారు? సరేలెండి! నేను భోజనం చేయాలి. ఆకలిగా ఉంది" అంటూ దొడ్డి లోకి వెళ్ళి ముఖం కడుక్కొని వచ్చింది.

"మీరు కూడా రండి భోజనంచేద్దాం!" అంది.

"లేదు. ఇంతకు ముందే చేసి వచ్చాను".

"అయినా మా ఇంట్లో ఈ ఊరిలో భోజనం చేయగలరా? ఎవరైనా చూసి మీ ఇంటి వద్ద చెబితే మీ కులం పోదూ?"

"అలా అనుకుంటే ఒంగోలులో ఎందుకు తింటాను?"

"అక్కడ చూసి చెప్పేవారు ఎవరూ లేరు కాబట్టి!"

రమేష్ మాట్లాడ లేదు. మేరీ చెప్పిన మాటల్లో నిజం ఉంది. తాను ఇక్కడ అన్నం తింటే దండోరా వేసి అల్లరి పట్టించగలడు [పెసిడెంటు. [పెసి డెంటు చేస్తాడని కాదు గాని, అసలు తనకా తెగింపు లేదు.

"మీరు కూడా ఈ ఉత్సవాలలో కలు స్తారా?" అంది అన్నం తింటూ.

"ఏమో! ఎలా చెప్పగలం! అప్పటి పరిస్థితులు. పైగా [పెసిడెంటుకు పోటీగా యువజన సంఘం వాళ్లు చేస్తామన్నారట తక్కువ ఖర్చుతో! ఈ విధంగా [పెసి డెంటు మీద అప్పుడే దాడి ఆరంభించారు. ఈ సమయంలో దొరికే అవకాశాన్ని ఉపయోగించుకోక తప్పదు" అన్నాడు.

"మీరు కూడా దానికి నాయకులే కదా ఒకప్పుడు. మళ్ళీ కలిసి పనిచేసి [పెసి డెంటును సాధించేందుకు ఎందుకు [పయ త్నించకూడదూ?"

"అంత సులభమైంది కాదులెండి. [పెసిడెంటు కంటే భయంకరమైన వాళ్లు ఆ సంఘాన్ని ఆ[కమించుకున్నారు. వాళ్ల కున్న ఆర్థిక స్థితిని బట్టి వాళ్లు 'తాన' అంటే యువజన సంఘం 'తందాన' అంటున్నది. అందులో నాలాంటివారు ఇమిడి ఉండలేరు" అన్నాడు.

నిజమేననుకుంది పంతులమ్మ. ఏకాకిగా పోరాడాలి. ఎవరినీ నమ్మకూడ దనే రమేష్ తత్వం ఆమెకు బాగా అవ గాహన అయిపోయింది. పైగా అతనికి ఇప్పటికీ కుల సిద్ధాంతం మీద నమ్మక మున్నట్లుంది. లేకుంటే మరో ఆలోచన లేకుండా తమతో కలిసిపోవచ్చు.

దాసం లోనికిచూస్తూ వెళ్లాడు. తాగి ఉన్నట్లు లేదు. దానాన్ని ముసురూ చూశారు. ఎవరూ ఏమీ మాట్లాడలేదు. రమేష్ మీద గతంలో ఉన్న నమ్మకం సడలింది పంతులమ్మకు. అతడే పనీ చేయలేదు. అతడికి అసలు ఆ సామర్థ్యం లేదు! ఆ [గామంలో ఏం చేయబోయినా తనే దెబ్బతింటాడు. గతంలో టీచరు రమేష్ మాటలు వినే [పెసిడెంటును ఎదిరించి, చివరకు తన్నులు తిని స్కూలు విడిచి వెళ్ళాడు. రమేష్‌ను అనుసరిస్తే

చివరకు తన గతీ అంతేనని ప్రారంభం లోనే ఘటనలు నిరూపించినా, అతడు నిలబడగలడని ఆ రోజు ఆలోచించింది. కాని, ఆ నమ్మకం ఇప్పుడు లేదు. అతను ఏనాడయినా దిగజారి, టీచర్‌ను భ్రష్టు పట్టించి, పక్కకు తప్పుకుంటాడు. అంత మాత్రంతో తాను వారికి లొంగి ఉండాలని కాదు. కాని, ఆ స్థాయి వచ్చేవరకు మిన్న కుండడం మంచిదనుకుంది.

"వెళుతున్నానండి" అంటూ రమేష్ వెళ్లిపోయాడు.

ఎంబ్రాయిడరీ వస్తువులు తీసుకొని, స్కూలు వైపు వెళ్ళింది మేరీ.

సాయంత్రం స్కూలు వదలిన తర్వాత అట్నుంచే ప్రెసిడెంటు ఇంటికి వెళ్లింది. ప్రెసిడెంటు పేపరు చూస్తు న్నాడు. అలికిడి విని "రా లోపలకు" అన్నాడు. మేరీ లోపలికి వెళ్ళి అరుగు మీద కూర్చుంది. ఆ అరుగు ప్రత్యేకంగా కట్టించారు. ఏ ఉద్యోగి అయినా తక్కువ వ్యక్తి వస్తే కుర్చీమీద గాకుండా, ఆ అరుగుమీదే కూర్చోవాలి.

"లిస్టు రాసుకొచ్చావా?"

"తెచ్చానండీ!" అంటూ కాగితాలు అందించబోయింది. ఆ చెయ్యి పట్టు కున్నాడు అప్పారెడ్డి. నిర్విణ్ణురాలై తటాలున చెయ్యి వెనక్కు లాక్కుంది. కాగితాలు కింద పడ్డాయి.

"ఆ రమేష్‌గాడితో తిరిగేదానివిగదా! వాడికంటే నేను తక్కువవాడినా?" అన్నాడు లేస్తూ. పంతులమ్మ లేస్తూ కోపంగా అంది "అందర్నీ ఒకగాట కట్టి వేయకండి. మర్యాద ఇచ్చి పుచ్చుకోండి"

"నీ బతుకంతా నా చేతిలో ఉంది. నేను తలుచుకుంటే నీ ఉద్యోగం నిల వదు".

"నీచంగా బతికేదానికంటే అదే మేలు" అంటూ బయటకు వచ్చి ఇంటి దారి పట్టింది. కన్నీరు బొటబొట కారింది. జీవితంలో ఇది రెండో పరాభవం అను కుంది.

చీకటి పడుతున్నది. పొలాలనుండి ఇంటికి తిరిగి వచ్చినవారు కావళ్ళతో నీళ్లు తెస్తున్నారు.

'పంతులమ్మ' బతుకులంతా గ్రామ పెత్తందారులకు, రౌడీలకు లొంగి పోవడ మేనా?' అనుకుంది. ఇంటికి తిరిగివచ్చి, ఒక పిల్లాడిని పిలిచి రమేష్‌ను పిల్చుకొని రమ్మంది.

రమేష్ వచ్చిన తరువాత, తల్లిముందే అతనితో వివరాలు చెప్పి ఏడ్చింది. "దీన్ని గురించి మీరేంచేస్తారో చెప్పండి?" అంది.

రమేష్ నిస్సహాయంగా చూసి "ఆలోచిద్దాం!" అన్నాడు. అంతకు మించి ఆ సమయంలో ఏ మాట్లాడాలో అతడికీ తెలియదు. యువజన సంఘం ఉందిగానీ, అది ఇతన్ని లెక్కచేయదు. వాళ్ళ దృష్టిలో చపలచిత్తుడుగా నిర్థారింప బడ్డాడు. ఆ నాయకత్వంతో సరి అయిన సంబంధాలు లేవు.

"యువజన సంఘం వారితో మాట్లాడి ఆ తర్వాత ఆలోచిద్దాం!" అంటూ లేచాడు. ఒకవ్యక్తికి ఆపద కలిగినప్పుడు ధైర్యంగా నిలబడి సహాయం చేసిన వాడికే గౌరవం, విలువ, మర్యాద. నిలిచి ఎదిరించే స్థాయి రమేష్‌కు లేదు. ఎదిరిస్తే పచ్చడిలా నూరి వేస్తారు. రమేష్ ప్రభుత్వానికి నోటీసులు పంపగలడు కాని, ఎదు ర్కోవడం చేతగాని వ్యక్తి అని ఆమె నిర్ణయించుకుంది.

చివరకు తన గతీ అంతేనని ప్రారంభం లోనే ఘటనలు నిరూపించినా, అతడు నిలబడగలడని ఆ రోజు ఆలోచించింది. కాని, ఆ నమ్మకం ఇప్పుడు లేదు. అతను ఏనాడయినా దిగజారి, టీచర్‌ను భ్రష్టు పట్టించి, పక్కకు తప్పుకుంటాడు. అంత మాత్రంతో తాను వారికి లొంగి ఉండాలని కాదు. కాని, ఆ స్థాయి వచ్చేవరకు మిన్న కుండడం మంచిదనుకుంది.

"వెళుతున్నానండి" అంటూ రమేష్ వెళ్లిపోయాడు.

ఎంబ్రాయిడరీ వస్తువులు తీసుకొని, స్కూలు వైపు వెళ్ళింది మేరీ.

సాయంత్రం స్కూలు వదలిన తర్వాత అట్నుంచే ప్రెసిడెంటు ఇంటికి వెళ్లింది. ప్రెసిడెంటు పేపరు చూస్తు న్నాడు. అలికిడి విని "రా లోపలకు" అన్నాడు. మేరీ లోపలికి వెళ్ళి అరుగు మీద కూర్చుంది. ఆ అరుగు ప్రత్యేకంగా కట్టించారు. ఏ ఉద్యోగి అయినా తక్కువ వ్యక్తి వస్తే కుర్చీమీద గాకుండా, ఆ అరుగుమీదే కూర్చోవాలి.

"లిస్టు రాసుకొచ్చావా?"

"తెచ్చానండీ!" అంటూ కాగితాలు అందించబోయింది. ఆ చెయ్యి పట్టు కున్నాడు అప్పారెడ్డి. నిర్విణ్ణురాలై తటాలున చెయ్యి వెనక్కు లాక్కుంది. కాగితాలు కింద పడ్డాయి.

"ఆ రమేష్‌గాడితో తిరిగేదానివిగదా! వాడికంటే నేను తక్కువవాడినా?" అన్నాడు లేస్తూ. పంతులమ్మ లేస్తూ కోపంగా అంది "అందర్నీ ఒకగాట కట్టి వేయకండి. మర్యాద ఇచ్చి పుచ్చుకోండి"

"నీ బతుకంతా నా చేతిలో ఉంది. నేను తలుచుకుంటే నీ ఉద్యోగం నిల వదు".

"నీచంగా బతికేదానికంటే అదే మేలు" అంటూ బయటకు వచ్చి ఇంటి దారి పట్టింది. కన్నీరు బొటబొట కారింది. జీవితంలో ఇది రెండో పరాభవం అను కుంది.

చీకటి పడుతున్నది. పొలాలనుండి ఇంటికి తిరిగి వచ్చినవారు కావళ్ళతో నీళ్లు తెస్తున్నారు.

'పంతులమ్మ' బ్రతుకులంతా గ్రామ పెత్తందారులకు, రౌడీలకు లొంగి పోవడమేనా?' అనుకుంది. ఇంటికి తిరిగివచ్చి, ఒక పిల్లాడిని పిలిచి రమేష్‌ను పిల్చుకొని రమ్మంది.

రమేష్ వచ్చిన తరువాత, తల్లిముందే అతనితో వివరాలు చెప్పి ఏడ్చింది. "దీన్ని గురించి మీరేంచేస్తారో చెప్పండి?" అంది.

రమేష్ నిస్సహాయంగా చూసి "ఆలోచిద్దాం!" అన్నాడు. అంతకు మించి ఆ సమయంలో ఏ మాట్లాడాలో అతడికి తెలియదు. యువజన సంఘం ఉందిగానీ, అది ఇతన్ని లెక్కచేయదు. వాళ్ళ దృష్టిలో చపలచిత్తుడుగా నిర్ధారింప బడ్డాడు. ఆ నాయకత్వంతో సరి అయిన సంబంధాలు లేవు.

"యువజన సంఘం వారితో మాట్లాడి ఆ తర్వాత ఆలోచిద్దాం!" అంటూ లేచాడు. ఒకవ్యక్తికి ఆపద కలిగినప్పుడు ధైర్యంగా నిలబడి సహాయం చేసిన వాడికే గౌరవం, విలువ, మర్యాద. నిలిచి ఎదిరించే స్థాయి రమేష్‌కు లేదు. ఎదిరిస్తే పచ్చడిలా నూరి వేస్తారు. రమేష్ ప్రభుత్వానికి నోటీసులు పంపగలడు కాని, ఎదు ర్కోవడం చేతగాని వ్యక్తి అని ఆమె నిర్ణయించుకుంది.




పోతున్న రమేష్ వైపు నిస్సహాయంగా చూస్తూ, కళ్లనుండి నీరు కారుతుండగా నిలబడింది. సుజాతమ్మ అక్కడకు వచ్చి, బుగ్గల మీదుగా కారుతున్న నీటిని పమిట కొంగుతో తుడిచింది.

"ఎందుకే బాధపడతావు? ఊళ్ళోవాళ్ళు అందరూ ఒకటేనే! నీ కొరకు అతడు గ్రామంలో వాళ్లను ఎదిరిస్తాడా? ఆ దమ్ము ఉంటే ఇక్కడ అన్నమే తినక పోయాడా? ఏదో యువకులు దగ్గరగా రావడానికి ప్రయత్నాలు చేస్తారు. ఆవేశాలతో మాట్లాడి ఆకర్షించడానికి ప్రయత్నం చేస్తారు. ఇంకా మంచిది. ఇంతటితో పోయింది."

అటుగా వెళ్తున్న ఏసును పిలిచి వివరాలు చెప్పింది సుజాతమ్మ. విని ఆశ్చర్యంగా నోరు తెరిచాడు ఏసు. బాధగా ఆమె వైపు చూస్తూ, "ఏం చేస్తామమ్మా! వాళ్ల బతుకులే అటువంటివి! వాళ్లు దేనికయినా తెగిస్తారు" అన్నాడు విచారంగా.

చేపలవల భుజం మీద నుండి కిందికి దింపి కూర్చున్నాడు.

* * *

బయటకు వెళ్తున్న రమేష్‌ను చూచి "ఎక్కడికి వెళుతున్నావురా? అన్నాడు తండ్రి.

"బజారుకు వెళ్తున్నానులే" అంటూ బయలుదేరాడు.

"తర్వాత పోదువుగాని, ఇటుకూర్చో"

రమేష్ మాట్లాడకుండా కూర్చున్నాడు.

"ఏమిట్రా! వాళ్ళతో మళ్ళీ తగపులాట పెట్టుకుంటున్నావట? అనవసరంగా లేనిపోనివన్నీ నెత్తికెందుకు తెచ్చుకుంటావ్?"

"నేనేమీ అనవసరంగా కలుగచేసుకోలేదులే! వచ్చే టీచర్లంతా తనకు లొంగి ఉండాలనీ, స్కూలు వస్తువులన్నీ ఇంట్లో చేర్చుకోవాలనీ చూస్తుంటే నోరు మూసుకొని కూర్చోవాలా ఏమిటి?"

"ఏం చేస్తావురా నువ్వు? తాదూర కంతలేదు, మెడకో డోలు అన్నట్లు వారితో వైరం పెట్టుకొని నీవు ఏదో సాధించడానికి బదులు ఊరు విడిచి వెళ్ళాల్సి వస్తుంది. వాళ్ళు మోతుబర్లు, రౌడీ రెడ్లు. అన్నింటికీ తెగించిన వాళ్లు. అధికారాలు చేతిలో ఉన్నవాళ్ళు. అనవసరంగా కలుగచేసుకోకు. మనమంటే గ్రామంలో సుందే అలుసు. కులరీత్యా కూడా లోకువగా పడి ఉండవలసివస్తున్నది."

"నేనేమీ కానిపని చేయడం లేదులే!" అంటూ లేచి బయటకు సాగాడు. పెద్ద బజారులో ధనుంజయ్ కన్పించాడు.

"ఏమిట్రా పంతులూ! చాలా రోజుల తర్వాత కన్పించావు? విశేషాలేమిటి!" అన్నాడు నవ్వుతూ.

"నేను కన్పించడమేమిట్రా! నీవు అసలు ఊళ్ళో లేనేలేవుగదా! ఎప్పుడొచ్చావ్? ఏమిటి సంగతులు?"

"రాత్రి వచ్చాను. పరీక్షలయిపోయాయి. ఇన్నాళ్ళూ మా పిన్నివాళ్లు రానివ్వలేదు. చివరకు అన్నీ తెంచుకొని వచ్చాను"

"అన్నీ అంటే?"

"చదువు ఇంతటితో ఆపి వీలుంటే ఉద్యోగం వెతుక్కోడం! లేకుంటే మేడి పట్టడం! నీ ఉద్యోగ విశేషాలు ఏమిటి?" అన్నాడు రమేష్ భుజం తడుతూ.

"నాకు జల్సాగా తిరగడమొకటే ఉద్యోగమయింది. మరో నాలుగు రోజుల్లో స్వాతంత్ర్య దినం జరపాలని ప్రెసిడెంటు

ప్రయత్నం చేస్తున్నాడు. భారీ ఎత్తున జరిపి కలెక్టర్, యస్. పి., జిల్లాపరిషత్ ప్రెసిడెంటు, సమితి ప్రసిడెంటు వగైరా మహానాయకుల్ని పిలిచి పెద్ద ఎత్తున సన్మానం చేస్తున్నాడట. డబ్బులు లాగడానికి నెలకో కొత్తరకం బాణి ఏర్పాటు చేస్తున్నాడురోయ్! ఈమధ్యనే ఒక టీచర్‌ను బెదిరించి పంపించాడు. మరో లేడీ టీచర్ వస్తే అసభ్యంగా ప్రవర్తిస్తున్నాడు"

"నీవు పంచాయతీకి పోటీ చేశావట కదా? ఏమయింది?"

"ఏమవుతుంది? వాళ్ళ రామయ్య బాబాయికి పోటీ చేసే అవకాశం ఇవ్వలేదని యువజన సంఘాన్ని తన చేతి కింద ఉంచుకుని, అప్పారెడ్డినే బలపరచాడు నాగిరెడ్డి. ఆ విధంగా నన్ను నాశనం చేశాడు"

"అక్కడికే వెళ్తున్నాను. వస్తావా?"

"వాడు నాతో మాట్లాడడం లేదురా"

"నాతోరారా! అన్నీ సర్దుకుపోతాయి. అనవసరంగా కలిసి వచ్చేవారితో వ్యతిరేకంగా తయారుకావొద్దు. పైగా వాళ్ళు కూడా స్వతంత్రదినం జరుపుతున్నారట యువజన సంఘం పేరుతో. గ్రామంలో ఈ రెండు టీముల్లో ఏదాన్ని బలపరచాలనే ప్రశ్న వస్తే మనం బలపరచవలసింది నాగిరెడ్డినే! రా వెళ్దాం. మనం కూడా కలిసి వారితో పనిచేద్దాం"

ఇద్దరూ వెళ్ళేటప్పటికి బయట నాగిరెడ్డి తండ్రి సుబ్బయ్య కూర్చొని ఉన్నాడు తాడు పేనుకుంటూ.

"ఏరోయ్ ధనుంజయ్! ఎప్పుడొచ్చావ్?" అన్నాడు రమేష్‌ను చూసి 'వీడు ఎందుకు వచ్చినట్లు?' అనుకుంటూ.

"నిన్న వచ్చాను మామయ్యా! నాగు ఎక్కడున్నాడు?"

"లోపలున్నాడు చూడు"

ఇద్దరూ లోనికి వెళ్ళేటప్పటికి నాగిరెడ్డి కాఫీ తాగుతున్నాడు. రమేష్ రావడం చూసి ఆశ్చర్యపోతూనే "రండి రండి" అన్నాడు. "ఎప్పుడొచ్చావురా? కులాసాయేనా? పరీక్షలు అయిపోతూనే వస్తానన్నావు. రాలేదేమిటి?"

"ముందు మాకు కూడా వేడి నీళ్ళు పడేయ్!" అన్నాడు నవ్వుతూ ధనుంజయ్.

నాగిరెడ్డి నవ్వి లోనికి వెళ్ళి రెండు గ్లాసులు పాలు తెచ్చి ఇచ్చాడు.

పాలు తాగి ముగ్గురూ గ్రామ చావడి వద్దకు వచ్చారు. చావడినిండా జనం జట్లు జట్లుగా కూర్చొని మాట్లాడుకుంటున్నారు.

"ఏరా! గ్రామపంచాయతీ ఎన్నికలలో అప్పారెడ్డిని బలపరచారట? మనవాణ్ని దూరం చేశారట కదా?" అన్నాడు ధనుంజయ్.

"అప్పుడు తప్పని పరిస్థితిరా! మా బాబాయి పంచాయితీ ఎన్నికలలో పోటీ చేస్తానన్నాడు. రమేష్ తనే చేయాలన్నాడు. రమేష్ కాకుండా మా బాబాయి పోటీ చేస్తే గెలుపు మనది. రమేష్ తీసుకున్న నిర్ణయంతో మా బాబాయికి కోపం వచ్చి వారితో కలిసి వైస్ ప్రెసిడెంటు పదవి, ఏడు వార్డుల్లోనూ నాలుగు మాకు ఇచ్చే విధంగా ఒప్పందం చేసుకున్నారు. పైగా రమేష్ గ్రామంలో ఏ పనీ చేయలేని అసమర్థుడిగా ముద్రించబడ్డాడు. ఏదో ఒక పని చేయడానికి ప్రయత్నం చేస్తాడు. కొంతవరకు తెచ్చి అది పూర్తి గాకుండానే రెండోపని మొదలెడతాడు. అదీ ఇదీ రెండూ కావు. ఆ




విధంగా తిరుగుతున్న వ్యక్తిని ప్రెసిడెంటుగా ఉంచడానికి యువజన సంఘం వ్యతిరేకించింది. అందరితోపాటు నేనూ కలిసి ఉండాలికదా!"

"యువజన సంఘం ముందు నన్నే బలపరచారు కాబట్టి నేను పోటీ చేస్తానన్నాను. ఎందుకు బలపరచారు ఇష్టం లేకుంటే?" అన్నాడు రమేష్.

"గ్రామరాజకీయాలుమారుతుంటాయి. వాటి ప్రకారమే నడవాలి. అంతేగాని గీతగీసి దాన్ని మేం దాటమంటే నష్టపోయేది మనమే! యువజన సంఘం బలపరిచినంత మాత్రాన గెలుపు సాధ్యం కాదు. అందుకే వాళ్ళు కూడా వ్యతిరేకించారు చివరకు" అన్నాడు నాగిరెడ్డి.

"జరిగిందేదో జరిగిపోయింది గాని, మళ్ళీ మీలో మీరు తగవు పడినట్లుందే మిత్రా? స్వతంత్రదినం విడిగా జరుపుతున్నారట కదా" అన్నాడు ధనుంజయ్.

"అవును. అయిదువేల రూపాయలు ఖర్చుచేసి ఆడంబరంగా చేయడంకంటే ఆ మొత్తాన్ని ఖర్చుపెట్టి గ్రామంలో మురుగు కాల్వలు, రోడ్లు, పూడిపోయిన బావులు బాగుచేయిద్దామనుకున్నాడు మా బాబాయి. యువజన సంఘం అదే అభిప్రాయం వెలిబుచ్చింది. అప్పారెడ్డి తన బావుటా ఎగురవేయటానికి ఈ ఉత్సవం పేరుతో అందర్నీ తీసుకవచ్చి ఖర్చు చేస్తున్నాడు. అందువల్ల అతడితో కలవకుండా మేం ప్రత్యేకంగా ఏర్పాటు చేస్తు



న్నాం. అంతా వందరూపాయల ఖర్చు"

"మేం కూడా కలిసివస్తాం" అన్నాడు ధనుంజయ్.

"కలిసి వస్తే వద్దనేది ఎవర్రా!. అందరం కలిసి ఉంటేనే మనం ఏ పని అయినా చేయగలుగుతాము" అన్నాడు నాగిరెడ్డి.

ఇంతలో మరో నలుగురు యువకులు వచ్చి వీరి మాటలు వింటూ కూర్చున్నారు.

పంతులమ్మ విషయం వివరంగా చెప్పాడు రమేష్.

"నాకు కూడా తెలిసింది. కాని, ఈ గొడవ అయిపోయిన తర్వాత ఆ విషయం ఆలోచిద్దామనుకున్నాను. అప్పారెడ్డి రౌడీ ఇజాన్ని నేను ఎప్పుడూ వ్యతిరేకిస్తాను. ఆరోజు పరిస్థితిలో ఓట్లు వేయక తప్పింది కాదు" అన్నాడు నాగిరెడ్డి.

"ప్రతిసారి దాన్ని గురించి చర్చ ఎందుకులేరా! అయిందేదో అయింది. మళ్ళీ మనం కలిసి పనిచేస్తే అప్పారెడ్డి ఏమీ చేయలేడు" అన్నాడు ధనుంజయ్ సమర్థింపుగా.

"సరే! రాత్రి సమావేశం ఏర్పాటు చేస్తున్నాం. కార్యక్రమాలు ఏవి ఎవరు తీసుకోవాలో నిర్ణయించుకోవాలి. మరో నాలుగు రోజులేకదా ఉంది. మీరు కూడా పెందలకడ అన్నం తిని రండి" అని చెప్పి నాగిరెడ్డి లేచాడు. యువకులు వెళ్ళిపోయారు.

"ఒరేయ్ పంతులూ! వీళ్ళతో వ్యతిరేకమై గ్రామంలో నీవు ఒక్కడివీ ఏం సాధిస్తావురా? కనీసం ధైర్యంగా కూడా నిలబడలేవు. వారందరూ ఏకమయితే నీవు వట్టి చవటవే! వాళ్ళలో చీలిక వచ్చి నప్పుడే నీకూ కొంత విలువ. గుర్తుపెట్టుకో. తొందరగా రా!" అంటూ లేచి ముందుకు సాగాడు ధనుంజయ్.

ప్రెసిడెంటు ఇంటిముందుగా వెళుంటే మునసబు రమణారెడ్డి పిలిచాడు. "ఏగో ధనుంజయ్ రారా!! కూర్చుందువురా!"

అతడి పక్కనే కూర్చున్నాడు ధనుంజయ్.

"అప్పారెడ్డి రేపు పెద్ద పెద్ద నాయకులనంతా పిలిపిస్తున్నాడురా! కలెక్టరు కూడా వస్తాడు. ఎవడయినా మినిస్టర్ కూడా రావచ్చు! మీలాంటి యువకులంతా ముందు నిలబడాలిరా!" అన్నాడు రమణారెడ్డి.

"వెనుక నిలబడితే కలెక్టరు కనిపించడు బాబాయ్! అందువల్ల ముందే నిలబడతా!"

"జోకులు వెయ్యకురా! కార్యక్రమాలు తీసుకొని పనిచేసి జయప్రదం చేయాలి!"

"మా సంఘం వాళ్ళున్నారు కదా! అందర్నీ కలిపి మాట్లాడుతాను. మంచి కార్యాన్ని ఎవరూ వ్యతిరేకించరు" అంటూ లేచి ముందుకు సాగాడు.

అందరూ కలిసేటప్పటికి రాత్రి తొమ్మిదిగంటలయింది. తిరిగి యువజన సంఘం బలంగా పనిచేయాలని నిశ్చయించుకున్నారు. ముందుగా కొన్ని చర్యలు తీసుకోవడం ద్వారా ప్రజల అభిమానం సంపాదించాలి. ఎంతసేపూ అప్పారెడ్డిని తిట్టే కార్యక్రమమే అయితే సహకరించరు. ముందుగా గ్రామంలో రోడ్లు, మురుగు కాల్వలు, స్త్రీలకు మరుగు దొడ్లు, తాడూరు నుండి మోదేపల్లెవరకూ బస్సు వచ్చుటకు రోడ్డు, నీటి సౌకర్యం, స్కూల్ విషయాలు తీసుకోవాలను కున్నారు. అన్నింటినీ ఒకేసారి గాకుండా,




ఒక్కొక్కటి పూర్తి చేయాలని నిశ్చయించుకున్నారు.

ముప్పైమంది వచ్చారు. ప్రెసిడెంటుగా నాగిరెడ్డి పేరు అందరూ ఒప్పుకున్నారు. కొందరు వ్యతిరేకించినా కార్యదర్శిగా రమేష్‌ను నియమించారు.

ధనుంజయ్ ఖచ్చితంగా చెప్పాడు. "మీలో మీరు అనవసరంగా పోట్లాటలు పెట్టుకోకండి. అది ఆ వర్గానికి బలం చేకూర్చడమే అవుతుంది. వాళ్ళయినా గ్రామంలో మంచిపనులు చేసేటప్పుడు బలపరచడం ముఖ్యం. మంచి ఎవరు చేసినా మనం ముందుండాలి. ఇక్కడ గ్రూపు, కులవర్గ పద్ధతులు ఏవీ వద్దు. ఒక సమస్య తీసుకుంటే దాన్ని పూర్తిగా నెరవేర్చడానికి ప్రయత్నించాలి. మధ్యలో విడువకూడదు".

అలాగే స్వతంత్రదినం ఇప్పటికయినా దుబారా తగ్గించి పనిచేయడానికి వీలుంటే ప్రెసిడెంటుతో కలిసి మాట్లాడాలి. రెండు గ్రూపులుగాకాకుండా ఐక్యంగా జరపాలి"

అప్పారెడ్డితో మాట్లాడడానికి నాగిరెడ్డిని నియమించారు. సఫలమయినా, విఫలమయినా బాధ్యత అతడిదే !

మరుసటిరోజే ప్రెసిడెంటును కలిశాడు నాగిరెడ్డి. తమ సంఘం నిర్ణయాలు చెప్పి "మీరు ఖర్చుపెట్టే డబ్బు తగ్గించి క్లుప్తంగా జరిపి ఆ డబ్బు ఇతర కార్యక్రమాలకు వినియోగిస్తామంటే మేమూ కలిసివస్తాం. లేకుంటే విడిగా చేసుకుంటాం" అన్నాడు.

"ఆ పప్పులేమీ ఉడకవు. అందరికే ఆహ్వానాలు పంపాము. అన్ని నిర్ణయాలు పూర్తయ్యాయి. ఇప్పుడు మానుకోవడం లేదూ, ఖర్చులు తగ్గించేదీ లేదు. కలిసి వస్తే రండి; లేకుంటే మీ యిష్టం" అన్నాడు ప్రెసిడెంటు. వాళ్ళు ఇదంతా రమేష్ చేస్తున్నాడనుకున్నారేగానీ అంతకు ముందే నాగిరెడ్డి నిర్ణయించుకున్నాడని ఊహించడం లేదు.

సమస్య వెంటనే గ్రామ పెద్దల ముందుకు తెచ్చాడు నాగిరెడ్డి.

"మీకెందుకురా! ఏదో వండింది తిని పని చేసుకోక?" అన్నాడు మునసబు కోపంగా.

"మీకెందుకు ఈ ముసలితనంలో? హాయిగా తిని పడుకోక!" అన్నాడు నాగిరెడ్డి అంతకంటే కోపంగా.

వాగ్వివాదాలు జరిగాయి. చివరకు ఎవరూ దేనికీ ఒప్పుకోలేదు. ఎవరి పట్టు మీదనే వాళ్లున్నారు. ఎవరి పద్ధతిలో వారు చేసుకోవడం ఖాయమని తేలిపోయింది.

"గ్రామంలో మళ్ళీ పుండు పుట్టింది రోయ్! కుర్రకారంతా ఏకమయి ఉన్నారు" అన్నాడు మునసబు అవహేళనగా.

"మనం నోరు మూసుకుంటే వీళ్ళు మునుపటిలాగానే నెత్తికి ఎక్కుతారు. ఒక్కొక్కడిని ఈడ్చి తన్నితేసరి" అన్నాడు రామానాయుడు.

"ముందు మీ ధనుంజయ్‌ని కట్టేయవయ్యా! తర్వాత మిగిలినవారు. ఎవరి ఇళ్ళలో వాళ్లు అణచివేస్తే పైకి ఎందుకు వస్తారు?" అన్నాడు మునసబు.

"సరే! వాళ్ళు చేసుకోనీ! మన కార్యక్రమం మనం చేద్దాం! ఎవరి ఇష్టం వారిది!" అన్నాడు గురవయ్య.

ఇంటికి వచ్చిన తరువాత నాగిరెడ్డికే నచ్చచెప్పి తాత్కాలికంగా అవేమీ లేకుండా చూద్దామని చూశాడు రామయ్య. నాగిరెడ్డి వినలేదు. జరిగి తీరాలన్నాడు. ఈ సమయంలో ప్రెసిడెంటుకు తొంగి



చతుర ...

పోతే భవిష్యత్తులో మన మాట ఎవరూ వినరని చెప్పాడు.

మొదటినుండి మొండిపట్టుగా పేరు పొందినవాడు. అందువల్ల చెప్పినా వినడని రామయ్య తర్వాత చెప్పలేదు. ధనుంజయ్‌తో చెప్పించాలని ప్రయత్నం చేశాడు. కాని నాగిరెడ్డి తీసుకున్న నిర్ణయం చాలా మంచిదని ధనుంజయ్ సమర్థించాడు.

ప్రెసిడెంటు ఒకవైపు చందాలు రాబట్టుతుంటే, నాగిరెడ్డి, ధనుంజయ్, రమేష్ కలిసి తిరుగుతూ చందాలు రాబట్టుతున్నారు. ముందు అనుకున్నట్లు స్కూలు ఆవరణలోగాకుండా ప్రెసిడెంటు ఇంటి వద్దనే భారీగా జరపాలని నిర్ణయించుకున్నారు. ఇంత ఖర్చు పెడుతూ ఎక్కడో ఎందుకు జరపాలనుకున్నారు. రాత్రికి డాన్స్ ప్రోగ్రాములు, వచ్చేవారికి పడక, భోజన సౌకర్యాలు అన్నీ ఏర్పాటు చేయాలనుకున్నారు.

ధనుంజయ్ వర్గం స్కూలు ఆవరణలో సభ జరపాలని నిర్ణయించారు. ఎవరినీ ఆహ్వానించలేదు. వంద రూపాయలు, ఒక్కరి పార్టీకి కూడా చాలవు మరి. ప్రెసిడెంటు స్వయంగా తన ప్రతిభ చూపుకోవడానికి చందాల ద్వారా విపరీతంగా డబ్బు రాబట్టాడు. అంచనా వేసినది ఐదు వేలే అయినా అంతకు మించి వసూలు చేశారు. ముఖ్యమయిన నాయకులు వేల మీద చందాలు వేసుకున్నారు. కార్యక్రమం ఆడంబరంగా జరిగింది. మేళతాళాలతో ఊరేగింపు, ఆ తర్వాత బహిరంగ సభ జరిగాయి. వచ్చిన అతిథులకు అన్ని సౌకర్యాలు కలుగచేశారు. చుట్టుపట్ల టీచర్లు, రూరల్ డిస్పెన్సరీ డాక్టర్లు, వెటర్నరీ డాక్టరు, ఇతర ఉద్యోగులు చాలామంది వచ్చారు. తప్పనిసరై మేరీ కూడా వెళ్ళి కొద్ది సేపుండి, తాను వచ్చినట్లు గుర్తింపు పొందిన తర్వాత వచ్చేసింది.

స్కూలు దగ్గర ఏర్పాటు చేసిన పతాకావిష్కరణకు పిల్లలు హాజరయ్యారు. చుట్టుపట్ల ఇళ్ళలో ఉన్న ఆడవారు ఆసక్తిగా చూడడానికి వచ్చారు. పెద్దవాళ్ళ సభలో ఊరేగింపులో పిల్లలకు ప్రాధాన్యత ఇవ్వలేదు. వారివైపు చూసి పలుకరించే నాథుడే లేడు. అందువల్ల తలొక జెండా పట్టుకొని పిల్లలు, వారి వెంట యువజనులు గ్రామంలో ఊరేగింపుకు బయలుదేరారు. ఈ రెండో ఊరేగింపు చూసిన అధికారులకు ఏమీ అర్థంకాలేదు. రంగు రంగుల కాగితాల జెండాలు పట్టుకొని ఎగురుతూ, ఆడుతూ ఊరంతా తిరిగి వచ్చారు వీరు.

మధ్యాహ్నం బహిరంగసభ. రమేష్ ధనుంజయ్‌కి, నాగిరెడ్డికి పరిచయం చేశాడు మేరీని.

"మిమ్మల్ని ఎక్కడో చూశాను" అందామె నాగిరెడ్డితో.

"కొన్నాళ్ళ క్రితం స్కూలు వద్దనే చూశారు" అన్నాడు నవ్వుతూ.

"ఇక్కడకాదు. ఎక్కడో చూశాను. జ్ఞాపకంలేదు. మీరు ఒంగోలుకు వస్తుంటారా" అంది మేరీ.

"వాడు చదివింది ఒంగోలు ఎ. వి. యం. హైస్కూలులోనే. కలెక్టరవుదామని ప్రయత్నించాడు. ఖర్మకాలి కాడి చేత పట్టాడు" అన్నాడు ధనుంజయ్.

"అవును; అక్కడే చూసి ఉంటాను. నేనూ అదే స్కూలులో చదివాను" అంది నవ్వుతూ.

"అయితే పాత స్నేహితులేనన్న




మాట. మరీ మంచిది. ముందు సభా కార్యక్రమాలు కానివ్వండి" అన్నాడు ధనుంజయ్.

పిల్లలందర్నీ టేబిల్ ముందు కూర్చోబెట్టారు. ఇద్దరు పిల్లలు వందేమాతరం పాడారు. వాళ్లలో ఎవరికీ ఉపన్యాసం చెప్పడం రాదు గనుక పిల్లలను పిలిచి తలోపాట పాడించారు. స్వతంత్రం ఎట్లా వచ్చిందో, గాంధీ ఎట్లా వచ్చాడో చెప్పబోయి, చేతగాక తడబడి నోరు మూసుకున్నాడు ధనుంజయ్. వచ్చిన పిల్లలకు తలొక బిస్కట్టు, చాక్లెట్టు ఇచ్చారు. కొందరు పిల్లలు మాకు చాక్లేట్లు రెండివ్వాల్సిందేనని, వసూలు చేసుకున్నారు. మేరీ వారివద్ద శలవు తీసుకుంది.

"మళ్ళీ కలుస్తాంలెండి" అన్నాడు చివర పలకరింపుగా నాగిరెడ్డి.




గ్రామంలో మళ్ళీ కలతలు ఆరంభమయ్యాయి. వీటన్నిటికి ప్రధాన కారకుడు ధనుంజయ్‌గా భావించాడు ప్రెసిడెంటు. ఎన్నికలనుండి దూరంగా ఉన్న రమేష్, నాగిరెడ్డి - ధనుంజయ్ వచ్చిన తర్వాతే తిరిగి కలుసుకున్నారు. వీళ్ళందరూ ఏకమైతే తిరిగి తనతో తగవుకు సిద్ధపడతారు. పంతులమ్మ విషయంలో తాను తొందరపడ్డాడు. అది వీరికి మంచి అవకాశమయింది. ఈ పాటికే అంతా బయటపడింది. రమేష్ ఏమీ చేయలేడనే ధీమా ఉంది గనుక నిర్లక్ష్యంగా ప్రవర్తించాడు గానీ నాగిరెడ్డి ముందుకు వచ్చిన తర్వాత ఆ ధీమా ఉండదు. నాగిరెడ్డికి ఒక వర్గం అంటూ ఉంది. కుర్రకారునంతా చేతిలో ఉంచుకున్నాడు. వారందరినీ అడ్డు పెట్టుకొని గతంలోనే తనతో పోటీకి దిగాడు. తర్వాత ఎన్నికలలో కలిసిరాక తప్పింది కాదు. అప్పటినుండీ ప్రశాంతంగా ఉన్నాడు. ఇప్పుడు మళ్ళీ ముందుకు వస్తున్నాడు.

రభస అంతా అణగిన నాలుగు రోజుల తర్వాత నాగిరెడ్డినీ, రామయ్యనూ పిలిపించాడు ప్రెసిడెంటు. వారితో ఏదో విధంగా సర్దుకొని పోవాలి. లేకుంటే తర్వాత దినదిన గండంగా ఉంటుందని ప్రెసిడెంటుకు తెలుసు. వారిద్దరు వచ్చేటప్పటికి గ్రామ పెద్దలు కూడా చాలా మంది ఉన్నారు. పంచాయతీ ఎన్నికల నుండి కరణం క్రిష్ణయ్య వీరికి వ్యతిరేకి అయ్యాడు గనుక ఆయనను వీరు పిలువడమూ లేదు, ఆయన రావడమూ లేదు.

"ఏంది రామయ్యా! మన వాళ్ళు సంఘమంటూ మళ్ళీ బయలుదేరారు?" అన్నాడు మునసబు.

"ఏదో వారిపాట్లు వారు పడుతున్నారు. ఈ రోజు పుట్టిందేం కాదుగా! ఐదేండ్ల నుండీ సంఘం ఊరిలో ఉంది. గ్రామానికి మంచి జరుగడమే కదా మనకు కావలసింది" అన్నాడు రామయ్య.

"మంచి చేస్తుంటే ఎవరు వద్దంటారు? వాళ్ళు మంచి చేయడం పేరుతో గ్రూపు కట్టి అందరిమీదా తిరుగబడడం తప్ప ఏదీ చేయడం లేదు. మొన్న అందరం కలిసి చేసిఉంటే ఎంతబావుండేది? బయట

నుంచి వచ్చేవారికి కూడా ఇక్కడ ముఠా లున్నాయని తెలిసేటట్లు చేసి గ్రామ పరువు పోగొట్టారు" అన్నాడు ప్రెసిడెంటు.

"ఇదంతా చేస్తున్నది పంతులుగార బ్బాయేనయ్యా! వాడు లేకుంటే ఊరు బాగుపడుతుంది. ముష్ఠమారి ముండా కొడుకు. మన జుట్లు మనమే పట్టుకు నేట్లు చేస్తున్నాడు..." అన్నాడు గిరి వయ్య ఈసడించుకుంటూ.

"ఒకడు ఎక్కువ, ఒకడు తక్కువ ఏం కాదులే! ధనుంజయ్ ఏం చేశాడో చెప్పరేం" అన్నాడు నరసయ్య.

"సరే! ఇవన్నీ తవ్వుకుంటే లాభ మేమిటి గానీ, ఇలాగే మనం జీవితాంతం పోట్లాడుకోవడమా! ఇక ముందైనా కల తలు లేకుండా మాసుకొని గ్రామ పురోభి వృద్ధికి పోరాడడమా? తేల్చండి" అన్నాడు మునసబు చుట్ట పీకుతూ.

"ఏం నాగిరెడ్డీ! తిరిగి నీవు నాయకు డవయ్యావు కదా! మరి చెప్పు. నిన్నటి రభసకు నీవే కారకుడివి. నీవు నోరు మూసుకొని ఉంటే ఎవడూ ముందుకు వచ్చేవాడు కాదు" అన్నాడు ప్రెసిడెంటు.

"నాకు కావలసింది గ్రామం బాగు పడడం. అందుకు ఎవరు సహకరించినా అందుకోవడం నా పద్ధతి. ఈ ఎన్నికలకు ముందు కూడా కొన్ని డిమాండ్లు పెట్టాం. ముఖ్యంగా గ్రామానికి రోడ్డు, గ్రామ పరి శుభ్రత. ఇరవై సంవత్సరాల నుండి పంచాయితీ మీ చేతుల్లో ఉన్నా, వీటి విషయంలో మీరు చేసిందేమీ లేదు. అప్పుడు ఎట్లా ఉందో ఈ రోజూ అట్లాగే ఉంది. గ్రామ కష్టల్లో తల దూర్చి ఏమీ చేయలేదు. అందువల్లనే యువకులందరం కలిసి గ్రామం కొరకు ప్రయత్నం చేశాం. ఇది మీకు గాని, మరొకరికి గాని వ్యతిరేకం గాదు. అభ్యు దయం అంటే గిట్టనివారికి మాత్రమే వ్యతిరేకం. మీరు కలిసి వస్తే అందరం చేద్దాం" అన్నాడు నాగిరెడ్డి.

"ఇప్పుడేం చేద్దామని మీ ఏడుపురా?" అన్నాడు మునసబు కోపంగా.

"ముందు తాడూరు నుంచి మన గ్రామానికి రోడ్డు ముఖ్యం. ఆ తర్వాత వీధుల్ని బాగుచేయడం."

"ఒరే నాయనా! రోడ్డు లేకున్నా నడిచి వచ్చే అధికారులకు తిండి పెట్టలేక చస్తున్నాం. రోడ్డువేసి దినమొక బస్సు ఊరిలోకి వస్తే, వారికి తిండిపెట్టలేక మేం అడుక్కొని వచ్చి వాళ్ళను మేపాలి" అన్నాడు మునసబు.

"ఈ చచ్చు కబుర్లు కట్టిపెట్టి సూటిగా మాట్లాడండి" అన్నాడు మరో పెద్దమనిషి.

"గ్రామానికి రోడ్డు వేయించాలని చాలా ప్రయత్నం చేశాము. కాని, సమితి వాళ్ళు గ్రాంట్లు ఇవ్వకుంటే ఏం చెయ్యాలి? బస్సు గ్రామంలోనికి వస్తే మంచిదే, నేనేం వద్దనడం లేదు" అన్నాడు ప్రెసిడెంటు.

"అన్ని గ్రామాలలో రోడ్డు, కరెంటు పడుతుంటే మన ఊరికి పడకపోవడ మేమిటి? సమితి వారిని గట్టిగా పట్టి రాబట్టాలి"

"సరే ఈ ప్రెసిడెంటు పదవి నీవే తీసుకొని ప్రయత్నించు. చూద్దాం. నా కాలంలో వేయలేకపోయాను. నీ కాలంలో నయినా వేస్తే చూసి సంతోషిస్తాను" అన్నాడు కోపంగా ప్రెసిడెంటు.

అట్లాఅయినా తగ్గివస్తాడేమోనని ఆశ! మునసబు శాంతింప చేసి కూర్చో




పెట్టాడు. నాగిరెడ్డి మాట్లాడలేదు. పరిష్కారం కుదరనూ లేదు. ఎవరంతకు వారే లేచి వెళ్ళారు. ఆలోచించుకోవల్సింగా రెండు వర్గాలనూ మనసులు హెచ్చరించాడు.

ఆ రోజు రాత్రి యువకులందరినీ సమావేశపరచి నాగిరెడ్డి వివరాలు చెప్పాడు.

"తాడూరు నుండి మన గ్రామానికి ఎలాగయినా సరే రోడ్డు వేయించాలి. ఇప్పటికే మనం చాలా వెనుకబడి ఉన్నాం. ఈ రోజు కూడా ప్రయాణం చేయాలంటే ఐదు మైళ్లు నడిచిపోవలసి ఉంది. మన గ్రామానికి సమితిలో ఉన్న విలువేమిటో తెలుసూనే ఉంది. ఈ ప్రెసిడెంటుతో మనకు పని లేదు. పోటీకూడా వద్దు. అవసరమైతే అన్నింటికీ సిద్ధంగా ఉండి అయినా సాధించాలి" అన్నాడు ధనుంజయ్.

"మేము ఎవరమూ పెద్దగా చదువుకున్న వాళ్ళం కాదురా! నీవా యం.ఏ. చదివిన వాడివి. ఆఫీసర్లతో బాగా మాట్లాడగలుగుతావు. అందువల్ల నీవే మాకు నాయకత్వం వహించి పనులు సక్రమంగా జరిగేటట్లు పోరాడు. నీవెనుక మేము అందరం ఉంటాము" అన్నాడు రమేష్. నాగిరెడ్డి కూడా ఆ మాట బలపరచాడు. ధనుంజయ్ నిరాకరించాడు. తాను నాయకత్వం తీసుకోవడమంటే తిరిగి గ్రామంలో రెడ్లందరూ ఏకం కావడం! ఆ విషయం అతడికి తెలుసు. తానే కాదు. రమేష్ నాయకత్వం వహించినా అంతే! వారిలోనే ఒకరు నాయకత్వం వహిస్తే, వారి మధ్య చీలిక వచ్చి పనులు సాగడానికి అవకాశముంటుంది. రెడ్లంతా ఏకమైతే మిగిలిన ఊరంతా ఏకమైనా వారిని కదిలించలేరు. ఆ గ్రామమూ బాగుపడదు, ఈ విషయం తెలిసే ధనుంజయ్ నిరాకరించాడు.

"మన ప్రెసిడెంటు ఏం చదివాడురా! సరిగ్గా ఐదో తరగతి చదువలేదు. పరిషత్‌కు వెళ్ళి కూడా మాట్లాడుతున్నాడు. అతనికంటే మన నాగిరెడ్డి చాలా నయం. స్కూల్ ఫైనల్ పాసయ్యాడు. మాట్లాడడం ఏముంది? కొంత కాలం అందరూ పరిచయమైతే, ఆ తర్వాత అన్నీ పనులు సానుకూలమవుతాయి. అందువల్ల మనకు నాయకుడు నాగిరెడ్డే"

అందరూ తలూపారు. రమేష్‌కు బాధగానే ఉంది. 'అటు-ఇటు నాయకులు వాళ్ళేనా?' అనుకుంటున్నాడు.

మాలపల్లెకు చెందిన యువకులు పల్లెలో బావి పూడిక తీయించాలన్నారు. బావి పూడిపోవడం వల్ల, ఫర్లాంగు దూరంలో ఉన్న గుండ్లకమ్మ నీరు తెచ్చుకోవలసి వస్తున్నది. ఆ నీరు పైనుండి నానా కలుషితంగా వస్తున్నది. ప్రెసిడెంటుకు ఎన్నిసార్లు చెప్పినా తీయించడానికి ఐదులు, అడిగిన వాడికి సారాయి తాపి నోరు మూయిస్తున్నాడు.

ఈ విధంగా తలొక సమస్య తెచ్చారు. సమస్యలు చాలా ఉన్నాయి. వాటిని పరిష్కరించడానికి ఇరవై ఏండ్ల నుండీ ఉన్న ప్రెసిడెంటు ముందుకు రావడం లేదు. ఈ రోజు ఏ అధికారమూ లేని సంఘం ఈ పనులన్నీ చేయాలంటే సాధ్యం కాదు. సంఘం వల్ల ఏదో సాధించాలని అందరికీ ఆశగానే ఉంది. చివరకు వీరిలో నిలబడేది ఎందరో!

ప్రధానంగా అద్దరోడ్డునుండి మోదేపల్లె వరకూ రోడ్డు అవసరం. అందుకయ్యే

ఖర్చులు అవసరమైతే రెండు గ్రామాల లోనూ చందాలు రాబట్టి, ప్రభుత్వాధి కారులచుట్టూ తిరిగి అయినా సాధించాలని నిశ్చయించుకున్నారు.

నాగిరెడ్డి ఇంటికి చేరేటప్పటికి పది గంటలయింది. అప్పటికి రామయ్యా, సుబ్బయ్యా మరి కొందరు మాటాడుతూ కూర్చున్నారు. నా గి రె డ్డి ని చూసి "ఎక్కడికి వెళ్ళావురా?" అన్నాడు రామయ్య.

"మీటింగు ఉంటే వెళ్లాను." అన్నాడు కూర్చుంటూ.

"అనవసరంగా నీవు ముందు నిల బడ్డం ఏమిట్రా? వీళ్ళందరూ నిన్ను యిరి కించిపక్కకు తప్పుకుంటారు. ఆ తర్వాత బాధపడవలసింది మనమే! ఈ ప్రగ ల్భాలు పలికేవాడెవ్వడూ రేపు నిలబడడు. ఎన్నికలలో రమేష్ చేసిన తెలివితక్కువ తనం వల్ల, మనకు రావలసిన ప్రెసిడెంటు పదవి పోగొట్టుకున్నాం. పోయిందిపోగా ఏ అధికారం లేకుండా ఇప్పుడేదో సాధిద్దా మంటేఎట్లా? అధికారం లేకుండా సాధిం చాలంటే చాలా కష్టాలు ప డ వ ల సి వస్తుంది" అన్నాడు రామయ్య.

"మనకెందుకురా ఇదంతా?కూడులేదా, గుడ్డలేదా?" అన్నాడు సుబ్బయ్య నిరాశా వాదంగా. తలొకమాటన్నారు. ఎవరికీ సమాధానం ఇవ్వలేదు నాగిరెడ్డి.వాడి పట్టు వాడిదే! ఉన్నంతవరకూ ఏదీ కలుగ చేసుకోకుండా ఉంటాడు. కలుగచేసు కుంటే ఊరకుండడని రామయ్య ఉద్దేశం.

ఆరోజు రాత్రే ఇంటికివెళ్తున్న రమేష్‌కు దానం బాగా తాగి ఎదురయ్యాడు. ఆ కైపులో కూడా గు ర్తిం చిన దా నం "నమస్కారం పంతులుగారూ! క్షేమమా? కుశలమా?" అంటూ రాగం తీయడం ఆరంభించాడు. రమేష్ మాట్లాడకుండా తప్పుకొని పోవాలని ప్రయత్నంచేశాడు. కాని, దానం పోనివ్వలేదు. "మీరు ప్రెసి డెంటు కావాలి పంతులుగారూ! అప్పుడు ఊరుముండ మొయ్యాలి.ఔను పంతులూ! నాకు నిషా ఎక్కుతున్నది. నీవుకూడా తాగుతావా? రా! పోదాం!" అంటూ చెయ్యి పట్టుకున్నాడు. రమేష్ చెయ్యి విదిల్చి గట్టిగా "రేయ్! మర్యాదగా వెళ్లు లేకుంటే తన్నులు తింటావు" అన్నాడు.

"తన్నులా? తింటాను, తింటాన్! ఇలాగే తిరిగితే నువ్వూ తింటావ్! అవును పంతులూ! నీ కథ పెద్దదయి నట్లుందే! ఒక పట్టు పడదామా?"

రమేష్ తల వంచుకొని వేగంగా వెళ్ళాడు. అప్పటికే జనం ఈ అరుపులకు లేచి చూస్తున్నారు. పోతున్న రమేష్‌ను చూసి, "పంతులూ! అబ్బో! పెద్ద మొగోడివయ్యా! నువ్వేం ఊరు బాగు చేసావ్‌గానీ, ముందు నిన్ను నీవు బాగు చేసుకో!లేదా నేనే బాగు చేస్తాను నిన్ను" అంటూ తూలుతూ పల్లెవైపు సాగాడు. రాత్రి పది గంటలు కావస్తున్నది. అప్పుడే పిల్లలకు పాఠం ముగించి, వారిని ఇళ్ళకు పంపుదామని లాంతరు పైకెత్తుతున్నది మేరీ.ఆసమయంలో తూలుకుంటూ దానం ఎదురువచ్చి నిలబడ్డాడు. ఆ విధంగా రావడం చాలాసార్లు చూసినా, అక్కడ నిలబడడం అదే మొదలు.

"ఏం పంతులమ్మా! బాగున్నావా?" అన్నాడు తూలుతూ.

పంతులమ్మ మాట్లాడలేదు. పిల్లలు నిలబడి దానంవైపు చూస్తున్నారు. అతడి నోటినుండి చొంగ కారుతోంది. సంధి ప్రలాపం ఎక్కువయింది.

"బాగున్నావా పంతులమ్మా నీవు




కూడా నాయకురాలివి అవుదామనుకున్నట్లుందే! అవున్లే! ఎందుకు కావు నువ్వు! పంతులు, ధనుంజయ, నాగిరెడ్డి....ఓ! అందరూ నీకు సావాసగాళ్ళే! అందరూ నీవాళ్ళే! మరిఎందుకుకావు నాయకురాలివి. ఓసబ్బో! ఓసబ్బో! ఇదేదో అబోతుల రాజ్యంలాగుందే" అంటూ అక్కడే కూలబడ్డాడు.

మేరీ గుండెలు బెదిరాయి. ఇంతకు ముందు క్రోధంతో చూస్తూ పోయేవాడు. కాని, ఈ విధంగా ఎప్పుడూ మాట్లాడ లేదు. పిల్లలు భయంతో ఇళ్ళకు పారి పోతున్నారు. నిద్రపోతున్న సుజాతమ్మ ఈ అరుపులకు లేచి నిలబడింది.

"ఇంటికి వెళ్ళి పడుకో దానమన్నా!" అంది మేరీ భయంగా.

"ఎందుకూ? ఇక్కడే పడుకుంటాను. హాయిగా వెచ్చగా ఉంటుంది" అంటూ బండలపై పడుకున్నాడు వాడు.

ఎదురింట్లోనున్న రాముడు లేచి వచ్చాడు. ఈ అరుపులు మామూలే అయినా, పంతులమ్మ ఇంటి ముందు జరుగుతూ ఉండడంతో అందరూ లేచి అక్కడికి వచ్చారు. రాముడు దానం చెయ్యి పట్టుకొని "దానం! ఇంటికి వెళ్దాం రా! ఇది పంతులమ్మగారి ఇల్లు" అన్నాడు.

"పంతులమ్మగారిల్లా! ఓస్! కాదురోయ్! నాయకురాలు నాగమ్మ ఇల్లు. మా ప్రెసిడెంటు మీద పోటీకి దిగుతోంది

రోయ్! తోలు వలిచేస్తాం, తోలు. మేమెవరమో తెలీదు దీనికి"

దేవమ్మ ముందుకువచ్చి "దొంగసచ్చినోడా! నోరుమూసుకో! ఎవరిని మాట్లాడుతున్నావో తెలీదేంరా! ఆమె నీకేం చేసింది? ఫో! ఇంటికి" అంది.

ఆమెను దూరంగా తోసేసి "నీవెవరవే నాకు చెప్పడానికి! ఈ పల్లెకు నాయకుణ్ని నేను. నన్ను ఏమన్నా చీల్చుతాను. రక్తం తాగుతానురోయ్! ఈరోజు పంతులమ్మ అంతు తేల్చాలి. తిక్క దించేతాను."

అసలే రౌడీ! పైగా ప్రెసిడెంటుగారి సమ్మినబంటు. వాడిని ఈ తూలుడుమీద ఎవరయినా కొట్టగలరు. కాని రేపు ప్రెసిడెంటుతో తగవు. పంతులమ్మను అతడు తిట్టడం వారికెవరికీ ఇష్టం లేదు. అతడిని అక్కడి నుండి తీసుకపోవటమూ సాధ్యం కాదు.

ఆ సమయంలోనే ఊర్లో మీటింగుకు వెళ్ళి వస్తున్న రత్నం, జయరావు ఇటు వచ్చారు. ఆ పాటికి దానం పూర్తిగా రేగిపోయి, ఇష్టం వచ్చినట్లు తిడుతున్నాడు. సుజాతమ్మ, మేరీ కళ్ళనీళ్ల పర్యంతమయ్యారు. జనం దానాన్ని చల్లార్చలేకపోతున్నారు. అలాగని పంతులమ్మను ఆ స్థితిలో విడిచిపోలేక నిలబడ్డారు.

రత్నం దగ్గరగా వచ్చి "మామయ్యా! ఇంటికి వెళ్దాం రా!" అన్నాడు.

"నేను రానురోయ్! ఇదే నా యిల్లు. ఇక్కడే పడుకుంటాను" అన్నాడు బండ గుద్దుతూ.

జయరావు ముందుకు వచ్చి దానం చెయ్యి పట్టుకొని లేపుతూ "ఏందిమామా! అంతా అల్లరి తప్ప ఇంకేం లేదా ఏమిటి? పొద్దుపోయింది. ఈ సమయంలో పంతులమ్మ ఇంటి ముందు అల్లరి చేయడం మంచిది కాదు. పోదాం రా!" అంటూ ముందుకు లాగాడు.

"పంతులమ్మ ఇంటి దగ్గరే బాగుంటుందిరా! ఇక్కడే ఉంటాను" అన్నాడు చెయ్యి విదలించి కూలబడుతూ.

"మర్యాదగా ఇంటికి పోతావా లేదా?" అన్నాడు రత్నం గట్టిగా. దానం సగం కళ్లు మూసి చూస్తూ "ఓసబ్బో! పెద్ద మొనగాడు బయల్దేరాడోయ్! నీవు సంఘం నాయకుడి వయ్యావు కదురోయ్! మీ పని పడతాంలే తొందర్లో! సంఘం! సంఘం. చంకలో సంఘం" అంటూ భూమి మీద తాళం వేయడం ఆరంభించాడు.

"మర్యాదగా చెపుతున్నా. ఇక్కడేం చేసినా ఊరకుండం! ఇంటికి వెళ్లు!"

"ఏం చేస్తార్రా పిల్ల కాకుల్లారా!" అన్నాడు వెక్కిరింపుగా.

"తంతాను" అన్నాడు పిడికిలి బిగించి జయరావు. అంతవరకూ తన జీవితంలో పల్లెలో ఎదిరించి నిలబడినవాడు లేని దానానికి అంత మత్తులోనూ మండిపోయింది. "ఒరేయ్ నా కొడకల్లారా! సంఘం నా కొడకల్లారా! చీలుస్తాను రోయ్ కత్తితో!" అని అరిచాడు.

రత్నం పిడికిలి బిగించి వీపు మీద రెండు గుద్దులు గుద్దాడు. "అమ్మా!" అంటూ భుజం పట్టుకున్నాడు దానం. మరో రెండు గుద్దులు గుద్ది ఈడ్చుకుంటూ ఇంటికి తీసుకెళ్ళారు.

"ఈడికేం రోగం పుట్టింది పంతులమ్మ ఇంటిమీది కెళ్ళాడు?" అంటూ మంచం వేసింది దానం భార్య. ఆ మంచం మీద అతడిని కూలేసి "నోరెత్తితే చంపే





సాను" అన్నాడు జయరావు. అప్పటికే నిషా ఎక్కువయింది. పైగా దెబ్బలు తిన డంతో నోరెత్తకుండా పడుకున్నాడు. ఇక ఉదయం వరకూ లేవడని నిర్ణ యించుకుని ఇద్దరూ తిరిగి వచ్చేసరికి, అంతవరకూ నోరెత్తలేని వారందరూ శాపనార్థాలు పెడుతున్నారు.

"ఒరేయ్! వాడిని గుండ్లకమ్మలో పడేయకూడదర్రా! పల్లెకు బాధ తగ్గేది" అంది ఒక ముసలమ్మ.

జనం పలుచబడ్డారు. రచ్చబండ మీద కొందరు పడుకున్నారు. ఈ సంఘటనతో బిత్తరపోయిన సుజాతమ్మ, మేరీ మంచాలు లోపల వేసుకొని ఉక్క పోస్తున్నా లోపలే పడుకున్నారు.

* * *

తెల్లారడంతోనే ఈ వార్త గుప్పున వ్యాపించింది. రమేష్ మీద దాడికి రావడం గురించి ఎవరూ పెద్దగా పట్టించుకోలేదు. కాని, పంతులమ్మ ఇంటి మీద దాడి చేసి, నీచంగా వాగాడన్న వార్త విని చాలా మంది బాధపడ్డారు. ధనుంజయ్ నిద్ర మంచం నుండి లేస్తూనే, తల్లి నోటిద్వారా విని ముఖం కూడా కడుక్కోకుండా సరాసరి ప్రెసిడెంటు ఇంటికి వెళ్ళాడు. ఆ సమయానికి ఆయన వసారాలోనే ఉన్నాడు.

"ఏమిటి బాబాయ్! రాత్రి దానం అల్లరి చేశాడట?" అంటూ తనకు తెలిసిన వివరాలు చెప్పాడు.

"నాకేమీ తెలియదురా! నీవు చెబు తుంటే వినడమే మరి! అయినా ఊరి కనే దానంగాడు అంత పని చేశాడంటే నేను నమ్మలేను. రమేష్, పంతులమ్మ వాడికేం చేశారు? అందులో ఏదో తిరకాసు ఉంది".

"ఏ కాసులూ లేకున్నా వాడు అందరి మీదా దాడి చేయడం ఇంతకు ముందే చూశాం కదా బాబాయ్! వాడి తాగు బోతుతనం అటువంటిది. పైగా నీ సహ కారం ఉంటుందని వాడి గర్వం!"

"అబ్బెబ్బె! అదేం లేదురా! వాడు చేసే తప్పులన్నీ నన్ను భరించమంటా వేమిటి? వాడెట్లా ఛస్తే నాకేం?"

అక్కడి నుండి రమేష్ వద్దకు వచ్చాడు. కృష్ణప్ప పంతులు దస్తావేజులు రాసుకుంటూ కూర్చున్నాడు.

"ఏం ధనుంజయ్! పొద్దున్నే వచ్చా వేమిటి?" అన్నాడు.

"రమేష్ కొరకు వచ్చానండీ"! అన్నాడు కూర్చుంటూ.

"బావికి నీళ్ళకు పోయినట్లుంది. వస్తాడులే!" అంటూ తన రాతలో మునిగాడు.

కావడి భుజం మీద వేసుకొని రమేష్ వచ్చాడు. "పొద్దున్నే బయలుదేరా వేంరా?" అన్నాడు ధనుంజయ్‌ని చూసి.

"నీకొరకే వచ్చాను".

"ఉండు! కావడి దించి వస్తాను" అంటూ ఇంట్లోకి వెళ్ళాడు.

ఇద్దరూ కలిసి బజారుకు వచ్చారు.

"రాత్రి ఏం జరిగిందో నీ నోటి నుండి విందామని వచ్చారా?" అన్నాడు ధనుంజయ్. రమేష్ వివరాలు చెప్పాడు.

"దానంగాడు అంత బరి తెగించి నాతో ఇంతవరకూ ప్రవర్తించలేదు. ఈ రోజు ప్రదర్శిస్తున్నాడంటే ఏదో కారణం లేకుండా ఉండదు" అన్నాడు రమేష్ ఆలోచిస్తూ.

"ఒరేయ్! నిజం చెప్పు! పంతు లమ్మతో నీ సంబంధమేమిటి?"

రమేష్ నోరు తెరిచాడు. "పంతు

లమ్మతో నా సంబంధమేమిట్రా? ఆమె దృష్టిలో నేనొక పనికిరానివాడిని. మర్యాదకు పలుకరిస్తుందే కానీ, ఇంత వరకూ నేను తీసుకున్న చర్యలన్నీ ఆమెకు నా మీద వ్యతిరేకతనే కలుగ జేశాయి. పైగా ఆమె నిప్పులాంటిది" అన్నాడు.

"ప్రెసిడెంటు మీ ఇద్దరి మధ్యా సంబంధం ఊహించి, తనకు అడ్డు వస్తున్నందుకు నీ మీదా, తనను ఎదిరించిన ఆమెమీద దాడి చేయించి ఉండ వచ్చనుకుంటాను".

"పంతులమ్మ మీద ఎప్పుడు దాడి జరిగింది ?"

"నీతో పోట్లాట అయి, పల్లెకు వెళ్ళి ఆమె ఇంటి ముందు నానా హంగామాచేసి, పంతులమ్మను నోటికి వచ్చినట్లు తిట్టి చీలుస్తాను, నరుకుతాను అంటూ ప్రగల్భాలు పలికాడట. ఆ సమయానికే రత్నం,జయరావు ఇక్కడనుండి వెళ్లారు. తన్ని వాడిఇంట్లో పడేసి వచ్చారట".

"నన్ను రూపుమాపాలని ప్రెసిడెంటు కుతంత్రాలు పన్నుతున్నాడు" అన్నాడు రమేష్.

నిజానికి ప్రెసిడెంటుకు తెలియకుండా దానం ఏ పనీ చేయడు. ఇంత బహిరంగంగా గౌరవవ్యక్తులమీద దాడిచేయడానికి వెనుక ప్రోద్బలం లేకుండా ప్రయత్నించడు.

"సరే! ఇంకా నేను ముఖమే కడుగ లేదు. తర్వాత కలిసి మాట్లాడుదాం" అన్నాడు ధనుంజయ్.

రమేష్ కూడా వెళ్ళబోతూ "నాగిరెడ్డిని కలిశావా?" అన్నాడు.

"ఇంకా లేదు. మనకంటే ముందే వాడికి తెలిసి ఉండవచ్చు. మనం చెప్పాల్సిన పని ఉండదు" అంటూ వెళ్ళిపోయాడు.

రమేష్ అక్కడినుండి పల్లెకు బయల్దేరాడు. వెళ్ళడం మంచిదా, కాదా అని ఆలోచిస్తూనే వెళ్ళాడు. పైగా తిరిగి దానం ఎదురయితే ఏం గొడవ జరుగుతుందోనని సంశయం. ఎవరూ ఎదురు కాలేదు. రమేష్ వెళ్ళేటప్పటికి మేరీ కాఫీ తాగుతూ పుస్తకాలు సర్దుకుంటున్నది.

రమేష్‌ను చూసి "రండి" అంది తల ఊపి. కాఫీ తెచ్చి ఇచ్చింది. తాగుతూ వివరాలడిగాడు.

చెప్పింది మేరీ. అతడు తిట్టిన తిట్లను చెప్పడానికి సిగ్గు పడింది. ఈ విధంగా అయితే నేను ఎన్ని రోజులు ఇక్కడ ఉండగలను? రాత్రి అందరూ ఉన్నారు గనుక, ఏదో విధంగా సరిదిద్దగలిగాను. ఏ అర్ధరాత్రో వచ్చి ఇంటిమీద పడితే ఏం చేయాలి?ఇంట్లో ఇద్దరం ఆడవారమే. నాకు భయంగా వుంది. బదిలీ చేయించుకుందా మనుకున్నా ఆ అవకాశం ఇవ్వరు. ఈ విధంగా హింసించడమే వారికి ఆనందం" అంది విచారంగా.

రమేష్ జవాబు చెప్పలేదు. ఏదో గొడవ జరిగిందని ఆతృతతో అక్కడికి వచ్చాడు. పరిష్కారం చేయగల స్థాయి అతడికిలేదు. లేదని ఆమెకూ తెలుసు. రానురానూ అతడి దిగజారుడు విధానం తెలుస్తున్నది. రిపోర్టులకీ పరిమితం తప్ప ఆచరణ లేదు. ఈ విషయంలోనూ ఎవరికో ఒకరికి రిపోర్టు రాయగలడు గాని దాని ప్రభావం పూజ్యం. బలం ప్రదర్శించిన వారికే పనులు కావడంలేదు.

"స్కూలుకు సమయమయింది; వెళ్తాను" అంటూ లేచింది. రమేష్ కూడా లేచి ఆమెతోపాటు సాగాడు. పల్లెలో




వారిద్దరినీ ఎప్పటిలాగే చూస్తున్నా ముందున్నంత అనుమానాలు పల్లెలో పంతులమ్మమీద లేవు. గౌరవం పెరిగే కొద్దీ ఆమెమీదున్న అనుమానం తగ్గిపోతూ ఉంది. అయినా ఏ పుట్టలో ఏ పాముందోనన్న అనుమానం కొందరికి.

రమేష్ ఇంటికి, పంతులమ్మ స్కూలుకు వెళ్ళారు. ఇంటికి వెళ్తూ మధ్యన నాగిరెడ్డి ఇంటిముందు ఆగాడు రమేష్. ఆ సమయానికి నాగిరెడ్డి అరక కడుతున్నాడు. రమేష్ని చూసి నొసలు ముడిచాడు ప్రశ్నార్థకంగా.

దానం దాడి వివరాలు చెప్పాడు. "ఆ విషయం నాకుకూడా తెలిసింది" అన్నాడు నాగిరెడ్డి–అందువల్ల కూలిపోయినకొంపలు ఏమీ లేవన్నట్లుగా.

"దీన్ని గురించి ఏదో ఒకటి ఆలోచించాలి" అన్నాడు రమేష్.

"నేను పొలం వెళుతున్నాను. ఈరోజ పాలేరు కూడా రాలేదు. మధ్యాహ్నం ఆలోచిద్దాం" అంటూ కాడి ఎద్దుల మెడ మీద వేసి పద్దెడ తగిలించాడు. రమేష్ వెళ్ళిపోయాడు. నాగిరెడ్డి పద్ధతి చూస్తే అతడు కలుగచేసుకుంటాడన్న నమ్మకం లేదు. నాగిరెడ్డి కలుగచేసుకోకుంటే ధనుంజయ్ ముందుకు రాలేదు. తను ఏమీ చేయలేదు.

మేరీ పది గంటలకు స్కూలు విడిచి ఇంటికి వెళ్తుంటే మనిషి వచ్చి ప్రెసిడెంటు పిలుస్తున్నాడని చెప్పాడు. అప్పటికే స్కూలు ఆవరణ దాటింది. వచ్చినతని వెపు ఎగా దిగా చూసి "మధ్యాహ్నం వస్తానని చెప్పు" అంది. ఇంటికి వచ్చి బడలికగా మంచం మీద పడుకుంది. ఈ సమస్యలు తనలాంటివారికి తప్పవు. అటువంటప్పుడు మెత్తగా ప్రవర్తించడం కంటే కొంత కటువుగానే ప్రవర్తించడం అవసరం. ప్రతిసారి ప్రెసిడెంటు ఏదో ఒక వంక పెట్టి పిలుస్తున్నాడు. ఏదో విధంగా తన ఆధిక్యత చూపించి లొంగ తీసుకోవాలని అతడి ఉద్దేశం. నోరు మూసుకొని ప్రవర్తించడం తన మెతకదనానికి నిదర్శనమవుతున్నది. అలాగాక ఎదిరిస్తే? ఏమవుతుందన్నది సమస్య! మరో ఊరికి బదిలీ చేయించే విధంగా ఒత్తిడి తీసుకొస్తాడు అధికారుల మీద! బాధలేదు. అలాగాకుండా రాత్రిలాగా దౌర్జన్యానికి దిగితే ఘోరంగా ఉంటుంది. ఎదిరించే శక్తి తనకులేదు; రక్షణ లేదు. ఈ జనం ఎన్నాళ్ళు రక్షణ ఇస్తారు? అతడిని చూస్తూనే బెదరిపోతున్న వ్యక్తులు. మధ్యాహ్నం వెళ్ళి అతడేం మాట్లాడుతాడో విని, దృఢంగా వ్యవహరించాలనుకుంది.

పన్నెండు గంటలకు స్కూలుకు వెళ్తూ ప్రెసిడెంటు ఇంటి వద్దకు వెళ్ళింది. ప్రెసిడెంటు ఒంగోలు వెళ్ళాడని అక్కడి వారు చెప్పటంతో స్కూలుకు వెళ్ళింది. ఆడవారికి ఎంబ్రాయిడరీ అల్లిక నేర్పుతూ ఉండగా ధనుంజయ్ వచ్చాడు. రాత్రి జరిగిన సంఘటనల గురించి అడిగితే మళ్ళీ చెప్పింది.

"ఆ విషయం పెద్దగా పట్టించుకొని బాధపడకండి. మరొకసారి ఆ విధంగా జరిగితే ధృఢంగా వ్యవహరిస్తేసరి" అన్నాడు సలహా ధోరణిలో.

"అంటే మీరు మరోసారి కూడా ఇటువంటి సంఘటన జరగాలని కోరుతున్నారేమిటి?" సూటిగా చూస్తూ అడిగింది. ధనుంజయ్ తబ్బిబ్బు పడ్డాడు. అతడి ఉద్దేశం అదికాదు. మాట్లాడడంలో పొరపాటు దొర్లింది. పైగా ఎదిరించమని

చెప్పే ధైర్యమూలేదు.

"అక్కడి నుండి గ్రామంలోనికి మారండి"

"ఇళ్ళు ఇచ్చేవారు కావాలండీ! గ్రామంలో మాలవ్యక్తికి ఇళ్ళు ఇచ్చేవారెవరు? పోనీ మీకు వీలుంటే చూడండి"

జవాబు చెప్పలేదు ధనుంజయ్. మాట అనడం తప్ప దాన్ని ఆచరించలేకుంటే అసహ్యం వేస్తుంది. రమేష్ ఆమె ముందు విలువ పోగొట్టుకోవడానికి కారణం అదే! అదే తిరిగి ధనుంజయ్ చేస్తున్నాడు. కొంతసేపు అక్కడే ఉండి "సరే! వస్తానండీ! ఎందుకయినా మంచిది. మీ జాగ్రత్తలో మీరుండండి. నేను ఒంగోలు వెళ్తున్నాను. తాడూరు– మోదేపల్లె అడ్డరోడ్డు గురించి విచారించాలి" అంటూ లేచాడు.

"మీ సంఘ ప్రెసిడెంటుగారు దాన్ని గురించి ఆలోచించడా ఏమిటి?"

"అతడికి సవాలక్ష పనులు! అరకదున్నడానికి ఉదయం వెళ్ళాడు. మధ్యాహ్నానికి వస్తానన్నాడు. ఇద్దరం కలిసి వెళ్దామన్నాడు. వాడికొరకు కాచుకొని ఉంటే చివరి బస్సుకూడా అందదు" అంటూ బయటకు సాగాడు.

మేరీ బయటకు వచ్చి "పోనీ! రాత్రి జరిగిన సంఘటన గురించి పోలీసు రిపోర్టు ఇవ్వమంటారా?" అంది.

"అతడు నవ్వాడు"

"పోలీసు స్టేషన్‌కు వెళ్ళాలంటే మరో ఐదు మైళ్ళు నడిచి వెళ్ళాలి. అక్కడయినా మన మాట వినేదెవడు? ప్రెసిడెంటు అధికారాన్ని బట్టి వాళ్ళు నడుస్తారు. పోలీసులు వారికే అనుకూలం! ఈరోజు ఎలాగోలా గడపండి. వచ్చిన తర్వాత అందరితో మాట్లాడదాం! నాగిరెడ్డి కలుగచేసుకుంటే తర్వాత తర్వాత భయపడవలసినపని ఉండదు" అంటూ వెళ్ళిపోయాడు.

సాయంత్రం ఐదుగంటలకే స్కూలు విడిచి, ఆటల విషయం పట్టించుకోకుండా పిల్లలను ఇళ్ళకు పంపి పెందలకడనే ఇల్లు చేరింది. ప్రశాంతంగా కొంతసేపు గుండకమ్మ ఒడ్డుకు వెళ్దామనుకుంది; కాని మనస్సు ఆందోళనగా ఉండంతో ఇంటి వద్దనే ఉండిపోయింది. దానం అటు వెళ్తూ తల తిప్పి చూసివెళ్ళాడు. మేరీ అతడి చూపులు చూసి తల పక్కకు తిప్పుకుంది. వెనుక ఎలాంటి సహాయం లేని బతుకు ఏం బతుకు? తనకూ తోడూ, రక్షణా కావాలి! తాను పంతులమ్మగానే కాక, తోడులేని విధవగా కూడా వారికి కనిపిస్తోంది. అందువల్లనే వారికి ఆహారంగా కన్పిస్తున్నది. తనకూ మొగతోడుంటే వీళ్ళు ఇంత ఘోరంగా ఊహించలేరు, కోరనూలేరు.

ఆలోచిస్తూ పడుకుంది. ఎప్పుడు నిద్రపట్టిందో తల్లి వచ్చి లేపితే కళ్ళు తెరచింది. "ఇదేమిటే! ఎటూకాకుండా సందెవేళ నిద్రపోవడం?" అంటూ చెయ్యి పట్టి చూసింది. వెచ్చగాఉంది. "జ్వరం వచ్చినట్లుంది" అంది ఆత్రంగా.

విసుక్కుంటూ లేచి "అదేపోతుంది లేవే" అంది. కళ్ళుమండుతున్నాయి. గతరాత్రి ఆలోచనలతో, భయంతోనూ, నిద్రలేదు.

కూతురు విసుగుచూసి సుజాతమ్మ బాధపడుతున్నది. ఆ వయస్సులో కూతురికి జరుగవలసిన సుఖం అందకపోవడం ఆమెకు బాధగానే ఉంది. కాని ఏం చేయగలదు. వయస్సు చిన్నదయినా ధైర్యంతో ముందుకు వచ్చి రెండో పెళ్ళికి అంగీకరించే పురుషులు కావాలి

గదా! పైగా కులం సమస్య! వెనుక ఎర్ర ఏగాని లేనిస్థితి. ఆస్తులుంటే, వాటి కొరకయినా ముందుకు వచ్చేవారు ఉంటారు. పైగా పంతులమ్మ అన్నా, నర్సు అన్నా ప్రజల దృష్టిలో లోకువ! మరి ఈ జీవితం ఇలా అయిపోవలసిందేనా అనుకుంది. ఎక్కడ ఏ జంట కన్పించినా మేరీ గురించి బాధపడడం ఆమె అలవాటు.

"ఏదో ఒక బిళ్ళవేసుకొని, అన్నం తిని పడుకో!" అంది నుదురు రుద్దుతూ. మేరీ లేచి బిళ్ల వేసుకుని నీళ్ళు తాగి "నాకు అన్నం వద్దుగాని, పాలు దొరుకుతాయేమో అడిగిరామ్మా!" అంది.

ఏసు వచ్చాడు. బయట పంచలో కూర్చుని బీడీ తాగుతున్నాడు. ఇంట్లో నుండి ఎవరూ కదలకపోవడంతో "సుజాతమ్మా!" అని పిలిచాడు.

"లేదు తాతా! పాలకు వెళ్ళింది. నాకు తల నొప్పిగా ఉంది. పడుకున్నాను. లోనికిరా!" అంది మేరీ.

ఏసు లోనికి వచ్చాడు. "నొప్పి బాగా ఉందామ్మా?" అన్నాడు.

"పెద్దగా లేదులే తాతా! తగ్గిపోతుంది గానీ కూర్చో!"

అరుగుమీద కూర్చున్నాడు ఏసు. "రాత్రి జరిగినదాన్ని గురించి తెగ ఆలోచిస్తూండి ఉంటావు. అందుకే తలనొప్పి. ఏదో జరిగిపోయింది.వాడితో తగవెందుకు? మనం నోరుమూసుకుంటే, వాడే వెళ్ళిపోతాడు" అన్నాడు ఓదార్పుగా.

అంతకంటే అతడూ ఏమీ చెప్పలేడు. దానాన్ని ఎదిరించడం వీళ్ళకి చేతకాదు. వారానికి రెండుసార్లయినా పల్లెలో తగవు పెట్టుకొని నీచాతినీచంగా తిడుతుంటాడు దానం. అయినా ఎవరూ నోరు మెదపరు. అది క్రమంగా అలవాటు కింద మారింది. నిన్న అయినా పంతులమ్మను గురించి కాబట్టి అందరూ కూడారు. చివరకు చెయ్యి చేసుకోవలసిన స్థితి ఏర్పడింది. మరొకరి విషయమయితే అంతగా పట్టించుకునేవారు కాదు. వాడిని పల్లెకు రౌడీగా తయారుచేసి వదిలాడు అప్పారెడ్డి. అతడి దెబ్బకు భయపడి పల్లె మొత్తం తనవైపు ఉంటుందని ప్రెసిడెంటు ఉద్దేశం. కానీ, తేరుకొని తిరుగబడితే దానం ఏమీ చేయలేడని నిరూపించారు నిన్న.

మేరీ పాలు తాగి తిరిగి పడుకున్నది. పిల్లలు వచ్చారు. చదువుకుంటూ కూర్చోమని చెప్పింది. ఏసు వెళ్ళిపోయాడు.




పది గంటలకు పైగా అయింది. అందరూ భోజనాలు ముగించి పడుకోడానికి ఉపక్రమిస్తున్నారు. రచ్చబండమీద కూర్చొని కొందరు లోకాభిరామాయణం మాట్లాడుకుంటున్నారు. యువకులు భలో కత్తులు విసురుకుంటూ కూర్చున్నారు. ఆలస్యంగా లేచి చివరి పాఠం చెబుతున్నది మేరీ. పిల్లలు వింటున్నారు.

ఆ సమయంలో తప్పతాగిన దానం కర్ర చేత పట్టుకొని కేకలు వేస్తూ వచ్చాడు. సరాసరి మేరీ ముందు నిలబడి "ఏందే పదవుతున్నావ్?" అన్నాడు వెకిలిగా నవ్వుతూ.

మేరీ గుండె దడదడలాడింది. భయంతో కాళ్లు, చేతులు వణకుతున్నాయి. నిన్న, ఈ రోజు ఒకే సంఘటన. జనం అందరూ మంచాల మీద నుండి లేచి వచ్చారు.

రచ్చబండ మీద కూర్చున్న జయరావు రత్నంతో "నీవు వెళ్ళి రమేష్ గానీ, నాగిరెడ్డి గానీ ఉంటే తీసుకరా! వీడితో మనం తలపడలేం!" అన్నాడు. రత్నం గ్రామంలోనికి పరుగులంకించుకున్నాడు.

"వెళ్ళిపో దానమన్నా! నీకు నమస్కారం చేస్తాను. నాతో నీకేమిటి తగవు?" అంది అణకువగా.

గలగల నవ్వాడు దానం. "నీ అంతు తేల్చుకోవాల్నే ఈ రోజు. అందుకే మళ్లీ వచ్చాను. రాత్రి నన్ను కొట్టిన నా కొడుకుల కథ కూడా తేల్చుకోవాలి. ఈ రోజు పల్లె సంగతి అటో ఇటో తేలాలి" అన్నాడు కర్ర భూమిమీద వేసికొడుతూ.

భయంతో కొందరు, ఏమీ చేయలేని నిరాశతో కొందరు నోరు మెదపడం లేదు. మేరీ శరీరం చెమట్లు పడుతున్నది. ఆ సమయంలో తనను ఏం చేసినా అడిగే దిక్కులేదని స్పష్టం. తన మీద అభిమానమున్నా వారు సహకరించలేక పోతున్నారు. జయరావు రచ్చబండ మీద కూర్చున్నాడు. ముందుకు వస్తే దానం చేత దెబ్బలు తినాల్సి వస్తుంది. రత్నం ధనుంజయ్ ఇంటికి వెళ్ళాడు. అతడులేడు. అక్కడి నుండి రమేష్ ఇంటి వద్దకు వచ్చాడు. రమేష్ ఉన్నాడు. కాని, "పోదాంపద" అన్న మాకుడుగాలేదు. అతన్ని కూర్చోబెట్టి ఏదో సమాధానం చెప్పాలని ప్రయత్నిస్తున్నాడు.

"ఇక్కడ మనం ఆలస్యం చేస్తే, అక్కడ ఏమైనా చేయవచ్చు" అన్నాడు రత్నం ఆతృతగా.

"సరే! నాగిరెడ్డి వద్దకు వెళ్దాం పద. పొద్దున ఈ విషయం చెబితే అతడు పట్టించుకున్నట్లు కన్పించలేదు" అంటూ దారి తీశాడు రమేష్.

సుబ్బయ్య బయట మంచం వేసుకొని పడుకున్నాడు. కుక్క మొరగడంతో తల పైకెత్తి "ఎవరది?" అన్నాడు.

"నేను రమేష్‌నండీ!" అంటూ ముందుకు వచ్చాడు. "నాగిరెడ్డి కొరకు వచ్చాను" అన్నాడు మంచం వద్దకు వచ్చి. అప్పుడే గొడ్లకు మేతవేయడానికి గడ్డి చేతపట్టుకొని వస్తున్నాడు.

అతన్ని బయటకు పిలిచి వివరాలు చెప్పి "ఏం చేద్దాం ఇప్పుడు?" అన్నాడు రమేష్. "వాడు నిన్నటి దెబ్బలకు పగ తీర్చుకోవడానికి సిద్ధంగా ఉన్నాడు. మేము దొరికితే బాదేస్తాడు" అన్నాడు రత్నం.

"సరే! వెళ్దాం పదండి. అక్కడికి వెళ్ళిన తరువాత ఏం చేయాలో ఆలోచిద్దాం" అన్నాడు నాగిరెడ్డి. ముగ్గురూ పల్లెలో అడుగు పెట్టేసరికి దానం కేకలేస్తూ, అరుస్తూ ఇంటి ముందు గంతులేస్తున్నాడు. పిల్లలు భయంతో ఇళ్ళకు పారిపోయారు. ఆడ, మగ నిలువు గుడ్లతో చూడటం తప్పితే ఏమీ చేయలేకున్నారు. ఏసు కాళ్ళా వేళ్ళా పడుతున్నాడు వెళ్ళిపొమ్మని. సుజాతమ్మ, మేరీ గోడకు ఆనుకుని భయంతో కళ్ళనీరు కారుస్తూ నిలబడ్డారు. దానంకు నిషా పూర్తిగా లేదు. వారిమీద కక్ష తీర్చుకోవాలని వచ్చాడు. నిన్నటిలాగే ఎక్కువ తాగివస్తే తననే తంతారని మోతాదు మించకుండా తాగి




వచ్చాడు. కర్ర ఊపుతూ, బూతులు తిడుతూ హూంకరిస్తున్నాడు.

"దానం" అన్నాడు నాగిరెడ్డి గట్టిగా. ఆ పరిస్థితిలో నాగిరెడ్డి రావడంతో పల్లె వారు కొంత ఊపిరి పీల్చుకోగల స్థితికి వచ్చారు. మేరీ నాగిరెడ్డిని చూసింది. కాని అతడు ఎంతవరకు ఈ విషయంలో మాట్లాడుతాడో, నిలబడగలడో ఆమెకు తెలియదు.

"ఎవ్డ్రా వాడు?" అంటూ దానం కళ్ళు పైకెత్తి చూశాడు. ఎదురుగా నాగిరెడ్డి. కళ్ళు మూసి విదలించి, తలతాటించి "ఏందయ్యా ? ఇక్కడికి కొచ్చారు?" అన్నాడు మర్యాదగా.

"నీ ఘనకార్యం చూద్దామని వచ్చాను. ఏమిటిది?" అన్నాడు కటువుగా.

"ఘనకార్యం ఏందయ్యా! వీళ్ళంతా నిన్న మత్తులో ఉంటే నన్ను తన్నించారు. ఇదిగో ఈ ముండ కొట్టించింది. కొట్టిన నా కొడుకులు పారిపోయారు. ఈ ముండల సంగతి తేలుద్దామంటే, ఈ ముసల్నాకొడుకు అడ్డుపడుతున్నాడు"

"దానం" గట్టిగా అరిచాడు నాగిరెడ్డి. "ఫో! ఇంటి కెళ్ళిపో! ఉదయం ఏవైనా విషయాలుంటే మాట్లాడుదాం. ఇప్పుడెందుకు గొడవ? పొద్దుపోయింది".

"మీకు తెల్దులేవయ్యా! మీరు వెళ్ళండి. ఉదయం కాదు; ఇప్పుడే తేలాలి. తేలేదాకా నేను కదిలేది లేదు" అన్నాడు బండమీద కూచ్చుంటూ.

"చూడు దానం! ప్రెసిడెంటు ఊరిలో లేడు. ఆయన వచ్చిన తరువాత మాట్లాడి ఎవరిది తప్పో తెల్చుకుందాం. ఈ సమయంలో ఆడవాళ్ళను బెదిరిస్తూ, తిట్టడం మంచిది కాదు" అన్నాడు అనునయ ధోరణిలో.

"తేలేవరకూ నేను పోను" అన్నాడు ఖచ్చితంగా దానం.

నాగిరెడ్డి ఎంత చెప్పినా వినేస్థితిలో లేడు దానం ! బతిమాలేకొద్దీ దానం మరింత గట్టిగా మాట్లాడుతున్నాడు. మొదట మర్యాదగా ప్రవర్తించినా రాను రానూ నాగిరెడ్డిని లెక్కచేయని స్థితికి చేరుకున్నాడు. రమేష్ గానీ, మరెవరూ జోక్యం చేసుకోలేదు. నాగిరెడ్డికి చెప్పి చెప్పి సహనం చచ్చింది. చివరకు గట్టిగా "మర్యాదగా ఇంటికి వెళ్ళు. ఇంకా ఉంటే మర్యాద దక్కదు" అన్నాడు.

"ఏం చేస్తావ్?" అంటూ తల ఎగుర వేశాడు నిర్లక్ష్యంగా.

ఫెడీమని చెంపమీద కొట్టాడు నాగిరెడ్డి. అసలే కైపులో ఉన్న మనిషి – ఆ దెబ్బకు కొంత తూలాడు. చేతిలోని కర్రలాగి వీపుమీద బాదాడు నాగిరెడ్డి. "అమ్మా!" అని అరుస్తూ నేలన బడ్డాడు దానం.

"ఒరేయ్ రత్నం! తాళ్ళు తీసుకొని వచ్చి కట్టేయండి. వీడి సంగతి ఉదయం తేలుద్దాం" అన్నాడు నాగిరెడ్డి. రత్నం పరిగెత్తి తాడు పట్టుకొని వచ్చాడు.

"నమస్కారం రెడ్డీ! నేను మీ జోలికి రాలేదు. మీరూ నా జోలికి రావద్దు" అన్నాడు దానం చేతులు జోడించి.

ఆ చేతులమీద కాలితో తన్నాడు నాగిరెడ్డి. "ఇంతవరకూ మర్యాదగా చెబితే వినని వాడివి ఇప్పుడెక్కడిదిరా మర్యాద? నా మనుషుల జోలికి వస్తే, నా మీదకు వచ్చినట్లే. మీ ప్రెసిడెంటు రానీ నీ కథ వుదయం తేలుస్తాను" అన్నాడు. జయరావు, రత్నం ముందుకొచ్చి కాళ్ళు, చేతులు కట్టేశారు. వారివైపు ఉరిమిచూస్తు

న్నాడు దానం. పక్కనే వున్న చెట్టు వరకూ ఈడ్చుకెళ్ళి చెట్టుకు కట్టేశారు.

"ఒరేయ్ దానం! ఇక నీకు సాయం వచ్చేవాడెవడో చూస్తాను. ఎల్లకాలం పల్లెకు నీవే మొనగాడివి గావురా! ఇక నుంచీ నిన్ను పల్లెలో చితక తన్నిస్తాను" అంటూ జుట్టు పట్టుకొని చెంపలు వాయించాడు. ఈ వాతావరణంలో జనం చాలా మంది సర్దుకున్నారు. అక్కడే వుండి దానం కంటపడితే, రేపు అందరూ కలిసి తన్నించారని, వాళ్ళమీద కూడా దాడి చేస్తాడు.

"రమేష్! నీవు ఇంటికి వెళ్లు! ఇక్కడెందుకు?" అన్నాడు నాగిరెడ్డి. ఆ పరిస్థితిలో ఒంటరిగా ఊరిలోకి వెళితే ఈ వివరాలు తెలిసిన ప్రెసిడెంటు మనుషులు తన్నినా తన్నగలరని ఊహించుకున్నాడు రమేష్.

"ఈ రాత్రికి ఇక్కడే వుండి ఉదయం ఇదేదో తేల్చుకుని వెళ్దాం" అన్నాడు.

నాగిరెడ్డి తలూపాడు.

దానం భార్య రెండుసార్లు అటువచ్చి వెళ్ళింది. వాళ్ళను బతిమిలాడినా విడువరు. ప్రెసిడెంటు ఊరిలోలేడు. ఆయన లేకుండా ఆయన మనుషులు కలుగచేసుకోరు. అందువల్ల ఏమీ అనకుండా వెళ్ళిపోయింది. అంతవరకూ నిశ్చేష్టులై నిలబడిన తల్లీ కూతుళ్ల తెప్పరిల్లుకొన్నారు. ఇంటిలోనున్న మంచం ఒకటి బయట



వేసింది మేరీ. అంతవరకూ నిల్చున్న రమేష్, నాగిరెడ్డి మంచం మీద కూర్చు న్నారు. సుజాతమ్మ నాగిరెడ్డి వద్దకు వచ్చి "ఇదేమిటి నాయినా ? మేము ఈ ఊరిలో ఉండాలా, పోవాలా? పొమ్మంటే పోతాం గానీ, ఇంత దౌర్జన్యం ఎందుకు?" అంది బాధగా.

ఎవరూ జవాబివ్వలేదు.

కొంతసేపున్న తరువాత "మీరు పడుకోండి. తెల్లారిన తర్వాత అన్నీ



సంగతులూ బయటపడతాయి" అన్నాడు నాగిరెడ్డి. మేరీ, సుజాతమ్మ ఇంటిలోకి వచ్చారు. "ఆ మంచం కూడా బయట వెయ్యవే! దుప్పట్లుతీసు కెళ్లుపడుకుంటాచు" అంది మేరీ. సుజాతమ్మ మంచం బయట వేసి, దుప్పట్లు పరచింది. "మంచినీళ్ళు కావాలా బాబూ ?" అంది.

"ఇవ్వండి" అన్నాడు రమేష్. రత్నం, జయరావు, మరి కొందరు యువకులు అక్కడే పడుకున్నారు. నాగిరెడ్డి పల్లెదాటివెళ్ళితే తమను దానం నలిచేస్తాడని వారికి తెలుసు. అందువల్ల ఇది పరిష్కారమయ్యేవరకూ అతని వెంట ఉంటేనే రక్షణ.

సుజాతమ్మ చెంబుతో నీళ్లు, గ్లాసు తెచ్చి ఇచ్చింది. "మీరు వెళ్ళి పడుకోండి. ఇంకేం కాదులే!" అన్నాడు నాగిరెడ్డి.

* * *

మసిమసి చీకటి ఉండగానే సంజమ్మ పరుగెత్తుకుంటూ వెళ్ళి మునసబు ముందు వాలింది ఏడుస్తూ. మునసబు తొందర తొందరగా వచ్చాడు పల్లెకు. అప్పటికే పల్లె లేచింది. ఎవరి పనులకు వాచు వెళ్తున్నారు. చెట్టుకు కట్టివేయబడ్డ దానం తలవాల్చి మాగన్నుగా నిద్రపోతున్నాడు. నాగిరెడ్డి రమేష్ లేచి కూర్చున్నారు.

"ఏమిట్రా ఈపని ?" అన్నాడు మునసబు వస్తూనే.

"ఏముంది ? వాడు చేసిన ఘనకార్యానికి బహుమతి. అచ్చోసిన ఆంబోతుల్లా జనంమీదకు ఇటువంటి రౌడీలను తోలడం ఆరంభించారు. ఎన్నాళ్ళు భరించాలి?"

"సరే అయిందేదో అయింది. విడిచి వేయండి. తర్వాత విషయాలు మాట్లాడుకోవచ్చు".

"వాడిని విడువడమా ? మరో అర్ధ లీటరు సారాయి తాగివచ్చి కయ్యానికి కాలు దువ్వుతాడు. ఎన్నిసార్లు వీడితో పోట్లాడాలి. తీసుకెళ్ళి పోలీసుస్టేషన్‌కు అప్పచెప్పడమే!"

"ఒరే, ఒరే నాయనా ! ఎందుకురా అనవసర తగాదాలు! ప్రెసిడెంటు ఊరిలో లేడు. ఆయన వస్తే మరింత రాద్ధాంతం అవుతుంది ?"

"ఏం ? ఆయన పోట్లాటకు పంపించాడేమిటి వీడిని ?"

"ఆయనెందుకు పంపుతాడురా?"

"మరి ఆయనకెందుకు కోపం ! రేపు ప్రెసిడెంటు ఇంటిమీదపడి మావాడు తిడతాడు. నోరుమూసుకొమ్మను చూద్దాం. ఈ నీతులేం పనికిరావు. ఎవడొచ్చినా లెక్కచేయం" అన్నాడు నాగిరెడ్డి కోపంగా.

మునసబు తను చెప్పినా వినకపోవడంతో గ్రామంలోకి వెళ్ళి నాగిరెడ్డి తండ్రి సుబ్బయ్యకు, రామయ్యకు వివరాలు చెప్పి విడిపించే ఏర్పాటు చేయించాలన్నాడు. సుబ్బయ్య జవాబివ్వలేదు.

"స్టేషన్‌కు తీసుకువెళ్ళనీ మునసబూ! వాడు రోజూ ఇలా దౌర్జన్యం చేస్తుంటే మనం చూస్తూ ఊరుకుంటే రేపు నీయింటి మీదకు కూడా వస్తాడు. ఒకసారి బుద్ధి రావాలి" అన్నాడు రామయ్య.

"నీవు కూడా అలాగంటే ఎట్లా ? వాళ్ళేదో పిల్లలు ! ఆవేశంమీద చేశారు. రేపు దీనివల్ల మళ్ళీ కలతలు వస్తాయి. అది మంచిపద్ధతా ? ప్రెసిడెంటు వచ్చిన తరువాత ఆయనతో చర్చించుకోవచ్చు. ఇప్పటికి పోనీ"

మునసబు మాటకు జవాబివ్వలేదు రామయ్య. చివరకు చేసేదిలేక మునసబు




కూడా నిరాశగా ఇల్లు చేరాడు.

రమేష్‌ను గ్రామంలోనికి పంపి యువకులను తీసుకురమ్మన్నాడు. అందరూ కలిసి ఏం చేయాలో ఆలోచించారు. కేసు పెట్టినా ప్రెసిడెంటుకు కోపమే. పెట్టకపోయినా ఇంతవరకూ జరిగిన అవమానం వల్ల అతడికి కోపమే వస్తుంది. అందువల్ల కేసుపెట్టడమే మంచిదని నిశ్చయించుకుని, ఒకడిని సైకిల్ మీద పాటికొండ వెళ్ళి పోలీసులను తీసుకరమ్మన్నారు. సంజమ్మ ఏడుస్తూ, తిట్టుకుంటూ ఇంట్లో నుంచి బయటకు, బయటనుంచి ఇంట్లోకి తిరుగుతున్నది. రచ్చబండవద్దకు మాత్రంరాలేదు. గ్రామం నుండి కొందరు పెద్దలు వచ్చి చూశారు. కాని అసలు విషయాలేమిటో అడక్కుండానే వెనుతిరిగి వెళ్ళారు. కట్లువిప్పి, తీసుకెళ్ళి రత్నం ఇంటిలో వేసి తాళంవేసి ఆ ఇంటిలోని ఆడవారిని పంతులమ్మ ఇంటివద్దకు చేర్చారు.

మేరీ కాఫీతాగి స్కూలుకు వెళ్ళడానికి తయారయింది.

"ఈరోజు ఏం పోతావులే పల్లెలో ఈ విధంగా ఉంది. పైగా అది మనకు సంబంధించిన విషయం. పోతే బాగుంటుందా?'' అంది సుజాతమ్మ.

"ఇప్పుడే ప్రెసిడెంటు ఏదో విధంగా నాశనం చేయాలని ప్రయత్నిస్తున్నాడు. ఇట్లా గైర్‌హాజరయితే ఆయనకు అవకాశం ఇచ్చినట్లు ఉంటుంది. ఈ పూట వెళ్ళి వస్తాను" అంది బయటకు నడుస్తూ.

"సరే! బయట వాళ్ళకు చెప్పు. ఏమంటారో?''

తల్లివైపు తలెత్తిచూసి మాట్లాడకుండా వెళ్ళింది మేరీ. యువకులందర్నీ రచ్చబండవద్ద కూర్చోబెట్టి నాగిరెడ్డి ఇంటికి వెళ్ళాడు.

"ఏమిట్రా రభస జరిగిందట!'' అన్నాడు రామయ్య.

వివరాలు చెప్పి "పోలీసుస్టేషన్‌కు అప్పగిస్తాం. మళ్ళీ జన్మలో ఎవరిజోలికీ రాకుండా ఉంటాడు" అన్నాడు.

"తొందర పడకండ్రా! ఆలోచించి చేయండి" అన్నాడు రామయ్య. తర్వాత ఆయన సలహా ఇవ్వలేదు. కాఫీతాగి, ఎద్దులకు నీళ్ళుపెట్టి, వాటిని లోపల కొట్టంలో కట్టివేసి, తిరిగి ప్రెసిడెంటు ఇంటి ముందుగా పల్లెవైపు రాసాగాడు. ప్రెసిడెంటు ఇంటి ముందు జనం చాలా మంది ఉన్నారు. ఏదో ఆవేశంగా చర్చించుకుంటున్నారు. నాగిరెడ్డిని చూసి మాట్లాడడం తగ్గినా, అతడు దాటి వెళ్తూనే తిరిగి మాట్లాడుకుంటున్నారు.

కరణం క్రిష్ణయ్య పంతుల్ని కలిసి "మునసబు రిపోర్టు రాయించమంటే రాయించలేదు. మీరు రాయించాలి" అన్నాడు నాగిరెడ్డి.

మునసబు ఉండగా ఆ పని తనది కాదన్నాడు కరణం. గ్రామ కక్షల్లో ఇరుక్కోవడం తన కిష్టంలేదన్నాడు. పైగా రమేష్‌ను తిట్టి "వీడు పనికిరాని వెధవ! మా పాలిటి యముడు" అని సణుక్కున్నాడు.

మధ్యాహ్నం పన్నెండు గంటలకు పోలీసులు వచ్చారు. మేరీతోనూ, నాగిరెడ్డితోనూ స్టేట్‌మెంట్లు రాయించుకున్నారు. అంతకు ముందురోజు రమేష్ కూడా దాడికి గురికాబడ్డాడు; కాబట్టి అతడితోనూ రాయించుకున్నారు. మునసబు కూడా అక్కడికి వచ్చి పోలీసులతో మాట్లాడి వెళ్ళాడు. వచ్చిన ముగ్గురికీ భోజనం మేరీ ఇంట్లోనే ఏర్పాటు

చేశారు. తర్వాత వాళ్ళు దానాన్ని తీసుకొని వెళ్ళారు.

ఆరోజు రాత్రే ప్రెసిడెంటు వచ్చాడు. వివరాలు తెలుసుకొని అగ్గిలా మండాడు. మళ్ళీ నాగిరెడ్డిని రంగంలోనికి దింపినందుకు రమేష్‌ను, ధనుంజయ్‌ని నోటికి వచ్చినట్టల్లా తిట్టి, వారి అంతు తేల్చాలన్నాడు.

రామయ్యను పిలిపించాడు ప్రెసిడెంటు. "ఏమిటి రామయ్యా ఇదంతా ! నీవు వుండి కూడా నచ్చచెప్పలేకపోతే ఎట్లా?" అన్నాడు కోపంగా.

"ఎవరేంచేస్తారు అప్పారెడ్డీ! వాడేమో పెద్ద రౌడీగా తయారయ్యాడు. నీ అండే వాడి వెంట్రుకలు బిగిసిపోవడానికి కారణం! పైగా ఆ పంతులమ్మ ఎవరి జోలికి వెళ్ళదుగదా! ఆమె జోలికి వీడు వెళ్ళడమెందుకు? ఒకరోజు కాదు, రెండు రోజులు ఆమె ఇంటిమీదకువెళ్ళి బూతులు తిట్టడం ఆరంభించాడు. వాడి స్థాయి ఏమిటి? ఆమె స్థాయి ఏమిటి? రమేష్ నోరు మూసుకుని తిరుగుతున్నాడు. ఎన్నికల గొడవేదో అయిపోయింది. మళ్ళీ అతడిమీద దాడి చేయడమెందుకు? ఇదంతా వాడికి పొగరెక్కి చేస్తున్నాడు. ఫలితం అనుభవిస్తేనే మంచిది" అన్నాడు.

"గ్రామమన్న తర్వాత చిన్న చిన్న పొరపొచ్చాలు వస్తూనే వుంటాయి. పెద్దలయినా వాటిని సర్దివెయ్యాలి. అంతేగాని రచ్చకెక్కిస్తే లాభమేమిటి ? దీనివల్ల మరింత వ్యతిరేకతలు ఏర్పడ్డమే గానీ?" అన్నాడు ప్రెసిడెంటు.

రామయ్య జవాబివ్వలేదు. మునసబు తాను చేసిన విఫల ప్రయత్నం చెప్పి "ఎవరూ ఒప్పుకోకపోవడమేగాక పోలీసులను పిలిపించారు" అన్నాడు.

"సరే నీ యిష్టం రామయ్యా! ఇది మంచి పద్ధతి కాదని మాత్రమే నేను చెబుతున్నాను. నాగిరెడ్డి పిల్లవాడు. వాడిని అడ్డుపెట్టుకొని అందరూ పని జరుపుకోవాలని అనుకుంటున్నారు. ముందుగానే వాడు ముక్కోపి. వాడిని కట్టివేయవలసిన బాధ్యత నీదే" అంటూ లేచాడు ప్రెసిడెంటు.

మరునటి రోజు ఉదయం లేస్తూనే మునసబునూ, మరో ఇద్దర్ని వెంట పెట్టుకొని, సవారి బండి కట్టించుకుని పాటికొండ చేరునప్పటికి పది గంటలయింది. ఎస్.ఐ. స్టేషన్‌లో లేడు. ఊళ్ళోనే వున్నాడు. కానీ నిద్రపోతున్నాడట. రైటర్‌తో తన్ను పరిచయం చేసుకుని "వాడిని చూడాలని వచ్చాం" అన్నాడు ప్రెసిడెంటు.

రైటర్ వారిని లాకప్‌వైపు చూపించి "మాట్లాడండి" అన్నాడు. లాకప్ వద్దకు వెళ్ళారు. లోపల కూర్చున్న దానం ఆత్రుతగా లేచివచ్చి "ఎప్పుడొచ్చారు రెడ్డీ?" అన్నాడు.

"ఇదేమిట్రా దొంగముండ కొడకా ! అనవసరంగా లేనిపోని గొడవలు తెచ్చావ్" అన్నాడు కోపంగా ప్రెసిడెంటు.

"వాళ్లు నన్ను కొట్టారు రెడ్డీ! దీనికంతా కారణం పంతులమ్మ. దానివల్లే ఇదంతా జరిగింది. రమేష్‌గాడిని మక్కెలిరగదన్నాలి" అన్నాడు దానం.

"అసలు ఎందుకిట్లా చేశావు? అదేదో ఇంటివద్ద కూర్చొని వుంటే దానిమీద దాడి చేయడమేమిటి? మనుషులనూ, సమయాన్ని చూసి నడవాలిరా ! అందరూ కలిసి నాగిరెడ్డిగాణ్ణి ముందుకు తోసి




తిరిగి నాకు ఘాటీగా పెడుతున్నారు. ఎన్నికలలో రామయ్య నిలబడకుండా ఏదో రాజీ చేసుకున్నాం. తిరిగి వాళ్ళ తోనే వైరం తెచ్చుకుంటున్నాం".

"వైరమేమిటి రెడ్డీ! రాత్రి వాడు కొట్టిన దెబ్బలు జీవితంలో మరుస్తానా? అంతకంత తీసుకుంటాను. దీనికంతకూ కారణం ఆ పంతులమ్మే. వీరందరినీ మరిగినట్లుంది. ఆ విధంగా అందర్నీ నాపైకి ఉసిగొల్పుతున్నది. పల్లెకు నాయకుడవుదామనుకున్నాడు జయరావుగాడు. మత్తులో వుండే కొట్టాడు. వీళ్ళందరూ దానికి సాయం చేస్తున్నారంటే ఏమీ లేకుండా ఎందుకు చేస్తారు?" అన్నాడు పళ్ళు కొరుకుతూ దానం.

"అనవసరంగా ఎందుకు వాగుతావురా! అందుకే వాళ్ళు తన్నింది" అన్నాడు మునసబు అతని వైపు అసహ్యంగా చూస్తూ. "లేనివన్నీ ఊహించి ఆమె ఇంటిమీదకు దాడి వెళ్ళావేం?"

"అదికాదు మునసబుగారూ" అన్నాడు తగ్గి. భుజాలు పట్టుకొని చూసి పళ్ళు కొరికి "దీనికి ప్రతీకారం చెయ్యాలి రెడ్డీ! బయటకు వస్తే ఒక్కొక్కడినే కీళ్ళు విరిచేస్తాను" అన్నాడు దానం.

"ఇంతకూ తిండి తిన్నావా?"

"ఉదయం నుండీ ఏమీ పెట్టలేదు ఈ ముండా కొడుకులు" అన్నాడు దూరంగా వున్న కానిస్టేబుల్‌ను చూస్తూ. ఒక మనిషిని పంపి, నాలుగు ఇడ్లీలు తెప్పించాడు. పదకొండు గంటలకు యస్.ఐ. వచ్చాడు. అతడితో మాట్లాడి బెయిల్ తీసుకుంటామన్నారు.

"గ్రామాల్లో ప్రభుత్వ ఉద్యోగుల మీద కూడా దాడి చేసేవాళ్ళకు మీరు సహాయం ఎందుకు చేస్తున్నారయ్యా?" అన్నాడు యస్.ఐ.

"ఇందులో చాలా గూడుపుఠాణీ ఉంది లెండి. ఆమె సామాన్యమైన ఆడదికాదు" అన్నాడు ప్రెసిడెంటు.

బెయిల్ పత్రంమీద సంతకాలు తీసుకొని దానాన్ని బయటకు తీశారు. బయటకు వచ్చి మీసం మెలేసి, దెబ్బలు తగిలినచోట చూసుకుంటున్నాడు. పాటికొండలోనే భోజనంచేసి, మోదేపల్లె చేరే సరికి నాలుగయింది. ప్రెసిడెంటు ఇంటి ముందు బండి ఆగుతూనే జనం చుట్టుకున్నారు. "దెబ్బలు తిన్నా ఫరవాలేదు. మంచి పని చేశావురా!" అని కొందరు ప్రశంసించారు.

ప్రెసిడెంటు ఇంట్లోనికి వెళ్ళి దానాన్ని, మునసబును పిలిచాడు.

"ఒరేయ్! నీవు పల్లెకు వెళ్ళి తిరిగి దౌర్జన్యంగా ప్రవర్తించకు. మళ్ళీ ఏం చేసినా తగవు వస్తుంది. ఇప్పటికే కుర్ర వెధవలంతా మళ్ళీ జట్టు కట్టారు. ఈ నాగిరెడ్డిగాడు ఊరిలో నాయకుడవుదామనుకున్నట్లుంది. వీడితో తోడు ధనుంజయ్! వీళ్ళందరూ కలిసి నిజంగానే ఏదో గూడుపుఠాణి చేస్తున్నారు. పంతులమ్మ కథ తర్వాత చూద్దాం. ఇప్పుడు దాని జోలికి వెళ్ళవద్దు. ఈ కుర్ర వెధవలు దానిముందు తమ ప్రతాపం చూపడానికి సిద్ధపడుతున్నారు" అన్నాడు ప్రెసిడెంటు.

"దాని కథ తర్వాత. ముందు ఈ రత్నంగాడు, జయరావుగాడి కథ తేల్చుకోవాలి రెడ్డీ! లేకుంటే నన్ను పల్లెలో కాపురం చేయనివ్వరు. నిన్నటిదాకా నా ముందు నిలబడ్డంచేతగాని వెధవలు నన్ను కొట్టారు".

"వాళ్ళ మహత్యం గాదురా అది!

వెనుక తోసుక వస్తున్న గాలిపాటు. ఆ గాలి నిలిచిపోతే వాళ్ళు ఊరు విడిచి పోతారు. అంతే! వాళ్ళను కొడితే తిరిగి నీమీద దాడి చేస్తారు. అందువల్ల మళ్ళీ మనమే దెబ్బతినాలి".

దానం మాట్లాడలేదు. పల్లెలో తిరిగి తలెత్తుకుని తిరగాలంటే సాధ్యం కాదు. ఇంతవరకూ తనను పులిని చూసినట్లుచూసి భయపడేవాళ్ళు. ఇప్పుడు పిల్లికంటే కూడా తక్కువగా చూస్తారని అనుమాన పడుతున్నాడు. పైగా తన మనిషి అనేవాడు ఎవడూ పల్లెలో లేడు. ఉన్న ముప్పై ఇళ్ళలోనూ సగానికి పైగా వ్యతిరేకులు. మిగిలిన వారు తటస్థులు.

రాత్రి భోజనం ప్రెసిడెంటు ఇంటి వద్దనే తిని, ఎనిమిది గంటల ప్రాంతంలో ఇంటికి బయలుదేరాడు. పంతులమ్మ ఇంటి ముందు నుంచి వెళ్ల డానికి ముఖం చెల్లక వెనుక చర్చి మీదుగా వెళ్ళి గుడిశె చేరాడు. అతన్ని చూసి సంజమ్మ ఏడుస్తున్నది. "ఎందు కేడుస్తావ్ ? ఎవరు చచ్చారని?" అంటూ కసురుకున్నాడు.

"అన్నం తిందువు గానీ రా" అంది.

"నీవు తిను ! నేను రెడ్డిగారి ఇంటి వద్ద తిని వచ్చాను" అంటూ చొక్కా విప్పి చూరుకు తగిలించి మంచం మీద కూర్చున్నాడు. వీపున కొట్టిన దెబ్బలు కుదుములు కట్టి ఉన్నాయి. వాటి మీద వేళ్లు రాపాడిస్తూ "గాడిదకొడుకులు ఎంతగా కొట్టారో !" అంటూ కళ్ళ నీరు కారుస్తున్నది.

"నీవు నోరు మూసుకుని అన్నం తిను నాకు నిద్ర వస్తున్నది" అని పడు కున్నాడు. బయట పడుకొనుటకు ముఖం చెల్ల లేదు.

"కాపు కాయమంటావా?" అంది లేస్తూ సంజమ్మ.

దానం పలుకలేదు. ఒక వైపు తిరిగి పడుకున్నాడు. అన్నం తిని పెనం పొయ్యి మీద పెట్టి, గుడ్డ కాపు మొదలెట్టింది.

మేరీ ఆ సమయంలో పిల్లల ముందు కూర్చొని పాఠం చెబుతున్నది. రచ్చ బండ మీద ఎప్పటిలాగే జనం ఉన్నారు. దానం వచ్చాడని అందరికీ తెలిసింది. మళ్ళీ ఏం అఘాయిత్యం చేస్తాడోనని మేరీ గుండెలు కదిలాయి. తిరిగి అంత తొందరగా ఏమీ చేయలేడనే ధీమా ఉన్నా, తాగుపోతు తాగి ఏమైనా చేయ వచ్చనుకుంది. రత్నం గానీ, జయరావు గానీ ఆ రాత్రి బయటకు రాలేదు. దానం కళ్ళబడితే తగవు వస్తుందని వారి భయం.

మేరీ రోజుకంటే పెందలాడే ఇంటికి పంపింది పిల్లల్ని ! మంచాలు ఇంట్లో వేసుకొని తలుపులు బిగించారు. 'ఈ గ్రామానికి ఎందుకొచ్చాంరా ?' అను కుంటున్నది సుజాతమ్మ. ఎప్పుడూ ఇటు వంటి వాతావరణంలో తిరుగలేదు. ఉన్నంత వరకూ క్లుప్తంగా మర్యాదగా పట్నంలో జీవించింది. ఈ పల్లెటూరు పరిస్థితి చూస్తేనే ఆమెకు భయం. ఎప్పుడేం జరుగుతుందోనన్న ఆందోళ నతో సతమతమవుతున్నది.

• • •

సోమవారం ఉదయం కాఫీ తాగిన తర్వాత స్కూలుకు బయలుదేరింది. మేరీ. ప్రెసిడెంటు వచ్చాడు గనుక ఎందుకు పిలిచాడో వెళ్దామనుకున్నది. గత అనుభవం కలవర పెడుతున్నది.

 

స్కూల్‌కు టైం అవుతున్నది గనుక, ఇంటికి వెళ్తూ వెళ్దామనుకుంది. అయినా మనస్సు బాధగా ఉంది. ఈ సారి మళ్ళీ ఏం అఘాయిత్యం చేస్తాడో? పోకుండా ఉందామన్నా అతడితో వైరమే. తన మాట వినలేదన్న అహంకారంతో మరింత క్రూరంగా ప్రవర్తిస్తే? ఎవరితో నన్నా సంప్రదిస్తే?—అనుకుంది. ఎవరిని సంప్రదించాలి? ధనుంజయ్ గ్రామంలో లేడు. రమేష్ సలహా తనకే ప్రమాదకరంగా తయారవుతుంది. నాగిరెడ్డితో పెద్ద పరిచయం లేదు. మిగిలిన ఇద్దరి కంటే మూడవ వ్యక్తి అయితేనే ధైర్యంగా నిలబడి ఏదో ఒకటి చేయగలడని ఆమె విశ్వసిస్తున్నది. సింహం గుహలోనికి వెళ్ళిన మేకలాగ తర్వాత విచారించే దానికన్నా, ముందుగానే తగిన వ్యక్తితో ఆలోచించడం మంచిదనుకున్నది. నాగిరెడ్డిని పిలిపించాలి! కూర్చున్న పిల్లల్లో ఏడేళ్ల పాపను పిలిచింది.

"రాజ్యం! నాగిరెడ్డి నీకేమవుతాడు?" అంది ఆ పాపను చూసి.

"మా పెద్దన్న టీచర్!" అంది పాప పలక ఒక చేతినుండి ఇంకొక చేతికి మార్చుకుంటూ.

"ఇంట్లో ఉన్నాడా?"

"ఉన్నాడు. మొన్న పోట్లాట జరిగిందిగా! అప్పట్నుంచీ ఎక్కడా వెళ్ళడం లేదు"

"నేను రమ్మన్నానని పిలుచుకొని వస్తావా?"

తలూపింది రాజ్యం.

"మీ అన్న తప్ప ఎవరు అడిగినా నేను పిలిచినట్లు చెప్పకూడదు. తెలుసా?"

మళ్ళీ తలూపింది రాజ్యం.

"వెళ్లు"

పలక గోడకు ఆన్చి రాజ్యం వెళ్ళింది. ఈ రాజ్యం ఎక్కడైనా పంతులమ్మ పంపిందని చెబుతుందేమోనని భయంగా ఉంది. ఆ విధంగా తెలిస్తే మరింత అల్లరి. రాజ్యం తిరిగి వచ్చేంత వరకూ ఆందోళనగా కూర్చొంది.

రాజ్యం పరుగెత్తుకుంటూ వచ్చింది. "మా కుంటి ఎద్దుకు అన్నం తినిపిస్తున్నాడు. ఆ పని అయిన తర్వాత వస్తానని చెప్పమన్నాడు టీచర్!" అంది.

"ఇంటికెందుకు వచ్చావని మీ అమ్మ అడుగలేదా?"

"మా అమ్మ ఇంట్లో ఉంది. మా అన్న పశవుల పాకలో ఉన్నాడు. మా అన్నకు చెప్పి, మా అమ్మ పిలుస్తున్నా వినకుండా పరుగెత్తుకొచ్చేశాను" అంది కూర్చుంటూ.

స్కూల్ విడిచే వరకూ నాగిరెడ్డి రాలేదు. ఇక రాడేమోననుకుంది. పిల్లలందరూ వెళ్ళాక తలుపు తాళం వేస్తుంతగా నాగిరెడ్డి వచ్చాడు. తిరిగి తాళం తీసి, లోనికి వెళ్తూ "రండి" అంది.

ఇద్దరూ కూర్చున్నారు.

"దానం తిరిగి వచ్చాడట కదా?" అన్నాడు నాగిరెడ్డి.

"రాత్రి వచ్చాడని విన్నాను. కాని, చూడలేదు. మొన్న ఆ తగాదా జరుగక ముందు రోజు ప్రెసిడెంటు నన్ను యింటివద్దకు రమ్మని మనిషిని పంపాడు. స్కూలు మూసిన తర్వాత వస్తానని చెప్పాను. వెళ్ళాను. ఆ పాటికి ఆయన ఒంగోలు వెళ్ళాడు. అదే రోజు ఈ తగాదా జరిగింది. గతంలో అతను చేసిన ప్రయత్నం మీకు తెలుసనుకుంటాను. ఈ రోజయినా పోయి కన్పించాలనుకుంటున్నాను. గత అనుభవం ఉంది

కాబట్టి, ఏం చేస్తాడోనని భయంగాఉంది. నాకిక్కడ సలహా ఇచ్చేవారూ, ధైర్యం చెప్పేవారు ఎవరూ కన్పించడం లేదు. చివరకు మీరేం చెప్పుతారోనని పాపను పంపించాను" అంది తలవంచుకుని, బండ మీద వేలితో సున్నాలు చుడుతూ.

"ఈ పంచాయతీ నిబంధనలు నాకేమీ తెలియవు. ప్రెసిడెంటు పిలిపిస్తే విధిగా టీచర్ వెళ్ళాలనే నిబంధన ఏమైనాఉందా? ప్రెసిడెంటుకు వ్యతిరేకమైతే ఉద్యోగం ఊడిపోతుందా?"

"అవన్నీ ఏమీ లేవండి ! కాకపోతే పట్టుబట్టి ట్రాన్స్ఫర్ చేయించగలరేమో? కాని గ్రామంలో ఏం దౌర్జన్యం చేయిస్తారోనని ఒక పక్క భయం. రెండోది ఎప్పుడూ ట్రాన్స్ఫర్ కావడమంటే అదో రిమార్కు. ఈ ఉద్దేశంతోనే ప్రెసిడెంటుకు మంచిగా ఉండాలని ప్రయత్నం. ఇది ఆసరా చేసుకొని అతని ఇష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తున్నాడు ఇక్కడ".

"అయితే మీరు వెళ్ళకండి. వెళ్ళి అల్లరి పడడమెందుకు?"

తలెత్తి అతన్ని చూసింది. "ఆయన సంగతి మీకు తెలుసు గదా ! అతడు పిలిస్తే ఇంటికి వెళ్ళకుంటే మళ్ళీ ఏం దౌర్జన్యం చేయిస్తాడోనని భయంగాఉంది"

"వెళ్ళకుండా మానుకోండి. అతడేమయినా రాసందుకు సంజాయిషీ అడిగితే నేను వెళ్ళవద్దన్నానని చెప్పండి. ఆ తర్వాత నా వంతు మాట్లాడవలసి ఉంటే నేను చూసుకుంటాను".

"మీరు ఈ సహాయం చేస్తానంటే నేను వెళ్ళదలచుకోలేదు. అదే పని చేస్తాను" అంది.

నాగిరెడ్డి లేస్తూ "మీరు భయపడకండి. ఇక్కడ మీకు ఏ సహాయం కావాలన్నా నేను మీ వెనుక ఉంటాను. నాకు ఇంటి వద్ద పని ఉంది. వెళ్తున్నాను. అవసరమైతే ఎవరి చేతనయినా పిలిపించు" అంటూ వెళ్ళిపోయాడు. పోతున్న అతన్ని



వెనుక నుండి చూస్తూ నిలబడింది ఆలో చిస్తూ.

"టీచర్! ఏమిటి అలా చూస్తున్నారు! అప్పుడే అన్నం తిని వచ్చారా?" అంది పదిహేనేళ్ల అమ్మాయి నవ్వుతూ. మేరీ తుళ్ళిపడి తేరుకుని చూసింది. రంగు దారాలు చేతపట్టుకొని తననే చూస్తున్నది ఆ అమ్మాయి.

"ఇంకా అన్నం తినలేదు. సరే! రా లోనికి!" అంది. మరి కొందరు ఆడ పిల్లలు వచ్చారు. వారికి అల్లిక చూపిస్తూ మరో గంట గడిపింది. "నేను భోజనం చేసి వస్తాను. ఉండండి" అని చెప్పి ఇంటికి వెళ్ళింది.

సుజాతమ్మ ఎదురు చూస్తున్నది 'ఇంకా రాలేదేమిటా !' అని. మేరీ వస్తూనే "ఇంత సేపున్నావేమిటి?" అంది.

"ఏమీ లేదులే! స్కూల్ విడుస్తూనే ఆడపిల్లలు వచ్చారు. వారికి అల్లిక చూపిస్తూ కూర్చున్నాను" అంటూ ముఖం కడుక్కొని అన్నానికి కూర్చుంది.

ఆ రోజే ధనుంజయ్ ఒంగోలు నుండి వచ్చాడు. ప్రెసిడెంటు ఇంటి ముందుగా వెళుతుంటే బయటే ఉన్న మునసబు పిలిచాడు.

"నీ మిత్రుల ఘనకార్యం విన్నావేరా" అన్నాడు ప్రెసిడెంటు.

"ఆ! విన్నాను లెండి. వీడు చేసిన ఘనకార్యం కూడా పెద్దదే కదా! ఇవన్నీ పట్టించుకోకూడదు బాబాయ్. మనలో మనం చీలి కొట్టుకుంటూ ఇ ర వై రెండేళ్లుగా గ్రామ సౌకర్యాలు ఏమీ చేయ లేకపోయాము. ప్రతిసారీ ఇలాంటిది ఏదో ఒకటి అడ్డు రావడం, దానితో కల హించుకొని ఎవరి తోవ వారు చూడటం పరిపాటి అయింది. తాడూరు నుండి మన గ్రామానికి రోడ్డు వేసే విషయం ఆలో చించారా ?"

"నేను పుట్టినప్పటి నుండీ ఆలోచిస్తు న్నారోయ్ ! గ్రామ తగాదాలు పరి ష్కారం కాక ఛస్తుంటే రోడ్డు ఏందిరా ఇప్పుడు?" అన్నాడు మునసబు తూష్ణీ భావంగా.

"ఆ తగాదాలు మామూలే ! వాటి కొరకు ఇతర పనులు ఎందుకు మాను కోవాలి ?"

"అది పాత హైవేస్ రోడ్డు. దానికీ, పంచాయతీకి సంబంధం లేదన్నారుపరిషత్ వాళ్లు. దొనకొండ నుండి మేదర మెట్ల వరకు తాడూరు మీదుగా ఎప్పుడో రోడ్ల డిపార్ట్‌మెంట్ వారు వేశారట. ఇది ఇప్పుడూ వాళ్ళే చేయాలి. లేదా పరిషత్ కిందకు తెచ్చుకోవాలి" అన్నాడు ప్రెసి డెంటు.

"ఆ విధంగానయినా ప్రయత్నంచేయ వచ్చు కదా ? కనీసం కంకర రోడ్డు పోయిస్తే బస్సు తిరిగే అవకాశముం టుంది. నీవు ప్రయత్నిస్తే తప్పకుండా పరిషత్ పరిధి కిందకు తీసుకొని రావచ్చు".

'వీడో బోడి వెధవ. అటు ఇటు మంచిగా ఉండాలని ప్రయత్నిస్తున్నాడు' అనుకున్నాడు ప్రెసిడెంటు.

అక్కడి నుండి రమేష్ ఇంటి వద్దకు వచ్చాడు ధనుంజయ్.

ఈ రెండు రోజుల నుండి రమేష్ బయటకు రాలేదు. మళ్ళీ కవ్విస్తారేమో నని భయం.

"ఎప్పుడొచ్చావ్‌రా?" అన్నాడు ధనుంజయ్‌ని చూసి.

"రాత్రి వచ్చాను; ఇంట్లో కూర్చుంటే పనులు ఎలా అవుతాయిరా! ఎవరికి వాళ్ల




సర్దుకున్నారేమిటి?"

"సర్దుకోడానికి ఏముందిరా? మొన్నేదో తగవు జరిగింది. పరిష్కారం చేశాము. ఇంకేమీ లేదు. ఎప్పుడూ గీరుకోవడ మేమిటి ?"

"కేసు పెట్టకుండా విడిచి ఉందే ప్రెసిడెంటుకు అంత బాధ కలుగక పోయేది కదా ! ఎందుకంత తొందర పడ్డారు ? కొట్టారు; రాత్రంతా కట్టేసి ఉంచారు. ఆ అవమానం చాలు వాడికి".

"నేనూ అదే చెప్పాను. నాగిరెడ్డి వినలేదు. వాడో నాయకుడయ్యాడు. నాయకత్వం నీవు తీసుకోరా అంటే అటూ ఇటూ మంచిగా ఉండడానికి తప్పించుకున్నావు. నాగిరెడ్డి ఏది చేసినా తన ఇష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తాడు గాని ఒకరు చెప్పింది వినడు".

"నీకొచ్చిన ఈర్ష్య అదేరా నాయనా ! నాయకత్వం ఎవరిది ? అన్నది ప్రధాన సమస్య కాదుగా ! విజయం ఎవరిదనేది ముఖ్యం. నాగిరెడ్డిని నాయకుడుగా పెట్టకుండా నీవో, నేనో కోరినా నాగిరెడ్డి ఒప్పుకుంటాడు. ఏ తగవు వచ్చినా ఈ రెడ్లలో మనకు సహాయం ఎవడూ చేయడు. వాళ్ళలో చీలిక లేకుండా పోటీకి నిలబడితే మనం నిల్వలేము ! ప్రెసిడెంటును దెబ్బ తీయాలంటే అందుకు తగినవాడే నాయకుడుగా ఉండాలి. నిన్నటి పరిస్థితిలో మనలో ఎవరమో నాయకత్వంలో ఉన్నామనుకుందాం. దానాన్ని ఎదిరించగలమా? వాడిని కొట్టి చెట్టుకు కట్టేస్తే ఆ విధంగానే మన వీపులు పగులగొట్టి గుండ్లకమ్మలో శరీరం కలిపేవారు! వాడిని ఏమి చేయడానికీ ప్రెసిడెంటు చేతగాక వెల్లకిలా పడుకున్నాడు. దానికి కారణం వాడికి వెనుక ఉన్న అర్థ, అంగ బలాలే."

రమేష్ మాట్లాడలేదు. "నాగిరెడ్డి ఉన్నాడా?" అన్నాడు ధనుంజయ్.

"ఉంటాడు; లేదా పొలం వెళ్ళి ఉంటాడు"

"సాయంత్రం కలుద్దాం" అని ధనుంజయ్ వెళ్ళిపోయాడు.

సాయంత్రం గ్రామ చావడి వద్ద అందరూ కలిశారు. ధనుంజయ్ రోడ్డు వివరాలు చెప్పి "అది పరిషత్ చేతిలో లేదు. హైవేస్‌వాళ్ళు వేయరు. దాన్ని పరిషత్ పరిధి కిందకు ముందు తీసుకవస్తే పంచాయతీ గ్రాంట్లతో వేస్తారు" అన్నాడు.

"దీనికొరకు కొంత డబ్బు ఖర్చయినా మనం పోరాడాలి. మన శాసన సభ్యుడు మనకు అనుకూలం. అతని ద్వారా పోరాడితే సాధించవచ్చు. తాడూరునుండి మన ఊరి వరకూ చాలు" అన్నాడు రమేష్.

"చాలా ఖర్చవుతుంది. ఆఫీసర్ల చుట్టూ, వాళ్ళ ఆఫీసుల చుట్టూ, నాయకుల చుట్టూ తిరుగడం, వారికి ముడుపులు చెల్లించడం... ఈ డబ్బు ఎక్కడనుండి తేవాలి?" అన్నాడు ధనుంజయ్.

"చందాలు రాబట్టుదాం! మొన్న స్వతంత్రదినానికి అంతడబ్బు తగలేయడానికి చందాగా ఇచ్చారు. మంచిపని చేద్దామంటే ఇవ్వరా?" అన్నాడు నాగిరెడ్డి.

"ముందు మన ప్రెసిడెంటును అడుగుదాం! అతడేం చెబుతాడో వినాలి. వ్యతిరేకించి పనిచేయగలమా, లేదా అన్నది సమస్యకాదు. అందర్నీ కలుపుక రావాలి" అన్నాడు ధనుంజయ్.

నాగిరెడ్డి కంటగింపుగా చూశాడు

ధనుంజయ్ వైపు "వాడిని అడిగేదేమిటి? అడిగినా ఇంతవరకూ చూపిన మొండి చెయ్యి మళ్ళీ చూపుతాడు. మ న లో ఎవరో ఒకరు ఈ బాధ్యత నెత్తిన వేసు కొని ఈదండి. డబ్బు రూపంగా సహ కారం అందరం కలిసిచేద్దాం"

ఈ తిరుగుటకు ధనుంజయ్‌నే ఎంపిక చేశారు అందరూ.

మరుసటిరోజు ముందు ప్రెసిడెంటు ఇంటివద్దకే చందాపట్టి తీసుకొని వచ్చారు. విషయమంతా చెప్పి "మీ చందా ఎంతో ముందు ఇవ్వండి" అన్నాడు ధనుం జయ్.

వీళ్ళను చూసి ముఖం మాడ్చుకు న్నాడు ప్రెసిడెంటు. పైగా చందా అడి గితే మండిపడ్డాడు "చందాలు రాబట్టి ఎవడు మేయడానికి ఇదంతా? రోడ్డు వచ్చేదా చచ్చేదా! తినడానికి చందాలు ప్ప వ్యవహారాలు" అన్నాడు.

"అయితే ఇంతకుముందు చందాలు రాబట్టిన వారందరూ ఈ విధంగా తిన్న ట్టేనా? చందాలు రాబట్టడం కొందరు తిన డానికే అయితే గతంలో చాలా మంది ఈ ఊరిలో మేసినట్లే" అన్నాడు వెనుక నుండి నాగిరెడ్డి.

"ఇంతకు ముందు రా బ ట్ట డ ం, ఇప్పుడు రాబట్టడం ఒకటేనేమిటి? రాబట్టి కొన్ని పనులు చేశాం. మీరేదైనా చిన్న కార్యాలు తీసుకొని చేయండి. ఎవరు వద్దంటారు ? ఇంత పెద్ద రోడ్డు...జిల్లా పరిషత్ చేతగాక నోరు మూసు కున్నారు. రేపు ముక్కంటి ఏకాదశి ఉంది. చందాలు రాబట్టి పల్లకీ కట్టి దేవున్ని ఊరేగింపు చేయండి"

"దేశంలో దేవతల దగ్గర చాలా డబ్బు మూలుగుతున్నది. వాళ్ళ ఊరే గింపు వాళ్ళే చేసుకుంటారు బాబాయ్ ! ఖచ్చితంగా ప్రవర్తిస్తే రోడ్డుపని జరిగి తీరుతుంది. ఈ ప్రభుత్వానికి పన్ను రూపంగా మనం ఎంతో చెల్లిస్తున్నాము" అన్నాడు ధనుంజయ్.

ప్రెసిడెంటు పలుకలేదు. మళ్ళీ వస్తా మంటూ వెళ్ళిపోయారు.

"డబ్బు తినడానికి వెధవలందరూ వేషాలు వేస్తున్నారు" అన్నాడు పోతున్న వారిని ఉద్దేశించి ప్రెసిడెంటు. విన్పిం చినా, వినిపించనట్లే వెళ్ళారు. ప్రతి కుటుంబాన్ని పలుకరించి చందా అడి గారు. కొందరు ప్రెసిడెంటు చెబితే ఇస్తా మన్నారు. కొందరు ఉన్నదేదో ఇచ్చారు. మరికొందరు పట్టీలో రాశారు తర్వాత ఇస్తామని చెప్పి.

"మా పల్లెలో అడుగుదాం!" అన్నాడు రత్నం. పల్లెకు కదిలారు. పెద్దగా ఇవ్వ లేకున్నా రూపాయా, రెండు రూపాయలు ఇచ్చారు. వీళ్ళను చూసి దానం తలుపు వేసుకున్నాడు. నవ్వుకుంటూ రచ్చబండ వద్దకు వచ్చారు. "పంతులమ్మను కూడా అడగాలి" అ న్నా డు ధనుంజయ్. అందరూ ఆమె వద్దకు వచ్చారు.

"ఈ రోడ్డు తయారయితే మీరు నడ వాల్సిన పనిలేకుండా సరాసరి ఇక్కడ దిగవచ్చు" అన్నాడు ధనుంజయ్ నవ్వుతూ.

"ఈ రోడ్డు పూర్తయ్యేనాటికి ఈ ఊర్లోనే ఉంటానన్న నమ్మకమేమిటి? అయినా ఎంత ఇవ్వమంటారో చెప్పండి"

"మేమేం రౌడీలంకాదు అడిగినంత ఇవ్వమనడానికి. మీకు ఇష్టమొచ్చినంత ఇవ్వండి"

"ఇది నెలాఖరు రోజులండీ! జీతం




అందగానే ఇస్తాను

రత్నం, జయరావు పల్లెలోనే నిలబడ్డారు. మిగిలినవారు గ్రామంవైపు సాగారు. "అన్నం తినిరండి. మజానగరం కూడా వెళ్ళాలి" అన్నాడు నాగిరెడ్డి.

సాయంత్రం మూడు గంటలకు మజానగరం వెళ్లారు. అక్కడ కూడా ప్రెసిడెంటుకు అనుకూలమయినవారు ఇవ్వలేదు. రామయ్యకు అనుకూలమయినవారు, ఎవరికీ చెందని తటస్థులు ఇచ్చారు. తర్వాత ఇస్తామన్నవారి మొత్తం పట్టీ రాసుకున్నారు. ఎలీశమ్మ వంద, మరో టీచరు వంద జీతాలు వచ్చిన తరువాత ఇస్తామన్నారు. రాత్రి ఎనిమిది గంటలకు ఇళ్లుచేరి డబ్బు లెక్కవేశారు. మొత్తం పదిహేనువందలా సలభై రూపాయలు నగదు వచ్చింది. వాగ్దానం చేసిన మొత్తం మూడు వేలకు మించింది. ఈ మొత్తంతో రోడ్డు కొరకు పోరాడుతామనే ధైర్యం వారికి కలిగింది. ఇది వీళ్లు తినడానికి వసూలు చేస్తున్నారని కొందరు ప్రచారం చేశారు; కొందరు ముఖం మీదే అడిగారు. ఎవరికీ సమాధానం ఇవ్వలేదు. అల్లరి పట్టించడానికి మాట్లాడేవాళ్ళు, చెప్పిన సమాధానంతో తృప్తిపడరు. అనవసరంగా రెచ్చగొట్టుకోవడం కంటే పనిసాధించడం ముఖ్యమనుకున్నారు. పని సాధించినప్పుడు వాళ్ళే నోరు మూసుకుంటారు; పైగా ఉన్న పరపతి పోగొట్టుకుంటారు. రేపటి నుండి నాయకులు, అధికారుల చుట్టూ తిరిగి తొందరగా సాధించాలని తీర్మానించుకున్నారు.

* * *

వీళ్ళు రోడ్డు తీసుకరావడం తర్వాత విషయం. తిరిగి గ్రామంలో మాత్రం కలతలు పెరిగిపోయాయి. ఎవరి వర్గాలుగా వాళ్లు చీలిపోయి, పోట్లాడుకోవలసిన పరిస్థితి ఏర్పడింది. గత ఇరవై సంవత్సరాలుగా ప్రెసిడెంటుగా ఉన్న అప్పారెడ్డి పురోభివృద్ధి సాధించేదానికి ప్రయత్నం చేయలేదు. అతడి కాలంలో రెండు గ్రామాలకు రెండు స్కూల్ బిల్డింగ్స్ మాత్రం శాంక్షన్ అయ్యాయి. కనీసం రూరల్ డిస్పెన్సరీగానీ, వెటర్నరీ హాస్పిటల్‌గానీ లేవు. అవసరమయితే పక్క గ్రామాలకు పరుగెత్తక తప్పడం లేదు. అతని కాలమంతా టీచర్లుగా వచ్చిన వారిని ఏడ్పించడానికి ఉపయోగించాడు.

ఇప్పుడా గ్రామంలో యువకులు తయారయ్యారు. వారిని ఎదిరించాలంటే ప్రజల దృష్టిలో కొన్ని పనులు చేసి చూపించాలి. వారికంటే ముందే తాను కార్యక్రమం తీసుకోవాలని నిర్ణయించుకొని సమితి నుండి కొంత గ్రాంటు సంపాదించడానికి ప్రయత్నం చేశాడు. ఆ గ్రాంటు అందుబాటయ్యేలోగా కొన్ని పనులు చేయాలని గ్రామ ముఖ్యులందరికీ చెప్పి, చందాలు వసూలు చేయడానికి ప్రయత్నం చేశాడు. ఒకవైపు వారు, ఇంకొక వైపు వీరు చందాల వేటకు బయలు దేరడంతో గ్రామస్థులకు తలనొప్పిగా తయారయింది. 'ఎవడూ చేసేదేమీలేదు. అనవసరంగా డబ్బుఖర్చుతప్ప' అన్నారు కొందరు. అయినా తప్పదు గనుక ప్రెసిడెంటు చందా కొంత ఇచ్చారు. మరుగుదొడ్లు కట్టించాలన్నారు. మజానగరంలో గ్రామానికి ఒకటి, పల్లెకు ఒకటి, మోదేపల్లెలో రెండు మొత్తం నాలుగు కట్టించాలన్నారు. నాలుగింటికీ అంచనా ఇరవైవేల రూపాయలు. చందాల ద్వారా పదివేలు వసూలు చేశారు. మరొక

పదివేలు పంచాయతీ నిధుల నుండి తీసి ఖర్చు పెట్టదలచుకున్నారు. ధనుంజయ్ తిరిగి రాకముందే కార్యక్రమం ప్రారంభించారు. ప్రెసిడెంటుకు ఆలస్యంగా నయినా ఇంత మంచిబుద్ధి కలిగినందుకు రెండు గ్రామాల ప్రజలు సంతోషించారు. 'ఇంత మంచివాడు ఎలా అయ్యాడా?' అని తమలోతామే గొణుక్కున్నారు. 'ఇందులో ఎంత తింటాడో?' అన్నారు కొందరు అవహేళనగా!

సమితి ప్రెసిడెంటును కలిసి వివరాలు చెప్పి, తాను అక్కడ నిలబడాలంటే ఏదో ఒకటి చేయడం తప్పనిసరి గనుక, ఈ కార్యక్రమం తీసుకున్నట్లు చెప్పి, సమితి నుండి గ్రాంట్లు కావాలని అడిగాడు. తర్వాత మీటింగుల్లో ఆ విషయం ప్రస్తావించి, ఇప్పించే ఏర్పాట్లు చేయిస్తానని హామీ ఇచ్చాడు. వీలుంటే అడ్డరోడ్డు నుండి మోదేపల్లె వరకూ రోడు విషయం కూడా ఆలోచిస్తానని హామీ ఇచ్చాడు. రోడ్డు కొరకు చందాలు రాబట్టి వారు తిరుగుతున్న విషయం చెప్పాడు.

"ఇటువంటి పనులు సులభంగా కావు. వాళ్ళయినా డబ్బు ఖర్చు చేయడం తప్ప సాధించటం సాధ్యం కాదు. కుర్రకారు ఆవేశం తప్ప ఏమీ లాభం లేదులే!" అన్నాడు సమితి ప్రెసిడెంటు.

ఇంటికి వచ్చి దానంలాంటి వారిచేత ఇదే ప్రచారం చేయించాడు. "ధనుంజయ్ ఉద్యోగం లేక నాలుగు రోజులు జల్సాగా తిరగడానికి ఈ చందాలు రాబట్టు కున్నాడు. రోడ్డు రాబట్టడమంటే మాటలా? రోడ్డు పేరుతో కుర్రకారు బతకడానికి ప్రయత్నం చేస్తున్నారు" అంటూ ప్రచారం జరిగింది.

ఇది విన్న కొందరు ఇస్తామని వాగ్దానం చేసి కూడా యివ్వకుండా మానుకున్నారు. ధనుంజయ్ నాలుగు రోజులుగా రానేలేదు. డబ్బంతా అతడి వద్ద వుంది. యువకుల్లో ఈ ప్రచారం ద్వారా కొందరికి నిరాశ పుట్టింది నిజంగానే రాదేమోనని! డబ్బు తినడం గురించి చివరకు అందరికీ మాట వస్తుందని కొందరు సమావేశానికి కూడా రాకుండా మానుకున్నారు.

వారం రోజుల తర్వాత ధనుంజయ్ వచ్చాడు. గ్రామ వాతావరణం అతడిని ఆశ్చర్యపరచింది. ఇప్పుడు అనుకూలత ప్రెసిడెంటు వైపు వుంది. కార్యక్రమం తీసుకొని పని చేస్తున్నాడు. తాము చేయ దలచినదానిని దెబ్బకొట్టడం అతడి ఉద్దేశమని తెలుసు. కాని ప్రజలు ఆ విధంగా భావించరు.

నాగిరెడ్డిని కలిసి అడిగాడు ఏం చేద్దామని?

"చేసేదేముంది. అసలు నీవు సాధించింది ఏమిటో ముందు తెలుసుకోవాలి. అందర్నీ సమావేశపరచి సాయంత్రం మాట్లాడుదాం!" అన్నాడు నాగిరెడ్డి.

సాయంత్రం పదిమంది కలిశారు. తాను వారం రోజులుగా చేసిన ప్రయత్నం, హైదరాబాద్‌లో శాసనసభ్యుని కలిసి అతనివెంట తిరిగి చేసిన వివరాలుచెప్పాడు. డబ్బు మంచినీళ్ళ ప్రాయంగా ఖర్చవుతుందని చెప్పాడు.

అందులో ఒకడు "హైదరాబాదంటే లాడ్జీలు, సినిమాలే కదా! ఖర్చు కాకేం చేస్తుంది" అన్నాడు అవహేళనగా.

ఆ మాటతో ధనుంజయ్‌కి ఒళ్ళు మండింది. "నేనేం తిరగడానికి వెళ్ళ లేదురా! మంచి పని చేద్దామని వెళ్ళాను.




మీరంతా ఇలా మాట్లాడతారని తెలిస్తే ఆ భారం మీమీదే వేసి నేను పక్కన వుండేవాడిని. జనం ఏదో అన్నారని, మీరు కూడా అదే అంటే ఎట్లా?" అన్నాడు.

"మనం పోగుచేసే మూడువేలు ఖర్చు పెట్టి, యువకులందరం శ్రమదానం చేస్తే గ్రామంలోని నాలుగు బావుల్లోనూ పూడిక ఎత్తేయించేవారిమి. అనవసరంగా పెద్ద పనులు మొదలు పెట్టడం తప్ప ఏం సాధించిందీ లేదు" అన్నాడు రమేష్.

"ఒరేయ్ రమేష్! రోడ్డు గురించి ముందు మాట్లాడింది నీవేకదరా! ఇప్పుడు తిప్పి మాట్లాడుతున్నావు" అన్నాడు ధనుంజయ్ ఆవేశంగా.

"ఇప్పుడు మాత్రం వద్దనడం లేదురా! సరయిన పద్ధతిలో తీసుకోకుండా ఒకే సారి ఆకాశానికి నిచ్చెన వేసే పద్ధతి అనుసరించాం. జనం దృష్టిలో ఇది సాధించేది కాదని తేలిపోయింది. ఇరవై ఏళ్ళుగా ప్రెసిడెంటు చేయలేని పని ఇరవై రోజులలో మనం చేస్తామంటే జనం వెర్రివాళ్ళు కాదురా. మనం చందాలు తిన డానికే ఈ ప్రయత్నాలు చేస్తున్నామని వాళ్ళు ఊహిస్తున్నారు" అన్నాడు రమేష్.

"రమేష్! ప్రతీది మొదట బలపర చింది నీవు. చివరకు ఇంత తొందరగా మార్పు రావటానికి కారణమేమిట్రా?"

"నాయకత్వం ఇచ్చి హైదరాబాద్ చుట్టూ తిప్పలేదని ఆయనకు మంటగా ఉంది. ఈయనకు నాయకత్వం ఇచ్చి వుంటే బాగుండేది" అన్నాడు చాకలి రాముడు.

రమేష్ మండిపడ్డాడు. "వెధవ డబ్బు నాయకత్వం కళ్ళు చూడలేదను కున్నారా? ఇటువంటి కూతలు కూస్తే తంతాను. సంఘం పేరు చెప్పుకొని కొందరు బతకడానికి నేను ఒప్పుకోను. ఈ సంఘం లేకున్నా మంచిదే!"

"అయితే దీన్ని చెడగొట్టాలనుకుంటు న్నావా ఏమిటి?" అన్నాడు నాగిరెడ్డి.

"దానికదే చెడిపోతున్నది. ఒకరు చెడగొట్టడం ఏమిటి?"

నాగిరెడ్డి, రత్నం ఒకరిముఖం ఒకరు చూసుకున్నారు.

"నీ కిష్టం లేకపోతే నీవు బయటకు వెళ్ళు.సంఘానికంతటికీ బురదపూయకు" అన్నాడు ధనుంజయ్. రమేష్ లేచి అక్కడి నుండి వెళ్ళిపోయాడు. పది నిమిషాలు అక్కడ నిశ్శబ్దంగా వుంది.

"ఎందుకిట్లా మారాడు వీడు?" అన్నాడు ధనుంజయ్ మెల్లిగా.

"వెనుక ఏదో జరిగింది, లేకుంటే ఇట్లా దిగజారడు. బహుశ అప్పారెడ్డితో సంబంధాలు పెట్టుకున్నాడేమో?" అన్నాడు నాగిరెడ్డి.

"అంతవరకూ వస్తాడా? నిన్నటిదాకా అప్పారెడ్డిని తిట్టి, అతనికి ఎదురు పోటీ నిలబడి, తిరిగి అతడి కాళ్ళ కిందకే వెళ్తాడా?"

"ఏమో చపలచిత్తం మనిషి. నిలకడ లేకుండా ప్రయత్నాలు చేస్తాడు. చెడి పోతాడు. ప్రెసిడెంటు దగ్గర గౌరవనీయ నాయకత్వం దొరుకుతుందేమో?"

మరో రెండు వేలు కావాలన్నాడు ధనుంజయ్. రోడ్డు తెప్పించే మార్గం తప్పకుండా నెరవేరుతుందని శాసన సభ్యుడు హామీ ఇచ్చాడని చెప్పాడు. ఈ వాతావరణం చూస్తే నాగిరెడ్డికి నమ్మకం లేదు. అయినా మరో రెండువేలు ఖర్చు చేయడానికే సిద్ధపడ్డాడు. రమేష్ జారి

పోయిన తరువాత ధనుంజయ్ చాలా రోజులు నిలువలేడని తెలుసు. వాళ్ళిద్దరూ ప్రాణస్నేహితులు. రోడ్డు పేరుతో ధనుంజయ్ కొంత డబ్బు ఖర్చు పెట్టాడు గనుక, వెంటనే తప్పుకోడానికి అవకాశం లేదు. ఇప్పుడు తప్పుకుంటే అయ్యే ఖర్చుకు అపవాదు అతడే భరించవలసి వస్తుంది. అందువల్ల తిరిగి ప్రయత్నం చేస్తానంటున్నాడు. రావలసిన చందాలు రాబట్టి చివరి ప్రయత్నం చేయాలనుకున్నాడు నాగిరెడ్డి. ఎవరు ఉన్నా, ఊడిపోయినా నచ్చే నష్టం ఏమీ లేదనుకున్నాడు.

మరుసటి రోజు ఉదయం స్కూలు వద్దకు వెళ్ళాడు.

ఆ సమయంలో మేరీ బయటే నిలబడి ఉంది. పిల్లలు అప్పుడప్పుడే వస్తున్నారు.

"ఉదయమే వస్తున్నారేమిటి?" అంది పలకరింపుగా నవ్వుతూ.

"అవసరముండి వచ్చానండీ! మీకు జీతాలు వచ్చాయా?" అన్నాడు.

"మీకు చందా ఇవ్వాలి కదా! మరచిపోయాను. డబ్బు ఇంటి వద్ద ఉంది. మధ్యాహ్నం ఇస్తాను" అంది.

"చందా విషయం కాదు. ప్రస్తుతం ఐదు వందల రూపాయలు కావాలి. నాలుగు రోజుల్లో ఇస్తాను. ధనుంజయ్‌ని పంపించాలి. ఆ డబ్బు బాధ్యత నానెత్తిన వేశారు. మా ఇంట్లో అడగడం మంచిది కాదు. ఇతరచోట్ల కొంత దొరికింది. మీ జీతం వచ్చి ఉంటుందని వచ్చాను".

మేరీ ఆలోచనలో పడింది. 'తన ఖర్చులకు, వెచ్చాలకు డబ్బు కావాలి. అతడు వెంటనే ఇవ్వకపోతే తాను ఇబ్బంది పడవలసి వస్తుంది. ఇవ్వనంటే అతను చేసిన సహాయానికి ఇదో ప్రతిఫలం కాదు. పైగా రేపు ఇంత కంటే అవసరమైన పరిస్థితులు రావచ్చు' అని ఆలోచించింది.



"ఇంటికి వెళ్ళి తెమ్మంటారా?" అంది అతడిని చూస్తూ.

"నేనూ వస్తాను పదండి. అట్నుంచి అటే వెళ్ళాలి".

ఇద్దరూ స్కూలు నుండి పల్లెకు వచ్చారు. రచ్చబండ మీదున్న జయరావు వీరిని చూసి దిగి వచ్చాడు. ఐదు వందల రూపాయల నోట్లను అతనికి ఇచ్చింది. "తొందరలోనే ఇస్తాను" అన్నాడు నాగిరెడ్డి వెళ్ళిపోతూ.

"వీలున్నప్పుడే ఇవ్వండి" అంది మర్యాద కొరకు.

"డబ్బెందుకు రెడ్డీ?" అన్నాడు జయరావు.

"ధనుంజయ్‌ని పంపాలి కదా! డబ్బు లేకపోతే ఎలా పోతాడు?"

"నీవు ఒక్కడివే ఎందుకు భరించాలి రెడ్డీ! రేపు ఎవరూ ఇవ్వకపోతే ఇంట్లో నీకు బాధ కదా! నీవు స్వతంత్రుడివా ఏమన్నానా? అనవసరంగా నీవు ఇరుక్కుంటున్నావు" అన్నాడు జయరావు. నాగిరెడ్డి నవ్వి పల్లె దాటి వచ్చాడు.

గ్రామంలో అక్కడక్కడ పోగుచేసి రెండు వేలు తెచ్చాడు. "ఇదే ఆఖరి డబ్బు! ఇంక నేను తేలేను. చందాలు వసూలు చేయలేదు. చేతి నుండి ఇస్తున్నాను" అన్నాడు డబ్బు ఇస్తూ.

"అయితే మానుకుందాంరా! పోతే పదిహేను వందల రూపాయలు. ఈ పరిస్థితిలో మనం బాధపడటమెందుకు? మనకు ఒకరికే రోడ్డు కావాలా ఏమిటి? అయిన డబ్బు తలా కొంత భరించి, ఎవరి చందాలు వారికి ఇద్దాం" అన్నాడు ధనుంజయ్. మధ్యన తను డబ్బు తిన్నవాడిగా గుర్తింపబడుతున్నాడు. ప్రెసిడెంటు ప్రచారం బాగా ఊపు ఇచ్చింది. వీరిలో వీరికి ఒకరి మీద ఒకరికి నమ్మకం లేక చీలిపోతున్నారు.

"అయినదాన్ని గురించి పట్టింపు లెందుకు? చందాలు తినేవారిలో మనమూ చేరినట్లు ఎలాగూ పేరు వస్తున్నది! బాధ పడటమెందుకు! ఏమైతే అదే అవుతుంది" అన్నాడు నాగిరెడ్డి.

ధనుంజయ్ ఆ రోజే తిరిగి వెళ్ళాడు. రామయ్య నాగిరెడ్డిని పిలిచి అడిగాడు "ఏమిట్రా విషయాలు?" అంటూ. అప్పటికే ఆయనకు చాలా తెలుసు. అయినా వారి నోటనే విషయాలు తెలుసుకోవాలని అడిగాడు. నాగిరెడ్డి వివరాలు చెప్పాడు.

"ఇప్పుడు రావలసిన చందాలుఎవరూ ఇవ్వకుంటే, ఈ రెండు వేల రూపాయలు ఎవరు భరించుకోవాలి?"

నాగిరెడ్డి నోరెత్తలేదు.

"వచ్చిన డబ్బులు ఖర్చు పెట్టి గ్రామంలో ఏవైనా చిన్న పనులు చేస్తే ఆ తర్వాత మరింత డబ్బు చందాలుఇచ్చి, పెద్ద పనులకు ప్రోత్సహిస్తారు. 'బిచ్చగాడు- పేలపిండి' కథలాగా మీ స్థాయి ఏమిటి? మీ దగ్గరున్న డబ్బేమిటి? మీరు చేయదలచిన పని ఏమిట్రా? దీనివల్ల మునిగేది ఎవరు? ఎవరి తోవ వాళ్ళు చూసుకుంటారు. నిన్నటి దాకా రమేష్ అప్పారెడ్డికి విరోధి. ఇప్పుడు అతడివైపు తిరిగాడు. మరుగువాడు కట్టడంలో అతన్ని తన వైపు తిప్పుకోడానికి ప్రయత్నించి సఫలీకృతుడయ్యాడు. మీలోనే చీలికలు కల్పించాడు. చివరకు నీవు చిప్ప తీసుకుంటావు ఒంటరిగా!" అన్నాడు కోపంగా.

"వాళ్ళంతా నన్ను రంగంలోనికి దించారు బాబాయ్!"




"నువ్వు పసిపిల్లాడివేమిట్రా? దున్నపోతులాగున్నావు. ఎవడో దిగమన్నాడని నీవు దిగుతావా? ఫలితం గురించి ఆలోచించడం లేదా? ఇంతకు ముందే అప్పారెడ్డికి మనం వైరులం. వాడు ఇది అవకాశం తీసుకొని మనల్ని పైకి రాకుండా చేయడానికి ప్రయత్నిస్తాడు" అన్నాడు రామయ్య.

రావలసిన చందాలు వసూలు చేయడానికి కొందరిని తోడు తీసుకొని తిరిగాడు. వసూలు చాలా తక్కువయింది. కొందరు ఎప్పుడో వీలున్నప్పుడు ఇస్తామన్నారు. అవి ఎలాగూ వచ్చేవి కాదని తెలుస్తున్నది. వచ్చిన మొత్తం లెక్కలేస్తే మూడొందలు అయింది. మూడు వేల వాగ్దానాలకు మూడు వందలు వచ్చింది. అప్పు తెచ్చిన పదిహేను వందలు తీర్చాలి. ఈ మూడు వందలు ఏ మూలకు వస్తాయి? మిగిలిన మొత్తం ఎక్కడ తేవాలి?

వీరితో కలిసి ఉండటం వల్ల తనకు ఏమీ ఒరగదని తెలుసుకున్నాడు రమేష్. ఏ పనికీ ముందు నాయకత్వం ధనుంజయ్‌కి, నాగిరెడ్డికి అప్పగిస్తారు గాని తన పేరు ఎవడూ ప్రతిపాదించడు. తనను స్తరించేవాడు వారిలో ఎవడూ లేడు. ఈ సమయంలో వారిలో చీలికకు మునసబు ద్వారా ప్రయత్నం చేశాడు ప్రెసిడెంటు. రమేష్‌ను పక్కకు లాగడం ద్వారా కొంత బలహీనతకు వారిని గురి చేయవచ్చు. అయినా నాగిరెడ్డి బలంగా నిలబడితే అతని ముఠా అతడికుంటుంది. రమేష్, ధనుంజయ్‌లాంటి వారినిపక్కకు లాగితే నాగిరెడ్డి ఏమీ చేయలేడు. ధనుంజయ్ ఇప్పటికే రెండు పడవల మీద కాళ్లు వేసి, ఎవరికీ చెడ్డ గాకుండా తిరుగుతున్నాడు. కొంత చెడ్డగా ఉన్నది రమేష్! అతడిని ఆకర్షించి లాగివేయవచ్చు. నాగిరెడ్డిని మాటలతో లొంగదీయడం ప్రెసిడెంటుకు చేతగాదని తెలుసు. రమేష్‌కు మరుగుదొడ్ల కాంట్రాక్ట్‌లో భాగం ఇచ్చాడు. అందులో మిగిలింది ప్రెసిడెంటుకూ, రమేష్‌కు చెరిసగం లాభం! ఆ విధంగా చీల్చి తన పనికి వాడుకోవచ్చు. పైగా దానం కేసు సులభంగా తేలిపోతుంది. రమేష్ అందులో ఒక ఫిర్యాది. ఇవన్నీ ఆలోచించి కృష్ణయ్య పంతులు ద్వారా హితబోధ చేయించి ఇటువైపు తిప్పుకున్నాడు. ఆ విషయం ముందే చూచాయగా తెలిసినా నాగిరెడ్డి పట్టించుకోలేదు. అతడు ఉన్నా, ఊడినా తనకు వచ్చే నష్టం ఏమీ లేదనుకున్నాడు.

నాలుగు రోజుల్లో పంతులమ్మ డబ్బిస్తానన్నాడు నాగిరెడ్డి. ఉన్నది మూడు వందలు; మిగిలిన వారు బంధువులు కాబట్టి ఏదో చెప్పి తర్వాత ఇవ్వవచ్చు. ఆమె కేవలం జీతం డబ్బుల మీద బతుకుతున్న వ్యక్తి. ఆమె డబ్బు ఇవ్వాలని మరో రెండు వందల కొరకు ప్రయత్నం చేశాడు. వెంటనే దొరకలేదు.

నాలుగు రోజుల తర్వాత ఉన్నడబ్బు తీసుకుని సాయంకాలం ఇంటికి వెళ్ళాడు. ఇంటివద్దే ఉంది పంతులమ్మ.

"మొన్న మీతో ఐదువందలు తీసుకున్నాను. కాని కారణాలవల్ల డబ్బు అందలేదు. మీకు చెప్పిన సమయానికి ఇవ్వకుంటే మీకు ఇబ్బందిగా ఉంటుందని ఉన్నవరకు తెచ్చాను. మూడు వందలున్నాయి. మిగిలిన రెండు వందలు తర్వాత ఇస్తాను" అంటూ డబ్బు ఇచ్చాడు.

"రమేష్ ఊళ్ళో ఉన్నాడా? కన్పించడం లేదు"

"ఉన్నాడు. కాని ఇప్పుడు నాతో కలిసి తిరగడంలేదు"

"అంటే నిన్న జయరావు చెప్పింది నిజమేనన్నమాట"

"ఏం చెప్పాడు?"

"రమేష్ ప్రెసిడెంటు వైపు తిరిగి అతడితో లాలూచీ అయ్యాడని చెప్పాడు. నిన్నటిదాకా ప్రెసిడెంటును తిట్టేవాడు ఎలా కలిశాడు?"

"ఆ వివరాలు కూడా మీరే తెలుసుకోండి. లేదా పిలిచి అడగండి. ఏం చెబుతాడో!" అన్నాడు నవ్వుతూ నాగిరెడ్డి.

"మిమ్మల్ని అనవసరంగా ఇరికించాడు కదా?" అంది సానుభూతిగా.

"ఒకడు ఇరికించేదేమిటి? చివరకు వాడే అల్లరి పట్టిపోతాడు" అంటూ లేచి బయలుదేరడానికి సిద్ధపడ్డాడు.

"నేను చందా ఇస్తానన్నానుకదా! ఆ రెండువందలూ చందాకింద వేసుకోండి" అంది ఆమె లేస్తూ.

నాగిరెడ్డి నిరాశగా నవ్వాడు. "గ్రామంలో జనానికి అవసరం లేని రోడ్డు మీకెందుకండీ! అవసరంలేదు. రెండు మూడు రోజుల్లో ఇస్తానులెండి" అంటూ ముందుకు కదిలాడు.

జయరావు కూడా అటుగా వస్తే ఇద్దరూ కలిసి గ్రామంలోకి దారి తీశారు.

"దానంగాడు మళ్ళీ మీసాలు తిప్పుతున్నాడు" అన్నాడు జయరావు.

"మీసాలు పెరికి వేయండి. ఇక ఎంత మాత్రం భయపడకండి. జరిగేదేదో చూసుకుందాం" అన్నాడు నాగిరెడ్డి కటువుగా.




మరుగుదొడ్డి కట్టే ప్రాంతానికి వెళ్ళి పల్లెలో నుండి వస్తూ బయట మేరీని చూసి పలకరింపుగా నవ్వి ఇంటివద్దకు వచ్చాడు రమేష్.

"ఎక్కడికి బయలుదేరారు?" అంది పలకరింపుగా. లోనికివచ్చి కూర్చున్నాడు. మరుగుదొడ్లు కట్టిస్తున్నానని చెప్పాడు.

"ఇదేమిటండీ! నిన్నటిదాకా ఎవరి నయితే తిట్టారో అతడితోనే కలిసి పని చేస్తున్నారు?"

"గ్రామ విషయాల్లో అనవసర తగాదా ఎందుకని కలిశానండీ !" యువకులందరూ సంఘమంటూ చెప్పుకోవడమేగానీ, ఒక్క పనీ చేయరు. చందాలు పోగుచేసుకుని తింటున్నారని జనం అంటున్నారు. అందువల్ల పనులు చేసేటప్పుడయినా మన సహకారం ఇవ్వడం మంచిదనుకున్నాను".

"ఆ విధంగా అందరికి నచ్చచెప్పి అందరూ కలిసి అతడిని బలపరిస్తే గ్రామం ఐక్యంగా ఉంటుంది కదా! మీరొక్కరే పక్కకుపోతే, వారికి ద్రోహం చేయడం కాదా?"

"ఎందుకవుతుంది. వారేదైనా ఘన కార్యం చేస్తూఉండి విడిచి వెళ్ళితే

ద్రోహం గాని!"

"రోడ్డు కార్యక్రమమేదో తీసుకున్నారు గదా! అందులో నాగిరెడ్డి స్వంత డబ్బు ఖర్చు పెట్టాడు కూడాను"

"వాడో తలతిక్క వెధవ. గ్రామంలో పనులు జరిగేటప్పుడు అందరం కలిసి చేయాలి. చేయనప్పుడు డిమాండు చేసి ప్రయత్నించాలి. నిన్నటి దాకా ప్రెసిడెంటు చేగులేదు; ఎదిరించాము. నేడు చేస్తున్నాడు; కలిసి పని చేయాలి. రోడ్డు వేయడమంటే జనాన్ని బెదిరించి చందాలు వసూలు చేయడం కాదు."

"జనాన్ని బెదిరించి కూడా వసూలు చేస్తున్నారా?"

రమేష్ మాట్లాడలేదు. కాసేపాగి అన్నాడు.

"మీరయినా ప్రెసిడెంటుతో మంచిగా ఉండడం మంచిది. అతడు సక్రమంగా ప్రవర్తిస్తున్నప్పుడు తగవు లెందుకు? సహకరించాలిగాని."

"బాగుంది. ప్రెసిడెంటుతో గాని, ఇంకొకరితోగాని నాకు తగ వెందుకు? అసలు ప్రెసిడెంటుకు,స్కూలుకు సంబంధ మేమిటి? ఈ మధ్య సమితిలో విచారించాను స్కూల్ మీద ప్రెసిడెంటు అధికారమేమిటని? ఏమీ లేదన్నారు. కావలసిన వస్తువులుంటే పరిషత్తుకు ఇండెంట్ పెట్టుకోమన్నారు.ఆ విధంగానే చేశాను. అవి ఎప్పుడయినా రానివ్వండి. ప్రెసిడెంటు వద్దకు పోవలసిన అవసరం నాకు లేదు. అయినా పిలిపించినపుడల్లా వెళ్ళాను. అతడు చేసిన విధానం కూడా మీకు చెప్పాను. ఆ రోజు మీరే అతడిని తిట్టారు. ఈ రోజు ఇంత తొందరగా అతనిలో మీకు మంచితనం కన్పించడం విడ్డూరమే!"

రమేష్ నవ్వాడు. "ఈ మధ్య అంటే దానంతో తగవు అయిన ముందు రోజు ప్రెసిడెంటు మిమ్మల్ని పిలిపించాడట. మీరు రానేలేదట. ఆ విషయం మొన్న బయటకు వచ్చింది. 'రాకపోవడమంటే చాలా అహంకారంగా ఉంది' అనుకుంటున్నారు."

"ఔను రాలేదు.ఇక ఎప్పుడు పిలిచినా రాను. అవసరం కూడా లేదు. అతడికి అవసరమైతే స్కూలు వద్దకు వస్తాడు. ఆ రోజు నాగిరెడ్డిని అడిగాను–వెళ్ళమంటారా అని. వెళ్ళవద్దన్నాడు. ఇకముందు ఏం తెలివితక్కువ పనులు చేసినా వెంటనే తనకు తెల్పమన్నాడు" అంది. ఆమె మాటల్లో కొంత అహంకారం పెరిగిందనుకున్నాడు రమేష్. అంటే నాగిరెడ్డిని వెనుక సహకారంగా నిలుపుకున్నదన్న మాట.

అందువల్లనే అంత ఖచ్చితంగా మాట్లాడుతున్నది. 'నాగిరెడ్డి ఈ ఊరికే హీరో అయ్యాడు; ఈమెకు మాత్రం కాకుండా ఎందుకుంటాడు!'అనుకున్నాడు. పైకి అనలేక "వెళ్తానండీ" అంటూ లేచి వెళ్ళాడు.

మధ్యలో జయరావు ఎదురయ్యాడు, గాని ఒకరినొకరు పలుకరించుకోలేదు. 'ఈ వెధవలంతా కేవలం నాగిరెడ్డిగాడికి బానిసలు' అనుకున్నాడు కసిగా! ప్రెసిడెంటుతో పోటీగా ఉన్నప్పటికంటే, కలిసి ఉన్నప్పుడే గౌరవం పెరుగుతున్నది. తాను చేసిన పని తప్పుకాదని సమర్థించుకున్నాడు.

మరో రెండు రోజుల తర్వాత ధనుంజయ్ వచ్చాడు. అతని గురించి నాగిరెడ్డి పట్టించుకోలేదు. 'ఏమైనా విషయ ముంటే అతడే వచ్చి చెబుతాడు, లేకుంటే

ఇంతటితోసరి' అనుకున్నాడు. ధనుంజయ్ వచ్చిన వార్త తెలిసి రమేష్ అతని ఇంటి వద్దకు వెళ్ళి కలిశాడు.

"బాగున్నావురా ధనుంజయ్! ఏమిటి విశేషాలు. కన్పించడంలేదేం?"

ధనుంజయ్ విషాదంగా నవ్వాడు. "నీవు చేసిన పని మంచిదికాదురా! అనవసరంగా అందర్నీ అల్లరి పట్టించావు. మావెంట తిరుగకున్నా తటస్థంగా ఉంటే మర్యాద ఉండేది కదా?" అన్నాడు.

"నేను చేసినదానిలో నాకు తప్పు కనిపించలేదురా! గ్రామ అభివృద్ధి పనులు ఈ విధంగానయినా చేయగలుగుతున్నాను. గ్రామానికి ఉపయోగపడటమే నాకు కావలసింది."

"నీవు గ్రామానికి కాదురా? అప్పారెడ్డికి పుపయోగపడుతున్నావు. ఆ గోడలు ఇసుకతో కడుతున్నారుగానీ సిమెంటుతో కడుతున్నారా? రేపు వర్షానికి నాని కూలి పోతాయి. ఏదైనా బర్రె వీపు రుద్దిందంటే అవి నిలబడతాయా? రేపు వర్షాకాలంలో దాని కిందపడి ఎవరో ఒకరు చావక మానరు. అప్పుడు నీ బతుకు బయట పడుతుంది. సరే నీ చావు నీవు చావు! మూడువేలకు పైగా ఖర్చుపెట్టి నేను చేయవలసింది చేశాను. ఇంతకు మించి నేను ఏమీ చేయలేను."

రమేష్ మండిపడ్డాడు. "కూలిపోయి నప్పుడు ఆలోచిద్దాంలేరా! పైన నిలబడి అందరూ సలహా ఇస్తారు. దమ్ముంటే నీవు కూడా కలిసి పనిచెయ్యి! అప్పుడు నీతులు చెబితే నేనూ వింటాను. మీ నాన్న అప్పారెడ్డి వైపు ఉంటే నీవెందుకు వ్యతిరేకిస్తావురా?"

"ఒరేయ్! నీకూ, నీ రాజకీయానికి ఒక నమస్కారంరా బాబూ! నేను ఎవరితోనూ కలిసి పనిచేయను. అసలు ఈ గ్రామంలో లేకుండా వెళ్ళిపోవడం మంచిదనిపిస్తున్నది. ఏదో ఉద్యోగం చేసుకుంటూ ఎక్కడో ఒకచోట హాయిగా కాలం గడుపుతాను. అనవసరంగా చందాలు రాబట్టడం నా పొరపాటని తెలుసుకున్నాను. బుద్ధి వచ్చింది ఇక కలుగజేసుకోను" అన్నాడు ధనుంజయ్.

రమేష్ వెళ్ళిపోయాడు. నాగిరెడ్డిని కలిసి ధనుంజయ్ జరిగింది చెప్పి "తొందరగా సాధ్యంకాదురా. వేస్తాను మొత్తానికి. కానీ ఇప్పుడుకాదు" అన్నాడు. కాదని నాగిరెడ్డికీ తెలుసు. ఆ మాట చెప్పలేక పోతున్నాడనీ తెలుసు.

"తర్వాత కార్యక్రమమేమిటి?" అన్నాడు నాగిరెడ్డి అతనినోటనే విషయం పలికించాలని.

"మీరే ఆలోచించండి. ఏం చేద్దామన్నా మీతోపాటు నేను కూడా కలిసివచ్చి పని చేస్తాను."

"అందరం కలిసి ఆలోచిద్దాం. మిగిలిన వారున్నారు కదా!"

"నీవు చెప్పింది వాళ్ళు వింటారు. నీవే నిర్ణయించు."

"అది మంచి పద్ధతి కాదు. అందర్నీ కలిపి ఆలోచిద్దాం. సాయంత్రం ఆరు గంటలకు రా!" అన్నాడు నాగిరెడ్డి.

సాయంత్రం ఆరు గంటలకు పది హేను మంది వచ్చారు. ధనుంజయ్ రాలేదు. అతడుకూడా దిగజారుతున్నాడని వాళ్ళు ఊహించారు.

"ఇంకా ఎవరైనా దిగజారేవారు న్నారా?" అన్నాడు నాగిరెడ్డి నవ్వుతూ.

పదిహేను మంది దిగజారారు. ఇంక దిగజారేది ఎవరూ లేరు, చేతనైతే ఎగ




జారడం తప్పు" అన్నాడు చాకలి రాముడు.

"ఇప్పుడు మనం చేసే పని ఏమీ లేదు. అనవసరంగా డబ్బూ,మనుషులనూ చీకాకు పరిచారు మహానుభావులు. ఏదైనా చేయదలిస్తే తర్వాత ఆలోచించు కుందాం" అన్నాడు నాగన్న.

"అదే మంచిది" అన్నాడు నాగిరెడ్డి. ఆ పరిస్థితిలో ఏం మాట్లాడినా లాభం లేదని ఎవరంతకు వాళ్లు లేచి ఇళ్లకు సాగారు.

* * *

"మీ పని ఏమయిందిరా?" అన్నాడు మరుసటి రోజు రామయ్య. జరిగిన వివరాలు చెప్పాడు నాగిరెడ్డి.

"మనల్ని ఏకాకుల్ని చేయడానికి అప్పారెడ్డి పన్నిన ఎత్తుగడరా ఇది. ఈ వెధవలు చేతగాని వాళ్ళని ముందే తెలుసు. వారి మాటలు నమ్మికొని రంగంలోకి దిగి నీవూ, నీ ద్వారా మేమూ అల్లరిపడవలసి వచ్చింది. ఇప్పుడయినా నీవు తక్షణం అప్పారెడ్డికి వ్యతిరేకంగా కొన్ని పనులు తీసుకోవాలి. అయితే మనం వ్యతిరేకంగా చేసినట్లు గాకుండా, ఫలానా పని చేద్దామని ముందు అప్పారెడ్డితో మాట్లాడు. వాడు ఎలాగూ కలిసి రాడు. ఆ తర్వాత మనం స్వంత ప్రయత్నం చేద్దాం "

రామయ్య మాటలు నాగిరెడ్డికి సంతోషం కలిగించాయి. రోజుకు ఒకడు దిగజారిపోతుంటే అతడికే నిరాశగా ఉంది.

"నీవు నిలబడితే నేను పని చేయిస్తాను బాబాయ్!"

"నేను ఉండక ఎక్కడికి పోతాను? ధనుంజయ్, రమేష్ లాంటి వాళ్లే కాదులే! అప్పారెడ్డి దగ్గరకు వెళ్ళి మాట్లాడు. నేను రావడం బావుండదు. పూడిక బావుల్ని బాగుచేద్దామని అడుగు"

ప్రెసిడెంటును కలుసుకున్నాడు నాగిరెడ్డి. రమేష్, అందరూ అక్కడ ఉన్నారు. నాగిరెడ్డిని చూసి 'ఎందుకొస్తున్నాడా?' అని ఆశ్చర్యంగా చూస్తున్నారు. ప్రెసిడెంటు మర్యాదగానే ఆహ్వానించాడు, వచ్చేవాడిని వ్యతిరేకించడమెందుకని.

"మరుగుదొడ్లు పూర్తయినట్లేనా బాబాయ్?" అన్నాడు పలకరింపుగా.

"ఆ! కాబోతున్నాయ్. అయినా రాజు తలచుకుంటే దెబ్బలకు కొదవా?" అన్నాడు మునసబు నవ్వుతూ.

"పనిలో పని, గ్రామంలోని బావుల్లో పూడిక తీయిస్తే మంచి నీటికి గుండ్లకమ్మకు పోవలసిన పని ఉండదు కదా! ఊరంతటికీ స్కూలువద్దనున్న ఒక్క బావిలోనే ఇప్పుడు నీళ్ళూరుతున్నాయి. అవి కూడా కొద్దిగానే! పూడిక తీయిద్దాం. మీతో పాటు నేను కూడా కలిసి వస్తాను" అన్నాడు నాగిరెడ్డి.

"ఇప్పుడవన్నీ సాధ్యం కాదురా! దేశాన్నంతా బాగు చేయడానికి ఒకేసారి ప్రయత్నిస్తే ఎట్లా? అవకాశమున్నప్పుడు చేస్తుంటాము. ఈ సంవత్సరానికి మరుగుదొడ్లు చాలు. ఆ తర్వాత చూద్దాం" అన్నాడు ప్రెసిడెంటు "రోడ్డు సంగతి ఏమయింది?"

"నాకు మాత్రం ఏం తెలుసు? రమేష్కు, ధనుంజయ్కే తెలియాలి. నాబాధ్యత డబ్బు తీసుకు రావడం. మిగిలిన విషయాలు నేను కలుగచేసుకోలేదు."

కొంతసేపు ఎవరూ మాట్లాడలేదు.



నాగిరెడ్డి చల్లబడ్డాడనుకున్నాడు ప్రెసిడెంటు. అతడు ఇక ముందుకు రాలేదని ఆనందం కలిగింది.

"వర్షాకాలం వస్తున్నది. ఈలోగా పూడిక తీయిస్తే మంచిదే కదా బాబాయ్! సంవత్సరం దాకా ఎందుకు ఆగాలి ?" అన్నాడు నాగిరెడ్డి.

"ఇప్పుడా ప్రసక్తే లేదు. ఇరవై వేలు ఖర్చయ్యాయి. ఈ మొత్తం ఆదాయం రావాలంటే, పది సంవత్సరాలు పడుతుంది పంచాయతీకి" అన్నాడు ప్రెసిడెంటు.



నాగిరెడ్డి ఇంటికి వచ్చి రామయ్యతో వివరాలు చెప్పాడు.

"అయితే మన కుర్రకారునంతా సాయంత్రం తీసుకరా! మనం పూను కొని పూర్తి చేద్దాం" అన్నాడు రామయ్య.

ఈలోగా నాగిరెడ్డి కూడా ప్రెసిడెంటుతో కలిశాడని గ్రామంలో పుకారు పుట్టింది. ఈ పుకారు విని గంగవెర్రు లెత్తిన జయరావు, రత్నం నాగిరెడ్డి వద్దకు పరుగెత్తుకుంటూ వచ్చారు. నాగిరెడ్డి అప్పారెడ్డితో కలిస్తే, దానం తమను గుండ్లకమ్మలో ముంచే వరకూ నిద్ర పోడని వారికి తెలుసు.

"మీకు ద్రోహం చేసే పని ఏదీ నేను చేయను. నా మాట నమ్మండ్రా?" అన్నాడు నాగిరెడ్డి.

సాయంత్రం కుర్రకారునంతా తిరిగి సేకరించాడు నాగిరెడ్డి. ఆ సమావేశానికి రామయ్య కూడా వచ్చాడు. "అనవసరంగా ఆవేశపడకండి. క్రమశిక్షణతో పని చేయండి. ఆడంబరాలు పలకకుండా, పని చేసి చూపించండి" అన్నాడు వారితో. తర్వాత తను తీసుకునే కార్యక్రమాలు చెప్పి "ఒరేయ్! మీరందరూ కలిసికట్టుగా ఉంటే, వాళ్ళందరు ఏకమైనా ఏమీ చేయలేరు. మీరు చీలిపోతే వారు మధ్యలో దూరి కలుసుకోకుండా చేసి, నాశనం చేస్తారు" అన్నాడు. అందులో మొదటి సుండీ ప్రెసిడెంటుకు



వ్యతిరేకమయిన వారు కొందరున్నారు. ఈ సమయంలో లొంగిపోతే దెబ్బ తింటామని వారికి తెలుసు. రామయ్య నుండి అంత హామీ రావడంతో వారంద రికీ హుషారు కలిగింది. పొద్దున్నే కలిసి వచ్చి, పూడిక తీయడానికి సిద్ధ పడతామని చెప్పి వెళ్ళిపోయారు.

ఉదయం ఏడు గంటలకు పాతిక మంది దాకా మాలపల్లి రచ్చబండ వద్ద హాజరయ్యారు. పలుగులు, పారలు, తట్టలు తెచ్చారు. రాత్రంతా కష్టపడి రాసిన బోర్డును చెట్టుకు కట్టారు. అందులో "మాలపల్లి బావి పూడిక ఎత్తి వేయుట. గ్రామయువకుల శ్రమదానం" అని ఉంది. వీళ్ల చేతుల్లో గడ్డపారలు చూసి, దాసం తలుపు తీయలేదు. పల్లె లోని స్త్రీ పురుషులు ఆసక్తిగా చూస్తు న్నారు. పిల్లలు ఎగురుతున్నారు– అదే మిటో వారికి అర్థం గాకున్నా! పల్లెలోని యువకులు, ఆడవాళ్ళు తామూ కలిసి వస్తామన్నారు. వచ్చే వారిని ఎవరినీ వద్దనడం లేదు. మొత్తం నలభై మందికి పైగా తోడయ్యారు.

ఇంటికి వెళ్తున్న నాగిరెడ్డిని పిలిచింది పంతులమ్మ.

"చాలా కష్టపడుతున్నారండీ" అంది ప్రశంసిస్తూ. అతడు నవ్వి ఊర కున్నాడు.

"నిన్న ప్రెసిడెంటు ఇంటి వద్దకు వెళ్లారని తెలిసి జయరావు చాలా బాధ బడ్డాడు – మీరు కూడా వారితో కలిసి పోయారని".

"సహాయం అడుగుదామని వెళ్ళాను. ఎలాగో సహకరించరనుకోండి. అయినా మాట మీద వేశాము".

ఇంటికి వెళ్ళి తట్టనిండా అన్నం, కూరలు తెచ్చాడు పది గంటలకు. ఆపా టికి గ్రామమంతా తెలిసిపోయింది. దాసం పరుగుతో ప్రెసిడెంటు ఇంటి ముందు వచ్చిపడ్డాడు. వీడేదో తిరిగి కార్య క్రమాలు తీసుకొని తన విధానాన్ని బెడిసి కొట్టడానికి ప్రయత్నం చేస్తున్నా డనుకున్నాడు ప్రెసిడెంటు. వచ్చేవారుంటే తనూ శ్రమదానానికి కేకవేసి ఏదో ఒక పని చేసేవాడే! కానీ ఎవరూ వస్తారన్న నమ్మకం లేదు. డబ్బులిచ్చి కార్య క్రమాలు తీసుకోవాలి.

"పుండు పుట్టించారు అప్పారెడ్డీ!" అన్నాడు బీడీ పీకుతూ మునసబు.

"రామయ్య ముందు నిలబడ్డాడు. ఈ దెబ్బతో ఏమాత్రం నిర్లక్ష్యంగా వున్నా కింద పడిపోతామని తెలుసుకున్నాడు. కుర్రకారునంతా వెంటేసుకుని సాగాడు" అన్నాడు ప్రెసిడెంటు.

"బావి తవ్వనీ! రాత్రి మనం పూడ్చేస్తేసరి" అన్నాడు దాసం. ఎవరూ నోరెత్తలేదు. రమేష్ మాత్రం అటూ – ఇటూ చెడిపోయాననుకున్నాడు. వారి వెంటనే ఉంటే కొంతయినా మర్యాదగా వుండేది.

పదకొండు గంటలకు ఇళ్ళకు వెళ్లామ చల్లబడ్డ తర్వాత తిరిగి రావచ్చని. రామయ్య కూడా వారితో పాటు వెళ్లాడు. జయరావు, నాగిరెడ్డి మేరీ ఇంట్లోకి వెళ్లారు.

ఆమె భోజనం చేస్తూ, వారిని చూసి "రండి. భోజనం చేద్దాం" అంది నవ్వుతూ. తిన్నామని చెప్పి మంచం వాల్చుకొని కూర్చున్నారు. పళ్ళెం కడిగి పెట్టివస్తూ "అయినా మా యిండ్లలో అన్నం తినరుగా!" అంది నవ్వుతూ.





ఆమె నవ్వుకు జయరావు శృతి కలిపి "మన ఇళ్లలో అన్నం తినరు; కాని, గొడ్డు మాంసం బాగా తింటారు. ఒక రోజు వండిపెట్టమ్మా!" అన్నాడు.

"నేను కొంచెం సేపు పడుకొని వస్తాను" అంటూ జయరావు వెళ్లి పోయాడు. నాగిరెడ్డి అలసటవల్ల కొంచెం సేపటిలోనే నిద్రపోయాడు. కుర్చీలో కూర్చొని నిద్రపోతున్న నాగిరెడ్డినిచూస్తూ గడ్డం కింద చెయ్యి పెట్టుకొని ఆలోచిస్తు న్నది మేరీ. గ్రామంలో ముందు నిలబడి సమస్యలు తీసుకొని పోరాడడానికి ముగ్గురు వచ్చారు. వారిలో ఒకరు ప్రెసి డెంటుకు పోటీ చేసిన వ్యక్తి. రెండవ వ్యక్తి ప్రెసిడెంటు వర్గంలోని వ్యక్తి కొడుకు. మూడో వ్యక్తి ప్రెసిడెంటుకు మొదటి నుంచీ వ్యతిరేకంగా ఉండి, పరి స్థితులవల్ల గత ఎన్నికలలో కలిసి పని చేసిన కుటుంబానికి చెందిన వ్యక్తి. ఏదేదో చేస్తానని ప్రగల్భాలు పలికిన రమేష్ చివరకు ప్రెసిడెంటు కిందకు వెళ్లాడు. సొంపైన మాటలు మాట్లాడుతూ ఆకట్టుకోదలచిన ధనుంజయ్ జారి పోయాడు. చివరకు రంగంలో నాగిరెడ్డి నిలిచాడు. పైగా ప్రెసిడెంటుకు శత్రు వుగా తయారయ్యాడు ఇతడు వారి పక్క చేరితే జయరావు అన్నట్లు "మమ్మల్ని ఊర్లో కాపురం చేయ నివ్వరు"

దీర్ఘంగా నిట్టూర్చింది. వారి సంగ తేమోగానీ తనను కుక్కలా వెంటాడే వాడు ప్రెసిడెంటు. ఏ అర్ధరాత్రో ఇంటి మీద దాడిచేసినా దిక్కేమిటి? తనను ఎది రించే వ్యక్తి ఒకడున్నాడనీ, అతడు పంతులమ్మ సహకారి అని తెలిసిన తర్వాత తనను ఇంటికి పిలవడం కూడా మానుకున్నాడు. వారంరోజులలో నాలుగు సార్లు ఇంటికి పిలిపించిన పెద్దమనిషి నాలుగు నెలలుగా ఒక్కసారిగా పిలవ లేకపోయాడు. కారణం? దానం ఏమ య్యాడో కళ్ళతో చూశాడు. అదే చివ రకు తనకు రక్షగా అయింది.

"ఏమిటే కూర్చున్నావ్? కొంచెం సేపు పడుకోకూడదూ" అంది సుజా తమ్మ బయటినుండి వచ్చి.

మేరీ తలెత్తి చూసి "టైమయిందిలే! ఇక వెళ్ళాలి. పడుకోవడమేమిటి?" అంది. గడియారం ఒంటిగంట చూపుతున్నది. లేచి పొయ్యి మీద గిన్నె పెట్టి కాఫీకి నీళ్ళు పోసింది.

"ఊళ్లో ఏమేమో అనుకుంటున్నా రట" అంది సుజాతమ్మ.

"ఎవర్ని గురించి?"

"మనల్ని గురించే! మనం నాగిరెడ్డికి అనుకూలంగా ఉన్నామట. ప్రెసిడెంటుకు వ్యతిరేకమట. అందువల్లనే ప్రెసిడెంటు బదిలీ చేయిస్తాడట!"

"చేయించనీ! బోడి! ఇంతకంటే నికృష్టమైన ఊరు ఈ సమితిలో ఎక్కడా ఉండదు. ఇతడి పుణ్యం వల్లనయినా మంచి ఊరు చూడవచ్చు"

"అదికాదే! వాళ్ళందరూ మరో విధంగా ఊహించుకుంటున్నారు".

"చావనీ! ఎవరో తలలు బద్దలుకొట్టుక పసుంటే మనం ఏడుస్తామా? కోళ్ళన్నీ ఒకే విధంగా కూస్తాయిగానీ, కుక్కలన్నీ ఒకే విధంగా మొరగవు"

"మరీ అంత తెగించి మాట్లాడకు. నలుగురిలో నవ్వులపాలవుతాము"

"ఆ! దానం విషయంలో ఆయన అడ్డు రాకుంటే ఈ పాటికే నవ్వుల పాలయ్యేవాళ్ళం. నీకు రక్షణ ఇచ్చేవారిని

గురించి నీవు నీచంగా ఊహించకు. ప్రెసిడెంటు నా చెయ్యిపట్టుకున్న సంగతి తెలిసీ పిళ్ళెవరూ మాట్లాడలేదు. ఈరోజు ఈ కాకి కూతలు ఎందుకు?" అంది ఆవేశంగా వణుకుతున్న కంఠంతో!

సుజాతమ్మ మరింకేమీ మాట్లాడలేదు. నాగిరెడ్డి ఆ యింటికి రావడం, పోవడం ఈమధ్య ఎక్కువ కావడంతో నలుగురూ నాలుగు రకాలుగా ఊహిస్తున్నారు. పైగా పని గట్టుకొని ప్రచారం చేసేవారుండడం వల్ల వేగంగా పాకిపోతున్నది. ఈ విషయాలు నాగిరెడ్డికి తెలుసో తెలియదో — పల్లెలో జయరావు కొరకు వచ్చినప్పుడల్లా ఆ యింటికి రావడం కొంతసేపు అలవాటయింది. మేరీ ఇవన్నీ లెక్కచేయ లేదు. ఆ గ్రామంలో తాను నిలబవాలంటే నాగిరెడ్డి ఒక్కడే తనకు రక్ష అన్న విషయం ఆమెకు పూర్తిగా తెలుసు. పైగా ఇంతవరకూ తనతో అసభ్యంగా ప్రవర్తించకపోవడమటుంచి, ఈ రోజుకూ గౌరవనీయమైన పద్ధతిలోనే ప్రవర్తిస్తున్నాడు: 'నీవు' అని ఇంతవరకూ పిలవలేదు. అతడిని అనుమానించి దూరం చేసుకోవడమెందుకు? పైగా మరింత దగ్గరగా ఎందుకు రావడంలేదా అని మాత్రమే ఆలోచిస్తున్నది. ఒక్కొక్కపుడు తన ఆలోచనలు తనకే అసహ్యం వేసినా జనం తమ ఇద్దరిని గురించి అనుకునే మాటలు తమ విషయంలో నిజం కానందుకే ఎక్కువ బాధపడింది.

యవ్వనం తోడును ఆశిస్తుంది. తాను కూడా ఆశించడంలో తప్పేమిటి? పైగా నిజాయితీ కలిగినవాడిని ఆశించడం! అయితే ఆ భావం తాను వెల్లడిచేయలేక పోతున్నది. అటువైపు నుండి కనీసం గుర్తింపు కూడా లేనట్లు నాగిరెడ్డి నమ్రత గల స్నేహితునిలా ప్రవర్తిస్తున్నాడు. నాగిరెడ్డిని ఆశించడం ఎండమావిలో నీటిని వెతకడమని తనకు తెలుసు. అన్నీ కలిగిన వ్యక్తి అతడు. ఏదీ లేని వ్యక్తి తాను. ప్రేమకు అడ్డేలేదని చాలాసార్లు తాను పాఠం చెప్పింది. ఈ రోజు అతనిని తాను ఆశించడం కలలోనేననీ, ఇలలో సాధ్యం కాదనీ తెలుసు. ఆ భావాన్ని అణచుకోవాలని ప్రయత్నించినా మరింత విశృంఖలంగా విజృంభిస్తున్నది.

టీ తాగి బరువుగా ఊపిరి పీలుస్తూ తలవంచుకుని స్కూలుకు వెళ్ళింది.

మధ్యాహ్నం మూడు గంటలనుంచి బావి తవ్వడం ఆరంభమయింది. సాయంత్రం ఏడుగంటలదాకా తవ్వారు. రేపటికి ఆ బావి పూర్తవుతుంది. అప్పటికి నాగిరెడ్డికి అయిన ఖర్చు పాతిక మందికి ఒకపూట అన్నం ఖర్చు. దాని వల్ల రావలసిన దానికంటే ఎక్కువగానే విలువ వచ్చింది.

రాత్రి దానం తాగి తిరిగి పల్లెలో కేకలతో, అరుపులతో కాలక్షేపం చేశాడు. కానీ ఎవరిమీదకు రావడంగానీ, ఎవరినీ తిట్టడంగానీ చేయలేదు. దానం అతిగా ప్రవర్తిస్తే నలగతన్నమని ముందుగానే నాగిరెడ్డి చెప్పడంతో యువకులు సిద్ధంగానే ఉన్నారు. ఆ అవకాశం దానం వారికి కల్పించలేదు.

మరునటిరోజు ఉదయం బావి తవ్వుతుండగా రామయ్య కొరకు మునసబు వచ్చాడు. వచ్చి బావిచుట్టూ చూసి బాగుందని మెచ్చుకొని "రామయ్యా! ప్రెసిడెంటు రమ్మంటున్నాడు; అక్కడిదాకా వస్తావా? మాట్లాడుదాం!" అన్నాడు

"ఇక్కడ పని చేస్తుంటే నేను రావడం

ఎట్లా సాధ్యం? మధ్యాహ్నం వస్తాలే!" అన్నాడు రామయ్య.

మధ్యాహ్నం ప్రెసిడెంటు ఇంటికి వెళ్ళేసరికి చాలామంది కొలువుతీరి ఉన్నారు. అందరితోపాటు రామయ్య కూర్చున్నాడు.

"ఏం రామయ్యా! మాకు పోటీకొరకా మీరు బావి తవ్వుతున్నది?" అన్నాడు ప్రెసిడెంటు.

"మేము ఎవరినీ ఎదిరించాలను కోలేదు. చేయాలనుకున్న పని చేస్తున్నాం. ఆ విధంగా నీవు ఊహిస్తే మరుగు వొడ్లు కట్టించడం కూడా ఎదురుపోటే అవు తుంది" అన్నాడు రామయ్య.

"ఎందుకవుతుంది? పంచాయతీ తరఫున కట్టిస్తున్నాను"

"నేనూ పంచాయతిబోర్డు మెంబరునూ వైస్ ప్రెసిడెంటును. నీవు రాళ్ల తోలించి కట్టడం ఆరంభించేదాకా నాకు తెలియదు. ముందుగా మెంబర్లకు కూడా తెలియ కుండా కట్టించే హక్కు నీకులేదు. నా పని అంటావా? నీకు చెప్పాల్సినపనిలేదు. ఇది స్వంతపని"

"రామయ్యా! అనవసరంగా వైరాలు కొని తెచ్చుకోవడమెందుకు? ఒకరి కొకరు ఎదురు పోటీగా పని చేస్తే, చిలికి చిలికి గాలివానలా వ్యవహారం ముదిరిపోతుంది. అందరం కలిసి పని చేద్దాం. గ్రామం బాగుపడుతుంది" అన్నాడు మునసబు.

"మేము కూడా ఆ విధంగా భావించే నాగిరెడ్డిని రెండు రోజుల కిందట ఇక్కడికి పంపాము. ప్రెసిడెంటు పురుగు లాగా భావించాడు. అందువల్ల మేము స్వంతంగానే ప్రయత్నం చేయదలచు కున్నాం. ఇది ఎవరికీ పోటీకాదు"

"మిగిలిన బావుల్ని అందరం కలిసి తీయిద్దాం" అన్నాడు గురవయ్య.

"ఎందుకూ? కష్టపడడం మాపని, పేరు సంపాదించుకోవడం మీ రా? మీరు తీయిస్తామంటే గ్రామంలో ఇంకా బావు లున్నాయి. రెండు మీరు తీయండి. లేదా ఒకటి పూడిక తీయండి. మిగిలినవి మేము తీస్తాము. కలిసి పని చేయడం కంటే విడిగా పని చేస్తే పని కూడా తొందరగా అవుతుంది."

"పని తొందరగా అవడం కాదు; పోట్లాట అవుతుంది ఎక్కువ" అన్నాడు మునసబు.

''సరే! అయిందేదో అయింది. నిన్న పంచాయతీ ఎన్నికలలో కలిసి పనిచేశాం. ఇంతలోనే మన మధ్య వైరమెందుకు? అందరం కలిసి పని చేద్దాం. ఆ పేరు ప్రఖ్యాతులేవో మీరే సంపాదించుకున్నా మాకు బాధలేదు'' అన్నాడు ప్రెసిడెంటు.

"అప్పారెడ్డీ! నీతో మాకు పోట్లాట వద్దు. కలిసి పని చేయడమూ వద్దు. పోయిన ఎన్నికలలో కూడా నీతో కలిసి పని చేయాలని చేయలేదు. చేతగాని వాడికి సపోర్టు చేయడం కంటే, అసలేమీ తెలియనివాడికి చేయడం మంచిదని చేశాము. ఇరవై ఏండ్లుగా ఏమీ చేయని నీవు ఇప్పుడు ఏదో చేయగలవని ఎట్లా నమ్ముతాము? చపలచిత్తుడైన రమేష్ వస్తే మరింత తారుమారుగా ఉంటుందని నిన్ను బలపరిచాము. అయిందేదో అయిందని మేమూ అనుకుంటున్నాము. దానివల్ల గుణపాఠాలు కూడా తీసు కున్నాం. అందువల్ల నీతో వైరం, స్నేహం రెండూ వద్దు. ఎన్నికల ముందు లాగే ఎవరిపద్ధతి వాళ్లు అనుసరిద్దాం!"

"నీవు అంత ఖచ్చితంగా మాట్లాడితే

మేము ఏమి చెప్పగలం? మావల్ల నీకు అయిన నష్టం ఉంటే చెప్పు! సరిదిద్దు కుంటాము. అంతేగానీ మూరంగాపోతే ఎట్లా?" అన్నాడు మునసబు అను నయంగా

"జరిగినవాటిని గురించి ఏమీ ఆలో చించదలచుకోలేదు. ఉంటే మీగే ఆలో చించుకోండి" అంటూ లేచాడు రామయ్య.

"ఉండవయ్యా! అంత తొందరపడితే ఎట్లా? కూర్చో, మాట్లాడుదాం" అంటూ చెయ్యి పట్టుకున్నాడు గురవయ్య.

"అక్కడ మనుషులు బావితవ్వు తున్నారు. నేను ఇక్కడ కూర్చుంటే ఎట్లానయ్యా?" అంటూ చెయ్యి విదిలించి వెళ్ళాడు రామయ్య.

"వీళ్లు ఇకమంచిగా మనతో కలిసి రారు" అన్నాడు ప్రెసిడెంటు.

"అవుననుకో! అంతమాత్రాన వైరానికి తలపడడమెందుకు? వాళ్ళు ఎన్ని మంచి పనులు చేసినా పంచాయతీ ఎన్ని కలు ఇంకా నాలుగేండ్లకు పైగానే ఉన్నాయి. అందువల్ల మనకు బాధలేదు. కానీ కలుపుకొని వస్తే గ్రామ తగవులు లేకుండా పోతాయి".

"వాళ్లు బిగుసుకుంటుంటే మనం బతిమాలుదామా? వాళ్ళకు మరింత లోకువ అవుతాము. వాళ్ళిష్టం వచ్చినట్లు చేసుకోనీ చూద్దాం" అన్నాడు గుర వయ్య.

"మనం కూడా ఒకటో, రెండో బావులు తవ్వించే ఏర్పాటు చేద్దాం" అన్నాడు రమేష్.

"నువ్వూరకుండవయ్యా పంతులూ! త్రవ్వడమంటే మాటలుకాదు. డబ్బు కావాలి డబ్బు. రామయ్యకంటే మొదటి నుండీ గ్రామంలో గ్రూపు ఉంది. పైగా కుర్రకారును తిప్పుకొని వచ్చే కొడుకు ఉన్నాడు. కలిసికట్టుగా ఖర్చు లేకుండా తవ్విస్తున్నాడు. నీవూ తవ్వించాలంటే పూటకు పది రూపాయలు అడుగుతారు కూలీలు" అన్నాడు సూరయ్య తలూ పుతూ.

"పంతులూ! ధనుంజయ్ లాంటి కుర్రకారుంటే నీవు టీం కట్టు" అన్నాడు మునసబు.

"ధనుంజయ్ ఊరు విడిచివెళ్లాడు. వాడు ఇక ఈ గ్రామానికి రాడు. మన కున్న కుర్రకారు తినడానికి మాత్రమే గాని పని చేయడానికి రారు" అన్నాడు రమేష్ విచారంగా.

"ఈ పంతులమ్మ సంగతేమిటి? ఇక్కడో ప్రెసిడెంటు ఉన్నాడనీ, స్కూలుకు చెందిన విషయాలు అతడితో మాట్లాడదామనికూడా ఆలోచించకుండా, ఏకాఏకిని పరిషత్‌కు రిపోర్టు మీద రిపోర్టు రాసుకుంటున్నదట. అందరూ మనల్ని అలుసుగా చూస్తున్నారు" అన్నాడు గురవయ్య.

"దానికి పొగరెక్కిందిలే. వెనుక నాగిరెడ్డిగాణ్ణి ఆపుచేసుకుంది. ఇంకేం భయం? ఎందరొచ్చినా ఎదిరిస్తానని ధీమా ఉంది" అన్నాడు మునసబు.

"నీతో మాట్లాడుతుందా పంతులూ?" అన్నాడు ప్రెసిడెంటు.

"నేను అసలు స్కూలువైపు వెళ్ళ డమే లేదు"

"దీన్ని మార్పించాలి. నెలకో ఊరు తిరిగితే గానీ సిగ్గురాదు" అన్నాడు ప్రెసిడెంటు పళ్లు బిగించి కోపంగా.

"అది సరే ఈ రామయ్యతో ఏ విధంగా ప్రవర్తిస్తామంటారు? పోటీగా ఉండడమా? లొంగి ఉండడమా? ఎవరి




పద్ధతివాప అనుసరించడమా?" అన్నాడు తిరిగి.

"జరిగేదేదో జరగనివ్వండి. ప్రతి పండిన డబ్బులు ఎక్కువై చేతులు జిల పుట్టినట్లున్నాయి. అవి ఖర్చు అయితే గాని వీళ్ళు నిదానంగా ఆలోచించరు. ఆ తర్వాత వాళ్ళే తగ్గివస్తారు" అన్నాడు సూరయ్య.

వాళ్ళకు పోటీగా ఏదయినా కార్యక్రమం తీసుకొని పనిచేద్దామని ముందుకు రానందుకు రమేష్ నిరుత్సాహపడ్డాడు.




ఆ సాయంత్రానికి బావి పూర్తయింది. పరో నాలుగు రోజులలో మిగిలిన మూడు బావులు కూడా పూర్తయ్యాయి. మొత్తం ఆరు రోజులు అందుకు వినియోగించారు. ఖర్చు తొమ్మిది వందల డెబ్బై రూపాయలని తేలింది. శ్రమదానం చేస్తున్న వారికి ఖర్చులకొరకని రోజుకు రెండు రూపాయల చొప్పున ఇచ్చారు. ఆ విధంగా రోజుకు యాభై ఖర్చు. రెండు పూటలా భోజనం, తాళ్ళు, బకెట్లు, తట్టలు, ఇవన్నీ లెక్కవేస్తే అయిన ఖర్చు ఏమంత ఎక్కువకాదు. ఆ పని చేయించడం వల్ల ప్రజలలో అభిమానం సంపాదించుకున్నారు. ఖర్చయిన వెయ్యిరూపాయలు ఒకరు భరించాల్సిన పనిలేదు. పని పూర్తయింది గనుక చందాలు ఎవరయినా ఉత్సాహంగా ఇస్తారు. ఈ ఉత్సాహం చూసిన మజానగరం వాళ్ళు కూడా రామయ్యను తీసుకొని వెళ్ళి, తమ గ్రామంలో బావుల తవ్వకం ఆరంభించారు.

ఇక ముందు ప్రెసిడెంటు చేసే ఏ కార్యక్రమం కూడా సాగనివ్వకుండా చేయాలని నిర్ణయించుకున్నాడు నాగిరెడ్డి. పంచాయతి మెంబర్లలో నాలుగు వీరి చేతిలో ఉన్నాయి. మొత్తం ఏడు. ఏ పద్దు ఆమోదించాలన్నా మెజారిటీ అవసరం. మెజారిటీ ప్రెసిడెంటుకు లేదు గనుక అతన్ని ముందుకు రాకుండా చేయాలి. చిన్న చిన్న పనులు చందాల ద్వారానే చేస్తూ ముందుకు రావాలి.

వర్షాలు ఆరంభమయ్యాయి. గ్రామం తిరిగి కొత్త కళకు వస్తున్నది. పంట కార్యక్రమాలు చూడడానికి సిద్ధపడుతున్నారు. గుండ్లకమ్మ ఒరుసుకొని, వంకలు తిరుగుతూ వయ్యారంగా పోతున్నది. మాగాణిలో నాట్లు చల్లారు. పొలాలన్నీ ఇంతకు ముందే దున్ని ఉంచడంవల్ల కొర్ర, తైద, జొన్న, వేరుశనగ పంటలు వేస్తున్నారు. గ్రామ గొడవలు ఎవరూ పట్టించుకోవడం లేదు. ముందు పొలం గొడవలు పూర్తి కావాలి.

నాగిరెడ్డి పూర్తిగా పొలం పనులలో తిరుగుతుండడంవల్ల, గ్రామ సమస్యలు రామయ్య చూసుకుంటున్నాడు. దాసం తిరిగి పేట్రేగిపోతున్నాడని, తిరిగి ఎవరి మీదనో పడతాడని జయరావు చెప్పినా 'తర్వాత చూద్దాం' అన్నాడు రామయ్య. ప్రెసిడెంటు కూడా ఏదో విధంగా వీరిని దెబ్బతీయడం ద్వారా, తన ఆధిక్యతను నిరూపించుకోవాలనుకుంటున్నాడు.

దాసం మీద ఛార్జిషీటు ఫైల్ చేయలేదు. పోలీసుస్టేషన్ పరిధినుండే ఉపసంహరించుకున్నాడు. ఆ విషయం తెలిసినా నాగిరెడ్డి పట్టించుకోలేదు. దాసం జైలుకు వెళ్తే లాభమేమిటి? మరోసారి దౌర్జన్యం చేస్తే కాళ్లు విరిచేస్తే సరిపోతుందనుకున్నాడు.

రామయ్య ఒంగోలు వెళ్ళి పరిషత్ ఆఫీసుకు వచ్చాడు - తాడూరు రోడ్డు విషయం మాట్లాడదామని. తెలిసిన ఆఫీసర్లను పలుకరించి సమస్య ప్రస్తావించాడు.

"ఆ రోడ్డు కొరకు మీ ప్రెసిడెంటు బాగా కష్టపడుతున్నాడయ్యా. అది తప్పకుండా వేయవలసివస్తుంది" అన్నాడు సెక్రటరీ.

"అది హైవేస్ వారిదన్నారు కదా?"

"ఏవేస్ వారిదయినా బాటలు అభివృద్ధికావాలి. వారు ఇప్పట్లో బాగుచేయదలచలేదు. నిధులు లేవంటున్నారు గనుక, ఆ ఐదుమైళ్లు మన సమితిలో ఉంది గనుక, దాన్ని పరిషత్‌కు అప్పగించే ఏర్పాటు చేస్తున్నారు. పరిషత్‌కు అప్పగిస్తూనే కంట్రాక్టులు కోరుతారు" అన్నాడు.

మేరీ కూడా సమితికి వచ్చింది. రామయ్యను గ్రామంలో ఎప్పుడూ పలుకరించలేదు. మర్యాదగా ఉండదని దగ్గరగా వచ్చి "నమస్తే! ఎప్పుడు వచ్చారు?" అంది.

రామయ్య వెనుతిరిగి చూసి, చిన్నగా నవ్వుతూ "నువ్వా అమ్మాయ్! మోదేపల్లె నుండి ఎప్పుడు వచ్చావు?" అన్నాడు.

"ఉదయం బస్సుకు వచ్చానండీ. ఫర్నిచర్‌కు ఇండెంట్ పెట్టి ఆరు నెలలయింది. ఇంతవరకూ ఆ విషయం ఏమయిందీ తెలియదు. తెలుసుకుందామని వచ్చాను. ఇక్కడే మా తమ్ముడు చదువుకుంటున్నాడు. వాడిని చూచి వెళ్ళవచ్చని వచ్చాను".

"పని అయిందా?"

"లేదండీ! ఇంటి వద్ద నుండి ఇప్పుడే వస్తున్నాను. అడిగితే ఇంకా శాంక్షన్ చేయలేదంటున్నారు. స్కూలులో స్వంత కుర్చీ వేసుకోవడం మంచిదనుకుంటున్నాను".

"సరే! అడుగుదాంరా! ఏమంటారో!" అంటూ బి. డి. వో. రూంలోనికి దారి తీశాడు.

బి. డి. వో.కి రామయ్య బాగా పరిచయం.

"ఏం ఫర్నిచరండీ! తలనొప్పి పుడుతున్నది. ఎంతని తేవాలి? ఆ స్కూలుకు ఇప్పటికి మూడుసార్లు ఫర్నిచరుపంపాము. ఏమయిందీ అతీ గతీ లేదు" అన్నాడు విసుగ్గా.

"ప్రెసిడెంటు ఇంటికి చేరి ఉంటుంది. దాన్ని గురించి మీరు ఎప్పుడయినా ఎంక్వయిరీ చేశారా? ఇంతవరకూ గ్రామానికి మంచి టీచరంటూ ఎవరైనా వచ్చారా అంటే ఈ అమ్మాయే కన్పిస్తున్నది. పిల్లల్ని గాడిదల్ని చేయడానికీ, ప్రెసిడెంటు కాళ్ళు ఒత్తడానికీ తప్ప మరెందుకూ పనికిరాని టీచర్లను మా గ్రామం పంపి, పిల్లలకు చదువురాకుండా చేశారు. ఆమె ఆరు నెలలుగా డొక్కు-టేబుల్ మీద కూర్చొని పిల్లలకు పాఠాలు చెప్పింది. పాత సామాను ఏమయిందో మీరు విచారించారా?"

"విచారిస్తాం. దానికి కారణాలు ఎన్నో చెబుతారు. ఆ విధంగా చివరకు పట్టించు




కోకుండా విడిచిపెడతారు" అన్నాడు బి.డి.వో.

"తొందరగా తెప్పించే ఏర్పాటు ఏమయినా ఉంటుందా?"

"మీరు పరిషత్ సెక్రటరీని పట్టండి. తొందరగా వస్తుంది. మధ్యన ఎవడి నడిగినా నాలాగే సమాధానం చెబుతారు" అన్నాడు. అక్కడి నుండి బయటకు వచ్చి, పరిషత్ ఆఫీసులో విచారిస్తే సెక్రటరీ లేడు.

"ఈ రోజు గ్రామానికి వస్తావా అమ్మాయ్?" అన్నాడు రామయ్య.

"రేపు ఉదయం వస్తానండీ!" అంది ఇంటికి వెళ్ళిపోతూ.

రామయ్య గ్రామం తిరిగి వచ్చాడు. గ్రామం రణగొణధ్వనిగా ఉంది. చాకలి రాముణ్ణి, జయరావును కట్టెతో బాదాడు దాసం. గ్రామంలో సింహనాదం చేస్తూ తిరిగినా అడ్డుకునేవాడు లేడు. తల మునకలుగా సారాయి తాపి, గ్రామం మీద వదిలారు. నాగిరెడ్డి పొలం వెళ్ళి ఉన్నాడు. నాగిరెడ్డికి వార్త తెలిసి వచ్చే టప్పటికి దానాన్ని ప్రెసిడెంటు ఇంటిలో దాచిపెట్టారు. రామయ్య వస్తూనే,రాముని తల్లి ఏడుస్తూ వచ్చింది. రామయ్య వెళ్ళి చూశాడు. రాముని భుజం మీద ఎముక చిట్లింది. వెంటనే ఎల్లాయపాలెం హాస్పి టల్‌కు తీసుకెళ్ళారు ఇద్దరినీ! మునసబు పరుగెత్తుకుంటూ వచ్చి ప్రెసిడెంటుతో మాట్లాడాడు. ప్రెసిడెంటు నిర్లక్ష్యంగా "ఏదో ఒకటి కానివ్వు" అన్నాడు.

రాత్రి ఎనిమిది గంటలకు ఎల్లాయ పాలెం చేరారు. ఆ పాటికి హాస్పిటల్ మూతవేసి ఉంది. డాక్టర్ కొరకు విచా రిస్తే ఊళ్ళో లేడన్నారు. నర్సు ఉంది: కాని, వెంటనే ఒంగోలుకు తీసుకెళ్ళమని సలహా ఇచ్చింది. అదే బండిలో ఎల్లాయ పాలెం మెట్ట వరకూ తెచ్చి, అక్కడి నుండి బస్సులో ఒంగోలుకు తీసు కొచ్చారు.

పొలాలనుండి తిరిగివచ్చిన యువకులు రాత్రికి రాత్రే ఎల్లాయపాలెం వచ్చారు. అక్కడ ఒంగోలు వెళ్ళారని చెప్పడంతో, లారీలు అందుకుని ఒంగోలు చేరారు. అప్పటికే ప్రైవేట్ హాస్పిటల్‌లో చేర్చి కట్లు కట్టించారు. ప్రమాదమేమీ లేదని చెప్పారు. రామునికి భుజం మీద ఎముక చిట్లింది. జయరావుకు కర్ర దెబ్బలు మాత్రం తగిలాయి.

రాత్రి ఆ హాస్పిటల్‌లోనే పడుకొని, తెల్లారి అందరూ తిరిగి తోవ పట్టారు. ఎల్లాయపాలెం బస్సు ఉదయం ఐదు గంటలకే. జనం కిటకిటమంటున్నారు! ఆ తోవలో ఉన్నవి రెండు బస్సులే! మధ్యాహ్నం వరకూ మరో బస్సు లేదు.

తాడూరు అడ్డరోడ్డు దగ్గర దిగి, నాగి రెడ్డితో పాటు పది మందిదాకా నడిచి వస్తున్నారు. అదే బస్సులో మేరీ కూడా వచ్చింది. జనం ఒత్తిడిలో వీరికి కన్పించ లేదు. దిగిన తర్వాత చూశారు. అందరూ కలిసి వస్తుంటే మధ్యన రమేష్, మున సబు ఎదురు వచ్చారు.

"ఎట్లా ఉంది రామిగాడికి?" అన్నాడు ఆతృతగా మునసబు.

"చెయ్యి తీసివేయాలన్నారు.ఇక వాడి జీవితం పనికిరాదులెండి" అన్నాడు నాగడు.

"నిజంగానా?అంత దెబ్బ తగిలిందా?"

కళ్ళతో చూసినట్లు ఉంటుంది; అను నయ వాక్యాలు చెప్పి చల్లబరచిరావచ్చని ఆయన, రమేష్ కదిలి వచ్చారు. చెయ్యి విరిగితే ఇక అనునయ వాక్యాలు పని

చేయవని ఆలోచిస్తున్నాడు.

"దెబ్బ పెద్దదే గానీ బాగానే ఉన్నాడు. వారం రోజులలో ఇంటికి వస్తాడు" అన్నాడు నాగిరెడ్డి. "దానం గాడిని మళ్ళీ ఊరి మీదకు విడిచిపెట్టాడు మన ప్రెసిడెంటు. ఇలా అయితే వాడి కాళ్ళు విరిచేస్తాం మేము కూడా!" అన్నాడు తిరిగి.

"అనవసరంగా తగవులెందుకు? ఇంటికి వచ్చిన తర్వాత మాట్లాడుదాం; రెచ్చ గొట్టుకోకండి" అంటూ వెళ్ళాడు మునసబు.

"వీడో చచ్చు వెధవ. అందర్నీ మంచి చేద్దామంటాడు. కాని ఒకవైపే అభిమానం చూపిస్తాడు" అన్నాడు సరసయ్య.

పదిగంటలకు ఇళ్ల చేరారు. ప్రెసిడెంటు ఇంటి ముందునుంచే నాగిరెడ్డి ఇంటి వరకూ వచ్చారు.

ప్రెసిడెంటు ఇంటి ముందున్న జనం వీరిని చూశారు. పలుకరించలేదు. మధ్యాహ్నం పల్లెకు వస్తానని చెప్పి అందరినీ పంపించాడు నాగిరెడ్డి.

"ఎట్లా ఉందిరా వాడికి?" అన్నాడు సుబ్బయ్య.

"బాగానేఉంది, నాటు వేయడానికి వెళ్ళారా?"

"ఎవరు వెళ్ళేది? ఇద్దరూ ఇంట్లో లేకుంటాపోతే పాలేరు ఒక్కడే ఎట్లా పనిచేయిస్తాడు? అసలే వాడు కొత్త గట్టు చెక్కడానికి వెళ్ళాడు".




అన్నం తిని పల్లెవైపు వెళ్ళాడు. అలాగే పొలంవైపు వెళ్ళి వస్తానని ఇంటి వద్ద చెప్పాడు. పల్లె ప్రశాంతంగా ఉన్నా ఎవరి ఆందోళనలో వారు ఉన్నారు. రత్నం ఇంటికి వెళ్ళేటప్పటికి పడుకొని నిద్రపోతున్నాడు.

"వాడు రావడమే అన్నం కూడా తినకుండా పడి నిద్రపోతున్నాడు," అంది రత్నం తల్లి.

"పడుకోనీ! రాత్రంతా నిద్రలేదు" అని జయరావు ఇంటివద్దకు వచ్చాడు. ఏసు బయటే ఉన్నాడు బీడీకాల్చుకుంటూ.

"ఎట్లా ఉంది బాబూ మావాడికి?" ఆత్రుతగా అడిగాడు.

"పెద్ద దెబ్బలు తగల్లేదులే! రేపు వస్తాడు".

"దానంగాడి సంగతేదో చూడాలయ్యా! లేకుంటే మా పల్లెనంతా గుండ్లకమ్మలో తోసేస్తాడు. ఉండేది ఎలుకపిల్లలాగా ఒకడు.చేసేదేమో అందరిమీదా పెత్తనం"

పొలంవైపు వెళుతూ మేరీ ఇంటివైపు చూశాడు. బయట కన్పించకపోతే లోనికి వెళ్ళాడు. బొగ్గుల కుంపటిసురుతూ, కళ్ళు నలుపుకుంటూ కూర్చుంది.

"ఇంకా మీరు వంట చేసుకోలేదా? తినే దెప్పుడు?" అన్నాడు నవ్వుతూ.

"చేసే పనేముందిలెండి. ఈ రోజంతా తింటూ కూర్చోవడమే! కూర్చోండి" అంది బొగ్గుల్ని కదుపుతూ.

ఆమెనే చూస్తూ పొలం వెళ్ళాలన్న విషయం మరచి, ఆమె అటు ఇటు తిరుగుతుంటే చూస్తూ కూర్చున్నాడు. అతడు తనవైపు చూస్తున్నాడని ఆమెకూ తెలుసు. గిన్నె కింద కుదించి "ఉండండి. స్నానంచేసి వస్తాను" అంటూ గుడ్డలు తీసుకొని దొడ్డిలోనికి వెళ్ళింది.

స్నానంచేసి బకెట్ తీసుకొని లోపలకు వచ్చింది. తలంటి స్నానం చేయడం వల్ల కురులు విచ్చుకున్నాయి.

"భోజనం చేద్దాంరండి" అంది పళ్ళెం చేతికి తీసుకుంటూ.

"తిని వచ్చానండీ. పొలం వెళ్ళాలని ఇటువచ్చాను".

"మరి కొంచెం తినండి. మాఇంట్లో ఒక పూటయినా పావనం చేయరూ?" అభ్యర్థనగా నవ్వుతూ అంది. జవాబివ్వ లేదు నాగిరెడ్డి నవ్వుతూనే.

"మీ అమ్మ ఈ రోజు వస్తుందా?"

"ఇప్పట్లో రాదు. నవంబరు పరీక్షలు దగ్గరకు వస్తున్నాయి. వంట చేసుకొని చదువుకోవాలంటే వాడికి సాధ్యంకాదు. అందువల్ల పరీక్షలు పూర్తయ్యేవరకూ అక్కడే ఉండమన్నాను. ఇక్కడ ఒక్క దాన్ని మాత్రం ఆమె చేసేదేమిటి?"

తల వంచుకొని భోజనం చేస్తున్న ఆమెను చూడడం విజ్ఞతకాదని తెలిసినా చూస్తున్నాడు. అప్పుడే స్నానం చేసి రావడంవల్ల ముఖం మిలమిల మెరుస్తున్నది. యవ్వనంలో ఆమె శరీరపొంగు గుడ్డల్లో కూడా స్పష్టంగా కన్పిస్తున్నది. నాజూకయిన సన్నటి చేతులు అటు ఇటు కదులుతున్నాయి. భుజంమీద మత్తుగా పడుకున్న మనిషిలా కదలకుండా వెంట్రుకలు కప్పబడి ఉన్నాయి. తలెత్తి అతడి వైపు చూసింది. అంతవరకూ ఆమెనే చూస్తున్న అతడు తటాలున చూపు తప్పించాడు. తల పక్కకు తిప్పుకుని నవ్వుకుంది.

"పొలం వెళ్ళాలండి" అంటూ లేచాడు ఇక అక్కడుంటే మరింత దిగజారి పోతానని అనుకుని.

"ఈ నడిరెండున పొలంవెళ్ళి ఏం

చేస్తారు? సాయంత్రం వెళ్ళవచ్చుకదా!"

"లేదు, పొలానికి నీరు పారుతున్నది. పాలేరు అక్కడే ఉన్నాడు. ఒకసారి వెళ్ళి చూసి, రేపు నాటుకు నీరు సరిపడు తుందేమో చూసి నారుమడికి నీరు పెట్టాలి. అన్నట్లు ఇక్కడ మీరు ఎత్తిపోతల జలపాతం చూశారా?"

"లేదు, ఎక్కడున్నదో కూడా తెలియదు."

"గుండ్లకమ్మ ఒడ్డున అరమైలు వెళితే ఉంటుంది. గుండ్లకమ్మ నుంచి ఇంజన్లద్వారా నీళ్లు పైకి తోడి కాలువలకు విడుస్తారు. అక్కడ పెద్దపెద్ద చెట్లున్నాయి. హాయిగా ఉంటుంది వాతావరణం. నేను అక్కడికే వెళ్తున్నాను. వస్తారా?"

"ఇప్పుడు కాదులెండి" అతని ముఖంలోకి చూస్తూ, "పిలుంటే సాయంత్రం వస్తాను. ఈరోజు స్కూలు లేదుకదా! మీరు అక్కడే వుంటారా?"

"మీరు వస్తానంటే వుంటాను".

అతని ముఖంలోకి చూసి సిగ్గుతో తలవంచుకుంది తలూపుతూ. నాగిరెడ్డి బయటకు వచ్చి గుండ్లకమ్మ వెంట సాగాడు.

భోజనంచేసి, జడవదులుగా వేసుకొని, తలుపు వారగావేసి మంచం వాల్చి పడుకుంది ఆలోచిస్తూ. తనలోనే కాదు అతడిలోనూ ఆ ఆలోచన వుంది అనుకుంది. అందుకే ఆ చూపులు? కానీ, ఏంలాభం? కలిసే అవకాశం ఎంత మాత్రం లేదు. కేవలం శరీర సుఖం కోసం ప్రయత్నించడం తప్ప. అతనితో కలిసి జీవితం పంచుకోవడం సాధ్యమా? అది సాధ్యం కానప్పుడు శరీర సుఖం కొరకు సలుగురిలో అల్లరి పట్టడం మంచిదా? ఉన్మాదంతో ఏం తప్పటడుగు వేసినా, జీవితంలో ఆ మచ్చ మిగిలే వుంటుంది. 'అతడితో కలిసి బతికే అవకాశం లేనప్పుడు కోరికను చంపుకోవడం తప్ప చెడిపోవడానికి సిద్ధపడకూడదు. తాత్కాలిక సుఖం కొరకు అభాసుపాలు కాకూడదు' అనుకుంది. కళ్లనుండి నీరు కారుతున్నా తుడుచుకోకుండా నిస్తేజంగా పడుకున్నది.

జీవిత సుఖాన్ని అనుభవించవలసిన వయస్సు! బతకడానికి సంపాదన ఉంది. అనుభవించడానికి హక్కు పోయింది. మోడుగా ఎన్నాళ్ళు బతకాలి? ఒకరికి పాఠాలు చెప్పే తాను, జీవితంలో పాఠాలు నేర్చుకోలేక పోతున్నది. జీవితాన్ని ఎల్లకాలం ఇలా నాశనం చేసుకుంటే ఆ తర్వాత సుఖపడేదేమిటి? తల్లి తనను గురించి ఆలోచిస్తున్నదా? ఆలోచించి చేసేదేమిటి? సంఘానికి తాను విధవ! పెళ్ళి కాని కన్య అయితే ఎవరో ఒకరు వివాహం చేసుకోడానికి ముందుకు వస్తారు. విధవ అంటే పురుగులా గా చూస్తారు. లేదా, శరీర సుఖం కొరకు వాడుకొనడానికి ప్రయత్నిస్తారు. చరిత్రలో ఇటువంటి జీవితాలు ఎన్ని నాశనమయ్యాయో? మరి అందరిలా తాను కూడా శరీర సుఖం కొరకు జీవితాన్ని పక్కలా పరవాల్సిందేనా? తనకూ భర్తా, పిల్లలు, సంసారం అవసరం లేదా? సంఘంలో ఉన్నతంగా ముందుగా వచ్చేదెవరు?

బయట పిలుపు వినిపిస్తూనే మగత నుండి తేరుకొని తటాలున లేచి కళ్ళు తుడుచుకుని తలుపు తెరచింది. ఎదురుగా దేవమ్మ.

"రా దేవమ్మా!" అంటూ దారికడ్డు తొలగింది. దేవమ్మ వచ్చి కూర్చుంటూ

"ఈరోజు బడి లేదామ్మా?" అంది.

"ఈరోజే ఊరినుండి వచ్చాను. శలవు పెట్టాను" అంది. ముఖంమీద కారిన నీటి మరకలు స్పష్టంగా కన్పిస్తున్నాయి దేవమ్మకు. కాని అడిగే ధైర్యం లేదు.

"ఈ ఊరినుండి నిన్ను ఇంకో ఊరికి మారుస్తామని అనుకుంటున్నారమ్మా ?" అంది ఆమె కళ్ళల్లోనికి చూస్తూ.

ఆశ్చర్యంగా చూస్తూ "ఎవరన్నారు?" అంది.

"నిన్న ప్రెసిడెంటు ఇంటి ముందు అనుకుంటున్నారు. పంపేలోగా ఏదో ఒక అల్లరి చేసి పంపాలి. అప్పుడుగానీ సిగ్గు రాదు అంటున్నారు" ఆ తర్వాత ఏమన్నారో ఆ మాటలు చెప్పలేక పోయింది.

"పోనీలే దేవమ్మా! ఇంతకంటే పనికి రాని ఊరు ఎక్కడా వుండదు. మరో ఊరు అయితే నాకూ మంచిదే కదా!"

దేవమ్మ కొంతసేపు మాట్లాడకుండా ఆమెనే చూస్తూ కూర్చుంది. 'పాపం! మోడు జీవితం' అనుకుంది.

"నాగిరెడ్డిని గురించి పుకారు పుట్టించారమ్మా! అంది నెమ్మదిగా.

"ఏమని ?"

"నీవు ఆయనతో కలిసి తిరుగుతున్నావని !"

మేరీ ముఖం జేవురించింది.

"మేం నమ్మమనుకో! కాని, వాళ్ళు నిన్ను అల్లరి లేపాలని ఏదేదో వాగుతున్నారు. వాళ్ళకు తోడు దాసు. ఇక్కడ నీ యింటికి వాళ్ళొస్తారు, వీళ్ళొస్తారు అంటూ ప్రెసిడెంటు మెప్పుకొరకు అబద్ధాలు కూస్తుంటాడు. పనిలేనివాళ్ళంతా అక్కడ కూర్చొని పగలబడి నవ్వుకొంటారు. ఎందుకయినా మంచిది జాగ్రత్తమ్మా!" అంది అనునయంగా.

సాయంత్రం తలకు నూనె రాసుకొని దువ్వుకుంది. చేతిగుడ్డ తీసుకొని బయటకు వచ్చి తలుపు తాళం వేసి గుంట్లకమ్మ వైపుగా సాగింది. ఏసు ఆమెను చూస్తున్నాడు. అప్పుడప్పుడు గుంట్లకమ్మవేపు పోవడం అలవాటే గనుక, అక్కడికే వెళ్తుందనుకున్నాడు.

దూరంగా ఒడ్డున పెద్ద పెద్ద చెట్లు కన్పిస్తున్నాయి. ఆ చెట్లమధ్యన రేకుల షెడ్డు ఉందన్నాడు. ఈ విధంగా రావడం ఎవరయినా చూస్తే మరింత నీచంగా ప్రచారం చేస్తారనుకున్నది. 'అయినా తనలో మాలిన్యం లేనప్పుడు ఎవరో అంటించేదాన్ని గురించి భయపడటమెందుకు ? తుడిచివేసుకోవడమే' అనుకుంది.

దగ్గరగా వెళుతున్నకొద్దీ ఇంజన్ల రొదతోపాటు, ఆమె మనస్సు ఆరాటం ఎక్కువవుతున్నది. పెద్ద రేకులషెడ్డు గోడవున్ లాగా కన్పించింది. అక్కడ ఎవరూ కన్పించలేదు. వివిధరకాల చెట్లు చల్లగా గాలి వీస్తున్నాయి. కూర్చొనుటకు అక్కడక్కడ సిమెంటు దిమ్మెలు కట్టారు. కాలువ గట్లవెంట క్రోటన్స్ మొక్కలు నాటారు. మొక్కలు ఒరుసుకుంటూ నీళ్లు పారుతున్నాయి.

షెడ్డు లోపలకు తొంగిచూసింది. నాలుగు ఇంజన్లు రొదపెడుతూ తిరుగుతున్నాయి. మరి రెండు ఇంజన్లు విశ్రాంతి తీసుకుంటున్నాయి. అన్నీ ఆయిల్ ఇంజన్లే !

నడి వయస్సు మనిషి అక్కడకు వచ్చాడు. ఆమెను చూశాడు, పలుకరించలేదు. ఆమె పంతులమ్మ అని అతనికి తెలుసు. అందువల్ల వివరాలు అడుగవలసిన

పనిలేదు. ఆ ప్రాంతం చూడడానికి వచ్చి ఉంటుందనుకున్నాడు. ఇంజన్లు రెండు కట్టివేసి, నీటి కాలువను మరొకదిశకు మళ్లించి, కాలువ వెంట సాగి వెళ్లాడు. నాగిరెడ్డి ఆ ప్రాంతంలో కన్పించలేదు. జనం పొలాల్లో నాట్లు నాటుతూ, నారు పెరుకుతూ, గట్లు కొడుతూ, అరకలు దున్నుతూ ఉన్నారు. గ్రామంలో జన మంతా పొలాల మీదనే ఉన్నట్లున్నారు. సిమెంటుదిమ్మ మీద కూర్చుంది. అందరూ తనకు కన్పిస్తున్నారు. కాని తాను వారికి కన్పించదు. చుట్టూ చెట్లు న్నాయి. అందువల్లనే తాను రాలేదని నాగిరెడ్డి రాలేదేమో ? తాను తొందరపడి వచ్చిందేమో? ఆలోచిస్తున్నది. కాలువ ఒడ్డున ఒక మనిషి కన్పించాడు.

కాలువవెంట వస్తున్న వ్యక్తిని నాగి రెడ్డిగా ఆమె గుర్తించలేదు. బనియను, డాయరుతో చేతులకు, కాళ్లకు బురద పూసుకున్నాడు. ముఖమంతా బురదజల్లు పడ్డాయి. దగ్గరగా వచ్చేవరకు గుర్తించ లేదు.

"ఏమిటి ఇలా అయ్యారు ?" అంది ఆశ్చర్యంగా దగ్గరకు వస్తూనే.

"ఇంతే మా వేషం! గ్రామంలో ఉన్నంత వరకూ తెల్లబట్టలు కట్టి తిరగడం, పొలం వస్తే కొత్తరకం వేషం వేయడం" అంటూ పక్క కాలువకు అడ్డువేసి, తాను వచ్చిన కాలువకు సన్నగా నీరు మళ్లించాడు.

"ఎంతసేపవుతోంది మీరు వచ్చి?"

"అర్ధగంట అవుతోంది"అంది అతన్ని కిందినుండి పైదాకా చూస్తూ.

"కాళ్లు చేతులు, ముఖం కడుక్కొని మంచినీళ్లు తాగి ఒడ్డుకు వచ్చాడు. ఇద్దరూ నడవసాగారు.

"పొలం పని అంటే ఇంతే మరి ! ఈ నాలుగు నెలలూ ఇలా కష్టపడితే సంవత్సరమంతా పనిలేకుండా కాలం గడుపవచ్చు" అన్నాడు.

వీరిని ఇద్దరినీ చూసి, గట్లు సరుకు తున్న వ్యక్తి, పార కడిగి దగ్గరగా వచ్చాడు. "చెంచూ ! ఇంటికి వెళ్లు! పశువులకు నీళ్లు, మేత చూడు" అన్నాడు నాగిరెడ్డి.

"నాటుమనుషుల పిలువమంటావా?"

"రత్నానికి నేను చెబుతాను, నీవు వెళ్లు ! వాడే చూసుకుంటాడు"

చెంచు వెళ్ళిపోయాడు.పోతూ ఇద్దర్నీ మార్చి మార్చి చూస్తూ వెళ్ళాడు. 'ఈ పంతులమ్మ ఇక్కడికి ఎందుకొచ్చిందా?' అనుకుంటున్నాడు.

నారుమడికి నీళ్లు మళ్ళించి, నిండిన తరువాత కాలువ పక్కకుతిప్పి, గుడ్డలు కట్టుకొని "వెళ్దామా!ఇంకా చూడవలసింది ఏమయినా ఉందా" అన్నాడు.

తల పక్కకు తిప్పి నవ్వింది మేరీ. "ఏముంది ఇక్కడ చూడడానికి ? బురదనీరు, పచ్చమొక్కలు తప్ప. ఇంటి దగ్గర ఎలాగూ పొద్దుపోవడంలేదు.అందు వల్ల ఇలా వచ్చాను" అంది.

కాలువగట్టువెంటసాగి ఇంజన్ల వద్దకు వచ్చారు. అక్కడనుండి గుండ్లకమ్మవైపు సాగారు.

ఎవరి మనసులో ఏముందో ఎదుటి వ్యక్తికి తెలియకుండా జాగ్రత్తపడుతు న్నారు. ఊరికి దగ్గరగా రేవు పక్క ఇసుకలో కూర్చున్నారు. ఒకప్పుడు బావులు పూడికతో నిండినప్పుడు రాత్రి పది గంటలదాకా, తిరిగి తెల్లవారుజాము నాలుగు గంటలనుండి, జనంతో కిటకిట




మస్నరేవు బావులు బాగుపడటంతో అటువైపు ఎవరూ రావడంలేదు.

"ఒకరిని ఒకరు కవ్వించుకుంటూ పోటీగా పనులు చేశారుగదా? ఇప్పుడు రెండువర్గాలు ఖాళీగా ఉన్నారేమిటి?పనులు విడిచి పెట్టారా?"

"పనుల కాలం కదా! కూటికొరకు ముందు ప్రయత్నించాలి. ఈ ప్రయత్నం తర్వాత మిగిలిన ప్రయత్నాలు! కడుపుకు తిండి లేకుండా రాచకార్యాలు చేయాలంటే ఎలా సాధ్యమవుతుంది? ముందు పొలం పనులు అవ్వతే, తర్వాత ఏమి చేయవల సిందీ ఆలోచించాలి. త్వరలోనే మురికి కాల్వలు తీయాలనుకుంటున్నాము".

ఏదో మాట్లాడదామని ఆమెను ఇక్కడికి రమ్మన్నాడు; వచ్చింది. ఆమెముందు మాట్లాడలేకపోతున్నాడు. ఆమె కూడా ఆ ఉద్దేశంతోనే వచ్చింది. మనస్సులో మాట పైకి రావడం లేదు. ఇద్దరూ ఒకరి నొకరు చూసుకుంటూ, తల తిప్పు కుంటూ కాలం గడిపారు. పొద్దు గుంకింది.

"కూలీలను చూసుకోవాలి. వెళ్దా మంటారా?" అన్నాడు లేస్తూ.

ఆమె కూడా లేచింది. కాని, ఆలో చనలు బరువుగా ఉన్నాయి. పల్లెలోనికి వస్తూనే రచ్చబండ వైపుగా ఆమెవెళ్ళింది. నాగిరెడ్డి రత్నం ఇంటి వద్దకు వచ్చాడు. "ఇంట్లో లేడు, ఊర్లోకే వెళ్లాడు" అంది అతడి తల్లి. మళ్ళీ రావచ్చునుకొని గ్రామం



లోకి దారి పట్టాడు.

ప్రెసిడెంటు ఇంటి ముందుగా వెళ్తుంటే జనం తన వైపే చూడడం గమనించినా, తలవంచుకొని వెళ్లాడు.

పొలేరు వచ్చి సరోజమ్మతో పొలం విషయం చెప్పడంతో, ఆమె అన్నం తింటుండగా నాగిరెడ్డిని అడిగింది "పంతులమ్మ పొలం వద్దకు వచ్చిందటగా?"

"వచ్చింది. పొలాలు చూద్దామని అటుగా వచ్చిందట. నేను కన్పిస్తే, పరిచయమున్న వ్యక్తి కాబట్టి అటుగా వచ్చింది" అన్నాడు.

ఆమె కొడుకు వైపు దీర్ఘంగా చూసింది. ఇప్పటికే గ్రామంలో పుకార్లు పుడుతున్నాయని ఆమెకు తెలుసు. ఆ విషయం బహిరంగంగా మందలించలేదు ఆమె! 'ఇంట్లో మిగిలిన వారికి ఎంత వరకు తెలుసో గానీ, ఎవరూ పట్టించుకోవడం లేదు' అనుకుంది.

"ఆ అమ్మాయి భర్త చనిపోయాడట కదా?" అంది అతన్ని చూస్తూ.

"ఏమో? నాకేం తెలుసు? నేను ఎప్పుడూ ఆమె జీవిత వివరాలు అడగలేదు. ఈమధ్య పల్లెకు ఎక్కువగా పోతుండడం వల్ల అప్పుడప్పుడు కన్పించేది. అంతే!" అన్నాడు ఏమీ తెలియనట్లుగా.

ఆమె మాట్లాడలేదు. హితబోధ చేయవచ్చు. కానీ అసలు వారిద్దరి మధ్యా ఏ సంబంధమూ లేక, వట్టి గాలి పుకారు అయితే తన హితబోధ వారిని కలుసుకునేలా చేస్తుందేమో? అందువల్ల ఆ ప్రసక్తే లేకుండా ఆమె జాగ్రత్తపడింది.

అన్నం తిని, గొడ్లకు మేతవేసి, పల్లె వైపు దారి తీశాడు.

"ఎక్కడికిరా?" అన్నాడు సుబ్బయ్య బయట మంచంలో పరుండి.

"పల్లెకు వెళ్తున్నాలే! నాటు కూలీలకు చెప్పాలి" అంటూ వెళ్లాడు.

"ఎప్పుడొస్తావో అన్నం తిని వెళ్ళకూడదూ?"

"తినే వెళ్తున్నాడులే!" అంది బయటకు వచ్చిన సరోజమ్మ.

"అప్పుడే తినడమా? సరిగ్గా చీకటి పడలేదు కదా!" అన్నాడు ఆశ్చర్యంగా.

"పనిచేసి వచ్చాడుగా! ఆకలయి ఉంటుంది" అంది లోనికి వెళ్తూ.

రత్నం ఇంటి వద్దకు వచ్చేసరికి బావి నీళ్ళు తెస్తున్నాడు జోడు బుంగలు చేత పట్టుకొని. రేపు నాటు వేయాలని చెప్పి, తిరిగి రచ్చబండ వద్దకు దారి తీశాడు. కాళ్ళు వాటంతట అవే కదలిపోతున్నాయి. మనసులో మాట చెప్పాలని ఆత్రుత. చెప్పలేక బాధ! చూడాలని ఆశ; ఎవరేమనుకుంటారోనని సంకోచం!

మేరీ దీపం తల వైపు పెట్టుకొని, మంచంలో పడుకొని చదువుకుంటున్నది. తలుపు దగ్గర అలికిడి విని, తలతిప్పి చూసి "రండి" అంది లేస్తూ. దీపం తీసి టేబుల్ మీద పెట్టింది. స్టూల్‌పక్కకు జరిపింది. మంచం మీద కూర్చుంటూ "పిల్లలు ఎవరూ ఇంకా వచ్చినట్లు లేదు" అన్నాడు.

"శలవు రోజు ఇక్కడకూ రారు. ఆరోగ్యం బాగులేనప్పుడే కదా శలవు!"

బయట ఎవరో కేకలేస్తున్నారు. ఏదో తగాదా! ఆడవారు ఒకరినొకరు దుమ్మెత్తిపోస్తూ తిడుతున్నారు. చిమ్మచీకటి! రచ్చబండ మీద రాజ్యమేలుతున్నది, తిట్టుకుంటున్న వారికే ఒకరికొకరు కన్పించడం లేదు. వారు ఎదుట ఉన్నారో లేదో మాటల ద్వారా తెలుసుకొని తిడు




తున్నారు.

ఇద్దరూ కొంతసేపు మాట్లాడలేదు. ఎవరంతకు వారు మౌనంగా కూర్చున్నారు.

గడియారం వైపు చూశాడు. ఎనిమిదిన్నర అయింది. "మీరు భోజనం చేశారా?" అంది అతన్ని చూస్తూ.

"చేశాను. రత్నం సాయంత్రం కన్పించలేదు. నాటు విషయం చెప్పి వెళ్లాలని మళ్ళీ వచ్చాను. ఇప్పుడే కన్పించాడు. చెప్పి ఇట్లా వచ్చాను".

"ఈ రాత్రికి ఇక్కడ చేస్తామన్నారు ఉదయం. మా ఇంట్లో తినకూడదా ఈ పూట?"

తలవంచి నవ్వాడు. "ఇంటికివెళ్తూనే మా అమ్మ అన్నం తినమన్నది. పైగా పనిచేసి నాకూ ఆకలి వేస్తున్నది. వెంటనే తిన్నాను".

"మళ్ళీ కొంచెం తినండి. ఈ పాటికి తిన్నది అరిగిపోయి వుంటుంది" అంది నవ్వుతూ. జవాబివ్వలేదు నాగిరెడ్డి.

తలెత్తి చూశాడు. ఒకరిని ఒకరు చూసుకున్నారు. వెంటనే తలలు పక్కకు తిప్పుకున్నారు.! మనసులో మాట చెప్పాలని శరీరంలో తపనా, ఆరాటం ఎక్కువవుతున్నాయి. ఉద్వేగంతో శరీరం ఉడుకుతున్నది. చెప్పాలి అని గట్టిగా నిర్ణయించుకుంటే కాళ్ళు, చేతులు వణకుతున్నాయి. చివరకు తెగించి, అటో ఇటో తేల్చుకోవాలనుకున్నాడు.

"మీతో ఒక విషయం మాట్లాడదామని చాలా రోజుల నుండీ అనుకుంటున్నాను. కాని మాట్లాడలేకపోతున్నాను" అన్నాడు తడబడుతూ నెమ్మదిగా. మేరీ జవాబివ్వలేదు. అతని తడబడే మాటలో కోరిక... ఆమెలో ఆందోళన.

"మీకిష్టమయితే..." ఆమె ముఖం లోనికే చూస్తూ ఆపాడు. ఆమె టేబుల్ మీదున్న తన ఫోటో వైపు చూసుకుంటూ, పుస్తకం మీద చెయ్యి వేసి వేలితో రాస్తూన్నది. కాని మనసులో ఉద్వేగం పెరుగుతున్నది. "పెళ్ళి చేసుకుందాం!"

మేరీ కనురెప్పలు టప టప కొట్టుకుని పైకి లేచి నిలబడ్డాయి. అతడివైపు ఆతృతగా, ఆరాటంగా చూసింది.

"పెళ్ళి"

ఇంతవరకూ ఆమె ఆ విధంగా ఆలోచించలేదు. విధవయిన తనని ఆ విధంగా అతడు కోరతాడని కలలో కూడా అనుకోలేదు. కేవలం శరీర సుఖం కోరతాడనుకుంది. అంతవరకే ఆలోచించింది కాని, ముందుకు పోలేకపోయింది. ఆ విధంగా కోరితే తాను ఇచ్చే సమాధానమేమిటో తెలియక ఆలోచించుకుంటున్నది. కాని, అతడి నోటివెంట తానూహించని మాట స్పష్టంగా వింటున్నది. పైగా తన జీవిత చరిత్ర అతడికి తెలుసు. అయినా అతడు ఆ విధంగా అడగడం ఆమెకు అమితమైన ఆందోళన, ఆశ్చర్యం, సంతోషం కలిగించింది. నిజంగా ఇది జరుగుతుందా? ప్రేమ పేరు చెప్పి మోసగించే అందరిలాగే ఇతడూ ఒకడా? ఇంతవరకూ అతడి తెగింపూ, నిజాయితీ చూసినపుడు ఆ విధంగా చేసే వ్యక్తి కాదనీ, భవిష్యత్తులో ఆటంకాలు ఎదురయినా ఎదిరించి నిలువగలడనే నమ్మకం ఆమెకుంది.

ఆమె నుంచి జవాబు కొరకు ఎదురు చూస్తున్నాడు. మనస్సులో ఉన్నమాట చెప్పడంతో సగభాగం ఆందోళన తగ్గింది. జవాబేమిటో అన్న ఆతృత పెరిగింది. ఆమె నోటినుండి జవాబులేదు. తలవంచు

కుని స్టూల్ మీద కూర్చుంది. టేబుల్ మీద మోచెయ్యి ఆన్చి, చెయ్యి గడ్డం కింద పెట్టుకున్నది. ఆమె ముఖంలో రంగు లేమిటో కూడా కన్పించడం లేదు.

"మీకు బాధ కలిగితే క్షమించాలి. నా బాధ నేను బయటకు చక్కాను. అది కడుపులో వుంటే అన్నం కూడా తినబుద్ధి పుట్టనంత భయంకరంగా తొలుస్తున్నది. ఎప్పుడో చెప్పాలనుకున్నా చెప్పలేక చివరకు ఈనాడు చెప్పగలిగాను".

"మనిద్దరి మధ్యా చాలా అంతరా లున్నాయండీ! కులరీత్యా, ఆర్థిక రీత్యా! పైగా నేను విధవను" తలవంచుకొని నెమ్మదిగా అంది. పుస్తకం అటూ ఇటూ తిప్పుతూ చూస్తున్నది.

"ఆ విషయం నాకు తెలుసు. మిమ్మల్ని మోసం చేయాలని నేను మాట్లాడడంలేదు. అన్నీ ఆలోచించుకొని చెబుతున్నాను. మావాళ్ళు వ్యతిరేకిస్తే మీతో పాటు నేనూ ఇక్కడే ఉంటాను".

దీపం వెలుగుతున్నది. ఆర్పివేయ డానికి పురుగు తంటాలుపడి ఎగిరి ఎగిరి లేవకుండా పడిపోయింది. బయట గందర గోళం సద్దుమణిగింది. అప్పుడప్పుడు కాకులు అరుస్తున్నాయి. గుండ్లకమ్మ పల్లటిగాలి ఎక్కువవుతున్నది. ఆకాశం మబ్బులు పట్టి, వర్షం కురవడానికి సిద్ధ పడుతున్నది. దాసం కేకలు వేస్తూ దూరంనుండి వస్తున్నాడు. అతడి కేకలు భయంకరంగా వినిపిస్తున్నాయి. మేరీ తొందరగా లేచి, తలుపులేసి గడియ వేసింది. తలెత్తి చూశాడు నాగిరెడ్డి.

"దాసం వస్తున్నాడు. మన ఇద్దర్నీ ఇక్కడ ఈ సమయంలో చూశాడంటే నీచంగా ప్రచారం చేస్తాడు. వాడు చూడక పోవడం మంచిది" అంది తలుపుకు ఆనుకొని నిలబడి. దాసం కేకలు మేరీ ఇంటిముందుకు రావడంతో ఆగిపోయాయి. కొంతసేపు నిశ్శబ్దం. తిరిగి కేకలేస్తూ "చూస్తాను; దీని అంతు చూస్తాను. మన తడాఖా చూపిస్తాను" అంటూ ముందుకు సాగాడు. ఆమె కళ్ళలో నీరు తిరిగింది. టపటప నేలన రాలి పడుతున్నాయి.

"ఏడుస్తున్నారా?" అన్నాడు ఆమె వైపు చూసి అదుర్దాగా.

"వీడు రోజూ ఇంతే! నోటికి వచ్చి నట్లల్లా పేలిపోతుంటాడు. ఎంత ధైర్యంగా ఉందామన్నా, ఈ మాటలు వింటున్నప్పుడు భయమేస్తున్నది. వాడు ఏం చేస్తాడేమోనని అనుమానం."

లేచి ఆమె వద్దకు వచ్చి కళ్ల నీరు తుడిచాడు వేలితో! ఆమె భుజం చుట్టూ చేతులు వేస్తూ "నాకు నీవూ, నీకు నేనూ తోడు! ఎవరడ్డమొచ్చినా నేను లెక్క చేయను" అన్నాడు. కన్నీరు కారుస్తూనే అతని భుజం మీద తల వాల్చింది మేరీ.

బయట టపటప చినుకులు పడుత న్నాయి. క్రమక్రమంగా వర్షం ఎక్కు వవుతున్నది. బయట మంచాలు వేసుకుని పడుకున్నవారు లేచేటప్పటికే గుడ్డలు తడిసిపోతున్నాయి. మంచాలు తొందరగా లోపల వేసుకుంటున్నారు. వర్షం నీరు మీద పడుతుండటంతో పిట్టలు 'కుహూ' 'కుహూ'మంటున్నాయి. కాకులు అరుస్తు న్నాయి. కోళ్ళు చలిని విదిలించుకొని తొలికూము కేకలు వేస్తున్నాయి. గుండ్ల కమ్మ పొంగుతున్న ఘోష విన్పిస్తున్నది. వీధుల్లో నీళ్ళు గలగలపారుతూ గుండ్ల కమ్మ గర్భంలోనికి జారుకుంటున్నాయి. అంతవరకూ వీధుల్లో పేరుకున్న చెత్తంతా నీటితో కలిసి గుండ్లకమ్మలో కలుస్తున్నది. కొట్టం చూరు నీళ్ళ

చప్పుడు వర్షం శబ్దం ముందు విన్పిం చడమే లేదు. వర్షానికి తోడుగా గాలి ఆరంభమయింది. చెట్లు హోరున శబ్దం చేస్తున్నాయి. వీటికి తాము అతీతుల మన్నట్లు కొట్టాలలో ఉన్న బర్రెలు నిర్మలంగా నెమరు వేస్తూ నిలబడ్డాయి.




ఆరోజు గ్రామం మళ్ళీ కలకలంగా తయారయింది. జనం గుంపులు గుంపులుగా కూడి చెప్పుకుంటున్నారు. కొందరయితే గ్రామంలోని మరుగు దొడ్డి వైపు పరుగులు తీస్తున్నారు.

మరుగుదొడ్డి కూలిపోయింది. పైన బండ వేయకపోవడం వల్ల వర్షానికి నాని నాని ఇటుకంతా తడిసి కూలిపోయింది. కూలడానికి కారణం సమపాళ్ళలో ఇసుక, సున్నం లేకపోవడమేనని అందరికీ తెలుసు. కట్టేటప్పుడే చాలా మంది చెప్పారు - ఇది అన్యాయమని. ఆ రోజు ప్రెసిడెంటు నిర్లక్ష్యంగా ప్రవర్తించినందుకు ఫలితం గోడ పడిపోవడమే కాక దాని కింద మనిషి పడి చనిపోయింది.

తెల్లవారు ఝామున ఒక ఆడ మనిషి మరుగుదొడ్డికి వెళ్ళి కూర్చున్నది. ఏ విధంగా గోడ విరిగి పడిందీ ఎవరికీ తెలియదు. ఆమె వీపు మీద పడింది. కూర్చున్నది కూర్చున్నట్లే ముందుకు బోర్లా పడి ఉంది. చనిపోయింది. జనం తలా ఒక మాట అంటున్నారు. మనుషు లను చంపడానికి మరుగుదొడ్లు కట్టార న్నారు. ఇరవై సంవత్సరాలుగా కట్టించని మరుగుదొడ్లు ఇంత తొందరగా ఎందుకు కట్టించవలసి వచ్చింది అంటు న్నారు.

ప్రెసిడెంటు ముఖం మీద నెత్తురు చుక్క లేదు. దానితో తనకేమీ సంబంధం లేదన్నాడు మునసబు. పోలీసులకు రిపోర్టు పంపాలి గనుక తలారి చేత పంపించాడు.

రామయ్య, నాగిరెడ్డి వచ్చి చూసి వెళ్ళారు. వెంటనే ఇది సమితిస్థాయిలో తీసుకెళ్ళాలని, అసలు ఏ నిధులతో ప్రెసిడెంటు ఇది కట్టాడో బహిర్గతం చేయాలనీ నిర్ణయించుకున్నారు. ఊరిలో ఈ తతంగం జరుగుతూ ఉండగానే రామయ్య ఒంగోలు వెళ్ళాడు. మధ్యాహ్నానికి పోలీసులు వచ్చారు. రిపోర్టు రాసుకుని శవాన్ని ఒంగోలుకు పోస్టుమార్టం కొరకు పంపారు. మెడికల్ రిపోర్టు తప్పు దారి పట్టించాలని ప్రెసిడెంటు కూడా ఒంగోలు వెళ్ళాడు. ఎలాగయినా కేసు నెత్తి మీదకు రాకుండా చూసుకోవాలని ఆయన ఆరాటం.

మూడు రోజుల తర్వాత పోస్టుమార్టం రిపోర్టు వివరాలు బయట పడ్డాయి. దెబ్బలు తగిలిన తర్వాత దాదాపు గంటవరకూ బతికే ఉందని, ఆ తర్వాతే చనిపోయిందని రిపోర్టు సారాంశం! రాళ్ళతో బలమైన గాయాలు వీపున తగిలాయనీ, వెంటనే వైద్య సహాయం అంది ఉంటే బతికేదని రాశారు. నాగిరెడ్డి పడిపోయిన మొండి గోడలు ఫొటోలు తీశాడు.

ఈలోగా పంచాయతీ అధికారులు

కూడా వచ్చి ఆ గోడ సందర్శించారు. అంత వరకూ ఎవడూ చూడని ఆ గోడ వేలమంది చూడదగ్గ ప్రదేశంలా తయారయింది. కట్టిన నాలుగు నెల్లో గోడ పడిపోయిందన్న నగ్న సత్యం కళ్ళ ముందు ఉండగా, ప్రెసిడెంటు తరపున సమితి ప్రెసిడెంటు ఎంత ప్రయత్నం చేసినా మాఫీ చేయడానికి సాధ్యం కాలేదు. పేలవంగా కట్టించడం వల్లనే ప్రమాదం జరిగిందనీ, దానికి బాధ్యత కట్టించిన కాంట్రాక్టరు అయిన ప్రెసిడెంటుదేననీ అధికారులు రిపోర్టు చేశారు. ఈ దెబ్బతో ప్రెసిడెంటు పదవి నుండి సస్పెండ్ కాక తప్పదని అందరికీ తెలిసిపోయింది. విచారణ జరిగి పూర్తిగా నిరూపితమయితే శిక్ష పడుతుంది. 'నిర్దోషి' అని తేలితే తిరిగి ప్రెసిడెంటుగా ఉంటాడు.

గ్రామంలో చాలా మంది ఊపిరి పీల్చుకున్నారు – ఈ విధంగానయినా ఇతడు దిగిపోతాడని! అతని వర్గానికి తల గొట్టినట్లయింది. అప్పారెడ్డి పడిపోవడమంటే రామయ్య ప్రెసిడెంటు కావడమే! ఏడు మెంబర్లలో నాలుగు వారికున్నాయి. అందువల్ల వారికి బలం పుంజుకోవడానికి అవకాశం దొరుకుతుంది.

రమేష్ తనకేమీ సంబంధం లేనట్లు ప్రవర్తించాడు. ఇద్దరి మధ్యా తాను ఇరుక్కుంటే దెబ్బతినవలసి వస్తుందని అతడికి తెలుసు. అందువల్ల ఎటూ రాకుండా ఉన్నాడు.

అప్పారెడ్డి ఇంటి వద్ద అతని వర్గమంతా సమావేశమయింది. భవిష్యత్ విషయాలు ఆలోచించుకొనుటకు సిద్ధపడుతున్నారు.

"ఈ రామయ్య అవకాశం ఉపయోగించుకుంటున్నాడు. పరిస్థితి ఇలా ఉంది. ఏం చేద్దాం?" అన్నాడు మునసబు.

"అవకాశం దొరికింది. ఉపయోగించుకున్నారు. పైగా గ్రామంలో అప్పారెడ్డి అంటే అందరికీ వ్యతిరేకమే. ఈ విధంగా జనానికి వ్యతిరేకమయితే మనం ఎన్నాళ్ళు నిలబడగలం? ప్రజలకు మనం అనుకూలంగా ఉండి ఉంటే ఈ కేసు మాఫీ చేసుకోగలవాళ్ళం. ఇప్పుడు మన మాట ఎవడూ వినడం లేదు. ఏ విధంగా అణచాలో ఆలోచిస్తున్నారు" అన్నాడు గురవయ్య.

"వాళ్ళతో రాజీ పడదాం బాగుంటుంది. కనీసం కేసు తోసివేస్తే ఆ తర్వాత చూద్దాం" అన్నాడు నాయుడు.

"గ్రామ విషయాల్లో కలిసి పని చేద్దామంటేనే రానివారు ఈ రోజు ఇందులో కలిసివస్తారా? ఇంత చక్కని అవకాశం దొరికితే వాళ్ళు రాజీకిరారు. ఆ ఆశలుఇంకా ఎందుకుగాని, వేరేమార్గం ఏదయినా ఉంటే చూడండి" అన్నాడు మునసబు.

తలోరకంగా మాట్లాడారు. ఒకరు చెప్పింది మరొకరికి నచ్చడం లేదు. చివరకు మునసబును రాయబారిగా చేసి, అతడు ఏ విధంగా మాట్లాడితే ఆ విధంగానే ఇష్టపడాలనుకుని నిర్ణయించారు. ప్రెసిడెంటు ఏమీ చెప్పలేదు. "మీ ఇష్టం" అన్నాడు. గతంలాగ గిదమాయించే స్థాయి దాటిపోయింది. నిలబడతాననే నమ్మకం అతనికే లేదు.

ఆ రోజే రామయ్యను కలిసి మాట్లాడాడు మునసబు "జరిగింది జరిగిపోయింది. రేపు ఇటువంటి సమస్య మీకూ రావచ్చు; సర్దుకునిపోదాం"

"గతాన్ని గురించి ఎందుకు బాబాయ్! మాకూ ఇలాంటి సమస్యలు వస్తే ఆరోజు

మేము ఎవరి కాళ్ళు పట్టుకోకుండా ఎదు ర్కొంటాం. అంతేగాని తప్పును కప్పి పుచ్చడం మాకు ఇష్టంలేదు. అప్పారెడ్డి కున్నట్లే మాకూ మనుషులున్నారు. వారికీ మేము నచ్చచెప్పుకోవాలి కదా. అందువల్ల సాధ్యంకాదు" అన్నాడు నాగి రెడ్డి.

"పిల్లకాకులు మీకేం తెలుసు? అనవ సరంగా రెచ్చగొట్టుకోవడమేగానీ! ఆలో చించుకోండి" అన్నాడు మునసబు.

"రమణారెడ్డీ ! మీకిష్టమయితే ఒక పరిష్కారానికి వద్దాం. ఆ విధంగా అయితే ఈ కేసు విషయంలో మేము జోక్యం కలుగచేసుకోము. ప్రెసిడెంటు పదవికి అప్పారెడ్డిని రాజీనామా ఇవ్వమను. ఎలాగూ కేసు పైకి వస్తే దానంతట అదే పోతుంది. కాబోయే ప్రెసిడెంటును మా తరఫున ఎవరినయినా ఏకగ్రీవంగా ఎన్ను కోవాలి. ఈ పద్ధతి మీద అయితే మేము సహకరిస్తాము" అన్నాడు రామయ్య.

"ప్రెసిడెంటు పదవికి అప్పారెడ్డి రాజీనామా ఇచ్చినా, అతడివర్గం వారే తిరిగి ఉండటం న్యాయం. ఎందుకంటే వాళ్ళు పోటీ చేసి గెలిచారుకాబట్టి!"

"అదెట్లా అవుతుంది? ఆ రోజు మేము సహకరించబట్టే గెలిచాడు లేకుంటే ఏ విధంగా గెలవగలడు ? పైగా పంచా యితీలో నాలుగు మెంబర్లు మావి. అతడివి మూడు. ఆ విధంగానయినా మాకే మెజా రిటీ ఉంది"

"మెంబర్లు మీకూ ఉండవచ్చు. అప్పుడు అందరం కలిసి పనిచేయడం వల్లే కదా మీరు సులుగురు గెలిచింది. లేకుంటే ఏ విధంగా గెలువగలరు ? కాబట్టి, ప్రెసిడెంటుగా అతడి వర్గం వారినే ఉంచి, అతన్ని తొలగింపచేద్దాం" అన్నాడు మునసబు.

"అతన్ని మనం తొలగించవలసిన అవసరమే లేదు. ప్రభుత్వమే తొలగి స్తుంది. ఆ విధంగా మాకు పరిష్కారం వీలుపడదు" అన్నాడు రామయ్య. రామయ్య ప్రెసిడెంటు కావడానికి ఈ ఎత్తు వేస్తున్నాడు అనుకున్నాడు మునసబు. చేసేదేమీలేక తిరిగి వచ్చి వివరాలు చెప్పాడు. అందుకు వీళ్ళు కూడా ఒప్పుకో లేదు. పల్లెటూళ్ళలో అధికారం గలిగిన పదవి పోగొట్టుకోవడం ఎవరికీ ఇష్టం ఉండదు. అందువల్ల గురవయ్య ఒక సూత్రం చెప్పాడు. "ఒకడినో ఇద్దరినో తీసివేస్తే సరి"

మునసబు మండిపడ్డాడు. "అనవస రంగా ఇప్పుడే ఇరుక్కుని ఛస్తుంటే, మళ్ళీ మధ్యన ఇటువంటి కుట్రలెందుకు ? మీరు వేలుదూర్చితే, వెంటనే కాలు దూర్చే వారున్నారు. మీరు మాటల్లో ఉండగానే, దానం లాంటి వాళ్ళు ఇటువంటి పనులు చేయడానికి సిద్ధంగా పరుగెత్తుతారు. తెలివితక్కువ పద్ధతులు ఆలోచించకండి. చిక్కుకున్న వల నుండి బయటకు రావ డానికి ఆలోచించండి"

"ఆ పంతులమ్మ ఎప్పుడు గ్రామంలో అడుగు పెట్టిందో, అప్పటినుండే మనకు దరిద్రం ఆరంభమయింది. దాన్ని ముందు తీసేస్తే సరి" అన్నాడు దానం మీసం దువ్వుతూ.

"నోరు మూసుకోరా వెధవా?" అన్నాడు మునసబు కసురుకుంటూ.

రాజీ పథకం తాత్కాలికంగా సద్దు మణిగింది. ఎవరి పనుల్లో వారు పడ్డారు.

ఆ రోజు రాత్రే దానం పూర్తిగా తాగి తూలుకుంటూ, తిట్టుకుంటూ పలెకు వెళ్ళాడు. మేరీ ఇంటి ముందు

మంచంలో కూర్చున్నాడు నాగిరెడ్డి. రత్నం, జయరావుతోపాటు మరికొందరు అక్కడ ఉన్నారు. వాళ్ళు అక్కడున్న విషయం తెలియని దానం, పల్లె ఆరంభం నుండి కేకలేస్తూ, తిట్టుకుంటూ వచ్చాడు. రచ్చబండ వద్దకు వస్తూనే "దానం" అంటూ పిలిచాడు నాగిరెడ్డి.

చీకటిలో సరిగా కన్పించకపోవడంతో "ఎవడు.... ఎవ్రడా వాడు" అంటూ గట్టిగా అరచి, కర్ర భూమికేసి బాదాడు.

"నాగిరెడ్డి పిలుస్తున్నాడురా! ఇటురా" అన్నాడు రత్నం లేచి నిలబడుతూ.

"నాగిరెడ్డి... ఎవడా నాగిరెడ్డి ?" అని పరుగు తీసుకున్నాడు. వెంట పడ్డారు అక్కడున్న వారందరూ. పల్లె చుట్టూ తిరిగి గ్రామంలోకి పరుగెత్తాడు. ప్రెసిడెంటు ఇంటి ముందుకు వచ్చే వరకూ ఆగలేదు. ఆయాసంతో ఒగరుస్తూ నిలబడిన దానాన్ని చూసి, అక్కడున్న వాళ్ళు కారణమడిగేలోగానే, వెంట తరిమిన వారు వచ్చి, దానం మీద పడి చేతులతో బాదసాగారు. ఈ హఠాత్ సంఘటనకు దిమ్మెరపోయిన కొందరు లేచి అక్కడి నుండి పారిపోయారు. మరి కొందరు విడిపించడానికి ప్రయత్నించారు. ఈలోగా మునసబుకు కబురువెళ్ళి ఆయన పరుగెత్తుకుంటూ వచ్చాడు. ఆ పాటికి రత్నం వాళ్ళు ఎవరూ లేరు. దెబ్బలు తిన్న దానాన్ని చూసి, ప్రెసిడెంటు అగ్గిలాగా అరుస్తున్నాడు.

మునసబును చూసి "రిపోర్టు రాయవయ్యా!" అన్నాడు.

"తొందరెందుకు? అసలు జరిగిందేమో తెలుసుకుందాం!" అన్నాడు మునసబు. "ఏరా దానం ! వాళ్లు ఎందుకు కొట్టార్రా నిన్ను?" దానం దగ్గరగా వెళ్ళి అడిగాడు.

"నేనేమీ అనలేదు రెడ్డీ! పల్లెలోకి వెళ్తుంటే, రచ్చబండవద్ద కాపువేసి వెంట బడ్డారు. ఇక్కడికి పరుగెత్తుకొని వచ్చినా పోనివ్వలేదు" అన్నాడు ఏడుస్తూ దానం.

"ఊరికెనే ఎందుకు తంతార్రా ? నన్ను తన్నమను చూద్దాం, ఎందుకు తంతారో?" అన్నాడు గోపయ్య కోపంగా దానంవెపు చూసి.

"తన్నడానికి కారణాలెందుకు? ఏదో ఒక పుల్ల విరుపుమాట చాలు. నా యింటి మీదకు వచ్చి తన్నే గుండెలు వచ్చాయి" అన్నాడు ప్రెసిడెంటు.

ప్రెసిడెంటు రిపోర్టు రాయాలన్నా నచ్చచెప్పాడు మునసబు.

"ఈ ముండాకొడుకులంతా పంతులమ్మ ఇంటివద్ద కూడుతున్నారు" అన్నాడు గురవయ్య.

అంత బాధలోనూ అరిచాడు దానం 'ఆ ముండ ఈ నాగిరెడ్డి గాడిని మరిగింది. అందుకే దానికి తలపొగరు. మీరు 'ఊ' అంటే దాని పొగరు నేను దించుతాను" అన్నాడు పండ్లుకొరికి.

"ఇప్పుడు అణచారు, చాలులేరా !" అన్నాడు గోపయ్య.

ఎవరూ మాట్లాడలేదు. ఏదో తగవు పెట్టుకొని వారిమీదపడి అణచలేకపోతే, రేపు ఇంట్లోనే పడవేసి తన్నినా దిక్కుండదనుకున్నారు. మునసబు శాంతింపచేయ యత్నించాడు. అతని శాంతి వచనాలు ఎవరూ వినడంలేదు.

రాత్రి ఒంటిగంట ప్రాంతంలో దానంతో పాటు నలుగురు మనుష్యుల్ని తోడిచ్చి పంపాడు ప్రెసిడెంటు పంతులమ్మను ఎత్తుకొని రమ్మని. ఐదుగురూ రచ్చబండవద్ద చేరారు. పంతులమ్మ బతుకు నాశనం చేసి, రచ్చ కీడ్చాలని

వారి ఆలోచన. రచ్చబండ ప్రాంతంలో ఎవరూ లేరు. తలుపు వద్దకువెళ్ళి చిన్నగా తోశాడు దానం. కదలలేదు. అందరూ బాగా తాగి ఉన్నారు. నిషా పైకి ఎక్కుతున్నది.

"సూరన్నా! పల్లె అంతా లేచివచ్చేటప్పటికి ఆలస్యమవుతుంది. లేచివచ్చినా ఇక్కడ మనల్ని ఏమీ చేయలేరు. తలుపులు ఎత్తి తీసి లోనికి వెళ్దాం. చప్పుడయినా భయం లేదులే" అన్నాడు దానం.

"ఏమోరా! పల్లె సంగతి నీకే తెలియాలి. నీ ధైర్యం! నీవు సిద్ధమంటే మేమూ సిద్ధమే!"

ఇంటికి వెళ్లి గడ్డపార తెచ్చాడు దానం. గడ్డ పలుగు తలుపు కిందదూర్చి పైకెత్తడం మొదలు పెట్టాడు. మిగిలిన నలుగురూ తలుపు చేత పట్టుకున్నారు. ఇద్దరు అటూ ఇటూ చూస్తున్నారు ఎవరయినా వస్తారేమోనని. తలుపు కిర్రుమంటున్నది. శబ్దం పెద్దగానే వస్తున్నది. తాగిన మత్తులో అది పెద్ద శబ్దంగా అనిపించడం లేదు.

ఈ శబ్దాలకు జనం లేచారు. కాని చీకటిలో బయటకు రావడానికి ధైర్యం లేక ఇళ్ళలోనే ఉన్నారు. గ్రామంలోనూ, పల్లెలోనూ కలతలు. దానాన్ని రాత్రి కొట్టడం! రత్నం, జయరావు కూడా బయటకు రాలేదు. చీకట్లో ఏమవుతుందో నని భయం. ఆ శబ్దాలు ఎక్కడినుండి



వస్తున్నాయో తెలియడం లేదు. రచ్చబండ ప్రాంతంలో ఉన్నవారికి ఆ శబ్దం పంతులమ్మ ఇంటివద్దేనని అనుమానంగా ఉంది.

తలుపులు లాగి కిందపడవేశారు అయిదుమంది. అంత శబ్దమవుతున్నా లోపలున్న మనిషి ఎందుకరవడం లేదనే ఆలోచనలే లేవు వారికి. లోపల మనిషి ఉంటే అరవకుండా ఊరక ఎందుకుంటుంది అని వాళ్లు ఆలోచించడం లేదు. తప్పతాగి ఉండడంతో, లోపల ఏముందో వారు తెలుసుకొనడానికి సిద్ధంగా లేరు. పంతులమ్మ కావాలి, ఎత్తుకెళ్ళాలి... అదే వారి ఆలోచన !

"అగ్గిపుల్ల గీయరా దానం" అన్నాడు గోవిందు. దానం అగ్గిపుల్ల గీశాడు. మేరీ మంచంమీద పడుకొనిఉంది కదలకుండా! మంచం పక్కనే ఉన్న దీపం వెలిగించాడు దానం. వెలుగు ఇంటినిండా కమ్ముకుంది. ఆ వెలుగులో రెండో మంచంలో మనిషి ఉన్నాడనీ, ఆ మనిషి మగవాడనీ అర్థం చేసుకునేటప్పటికి "ఇటు రారా దానం !" అన్నాడు మంచంలో లేచి కూర్చుని.

ఆ పలుకరింపుకు నిషాలో కూడా దిమ్మతిరిగిన నలుగురూ పారిపోవడానికి బయటకు పరుగెత్తారు. దానం పరుగెత్తకుండా నిలిచి వాళ్ళను పిలిచాడు— నాగిరెడ్డిని తన్ని అయినా పంతులమ్మను లేపుకెళ్లామని! వాళ్లు ఆడమనిషి ఒక్కతే ఉందంటే వచ్చారు. కాని, నాగిరెడ్డి సంగతి తెలియదు. తెలిసిఉంటే రాకుండానే ఉండిపోయేవారు. ఆ సమయంలో నాగిరెడ్డి కళ్ళ బడితే, రేపు ఉదయం తల పుచ్చలు పగులగొడతారని వారికి తెలుసు. అందువల్ల వెంటనే జారుకున్నారు. చేసేది లేక దానం కూడా పరుగెత్తడానికి కాళ్ళుచాపాడు. నాగిరెడ్డి లేచి, వెంటపడి దానం చొక్కా పట్టుకున్నాడు. విడిపించుకోవడానికి ప్రయత్నం చేసినా, రాత్రి కొట్టిన దెబ్బలమీదనే మళ్ళీ కొట్టడంతో అరుస్తూ కింద పడ్డాడు. మేరీ బెదురుతూనే లేచి దగ్గరగా వచ్చింది. "దండెం తాడు తీసుకొనివచ్చి కట్టెయ్యి" అన్నాడు. తాడు తెచ్చి కాళ్ళకు చుట్టింది. నాగిరెడ్డి దానం చేతులు విరిచి కట్టాడు. ఎదురింటి తలుపుతట్టి రాముడిని పిలిచాడు. "రత్నాన్ని, జయరావును తీసుకరా!" అన్నాడు. రాముడు ఒక్కడూ పోలేక కొడుకును వెంటపెట్టుకొని వెళ్లి తీసుకొని వచ్చాడు. ఒక్కొక్కరే అందరూ గుమిగూడారు. తలా ఒకదెబ్బ కొట్టారు.

"వీణ్ణి ఎత్తుకెళ్ళి గుండ్లకమ్మలో వేయండి, పీడవదుల్తుంది" అంటూ అరిచాడు ఏసు. యువకులు సిద్ధపడ్డా నాగిరెడ్డి వారించాడు. "కాలు విరిచివేయండి, జీవితాంతం సిగ్గొస్తుంది" అన్నాడు. బలవంతంగా పట్టి, దానం కేకలేస్తున్నా లెక్కచేయకుండా కుడికాలు మోకాలివరకు విరిచివేశారు. రక్తం కారుతుంటే చూడలేక మేరీ లోనికి వెళ్ళింది. ఆ సమయంలో కూడా అయ్యో పాపం' అనుకుంది.

"పోలీసు స్టేషన్‌కు రిపోర్టిద్దామా ?" అన్నాడు జయరావు.

"ఎందుకురా ! తీసుకెళ్ళి గ్రామంలో రచ్చబండ వద్ద పడేయండి. వాడి మిత్రులు సంతోషిస్తారు" అన్నాడు ఏసు. మన పల్లె జోలికి ఎవడొచ్చినా ఇంతే అని చెప్పండి" అంటూ అరిచాడు. ముసలాడే అంతగట్టిగా అరుస్తుంటే, యువకులకు ఉత్సాహం, ఆవేశం వచ్చింది. దానాన్ని మోసుకొని వెళ్ళి

గ్రామంలో రచ్చబండ వద్ద పడేసి వచ్చారు. ఆ పాటికే సంజమ్మ పరుగెత్తుకుంటూ వెళ్ళి ప్రెసిడెంటుకు చెప్పింది. పారిపోయి వచ్చినవాళ్ళు అంతకు ముందే చెప్పారు. మునసబుకు తెలిసినా ఇంట్లో నుండి బయటకు రాలేదు. ఈ విధంగా ప్రవర్తించవద్దని అతడుముందే చెప్పాడు. శాంతిగా వెళ్ళామని అతడు చెప్పేమాటలు ఎవడూ వినడంలేదు. అందువల్ల తాను తల దూర్చడం మంచిది కాదనుకున్నాడు. ప్రెసిడెంటు పిలిపించినా 'వస్తాను' అన్నాడు గానీ, బయటకు రాలేదు.

దానాన్ని ఎల్లాయపాలెం హాస్పిటల్‌కు తీసుకుని వెళ్ళారు. అక్కడి నుండి డాక్టరును వెంట తీసుకొని ఒంగోలు జనరల్ హాస్పిటల్‌కు వెళ్ళారు. పోలీసులకు రిపోర్టు ఇవ్వడానికి వెళ్తే "మీ ప్రాంతం పోలీసు స్టేషన్‌లోనే నమోదు చేయాలి" అన్నారు. సర్కిల్‌తో మాట్లాడి పాటికొండ పోలీసు స్టేషన్‌కి ఫోను చేసి పిలిపించారు. కేసు నమోదు చేసుకున్నారు.

రామయ్యకు రాత్రే ఈ వివరాలు తెలిసినా బయటకు రాలేదు. ఉదయం చూసుకోవచ్చు లెమ్మనుకున్నాడు. నాగిరెడ్డి వెంట ఎలాగూ జనం వున్నారు కాబట్టి, అతడు దెబ్బ తినవలసిన అవసరముండదనుకున్నాడు.

ఉదయం ఇంటికి వస్తూనే నాగిరెడ్డిని అడిగాడు రామయ్య. జరిగిన విషయం చెప్పాడు నాగిరెడ్డి. పంతులమ్మ మీదకు ఏ విధంగా వచ్చారో, కాలు విరిచివేయడం వరకు చెప్పాడు.

మధ్యాహ్నం అన్నం తింటుండే ఆలోచిస్తూ అడిగింది సరోజమ్మ.

"రాత్రి నీవు ఆ యింట్లో ఎందుకు వున్నావురా?"

తల ఎత్తి చూసి దించుకున్నాడు నాగిరెడ్డి. గతంలో పుకార్లు మాత్రమే విన్నది. ఈ సంఘటనతో, ఈరోజు ఆ యింటిలో వున్నట్లు గ్రామమంతటికీ తెలిసిపోయింది.

"ఏరా! పలుకవేం?" అంది అతన్ని చూస్తూ.

"ఆ పంతులమ్మను నేను వివాహం చేసుకోదల్చుకున్నాను".

"ఆ మాదిగదాన్నా? అందులో ఒకసారి ముండ మోసినదాన్నీ? ఒరేయ్! ఈ కూతలు మీ నాన్న వింటే, దానాన్ని విరిచినట్లే నీ కాళ్లూ విరిచి నోటిముందు అన్నం పడేస్తారు. సిగ్గు లేకపోతే సరి" అంది కోపంగా.

"అనవసరంగా నాకు తిక్క రేపకు. నేను నిర్ణయించుకున్నాక జరిగి తీరాల్సిందే" అన్నాడు కటువుగా.

"మీ బాబాయి రానీ! నీ సంగతి తేలుతుంది. నీవు కూడా గ్రామంలో మొనగాడివయ్యావురా! దాన్ని ముందు ఊచ విడిపిస్తే సరి" అంది అక్కసుగా.

అన్నం తిని లేచి "నేను వెతుక్కుంటూపోతాలే ఎక్కడున్నా" అంటూ బయటకు వచ్చాడు.

సాయంత్రం పొలానికి వెళ్ళి నీళ్ళు పెట్టమని పాలేరుకుచెప్పి స్కూల్ వద్దకు వెళ్ళాడు.

"ఇక్కడికి ఎవరయినా వచ్చారా?"

"ఎవరూ రాలేదు"అంది పంతులమ్మ.

అయిదు గంటలకు పిల్లలను ఇళ్ళకు పంపింది. ఆడుకుంటామని పిల్లలు అడిగితే "ఈరోజు వద్దు, వెళ్ళండి" అంది. పిల్లలు వెళ్ళిన తరువాత తలుపుకు తాళం వేసి ఇద్దరూ పల్లెవైపు నడిచారు. పల్లెలో

జనం ఎవరి ఇంటి ముందు వారు కూర్చున్నారు. ఆడుకునే పిల్లలు కూడా బజార్లలో లేరు. ఇంటి తాళం తీసి లోనికి వెళ్ళింది. ఆమెతో పాటు అతడు కూడా లోనికి వెళ్ళాడు. కాళ్లు, ముఖం కడుక్కుని బొగ్గుల కుంపటి వెలిగించి దానిపైన గిన్నె పెట్టి నీళ్ళు పోసింది.

"ఏం జరుగుతుందంటారు ?" అంది అతని ముఖంలోకి చూస్తూ.

"ఏమీ జరుగదు. నన్ను, రాముడు, రత్నం, జయరావును అరెస్టు చేసి తీసుకెళతారు" అన్నాడు నవ్వుతూ.

"అమ్మో ! మిమ్మల్ని పట్టుకెళితే ఎట్లా?" అంది గుండెమీద చెయ్యి వేసుకొని ఆదుర్దాగా.

"వారి భార్యలు కూడా అదే అంటారు. మరి జరిగిన పనికి తప్పదు కదా! వెంటనే బెయిలు మీద ఇళ్ళకు వస్తాం. అక్కడే వుండము కదా?" అన్నాడు ఓదార్పుగా.

"వారి భార్యల సంగతి వేరు. నా విషయం వేరు. మీరు గ్రామంలో లేకుంటే నన్ను మాటలతో పీక్కు బతుకనిస్తారా?"

ఏసు అక్కడికి వచ్చాడు. "ఏమన్నా వివరాలు తెలిశాయా రెడ్డీ?"

"పదిమంది మీద కేసు పెట్టారు"

"ఎలాగయినా కేసు తప్పదు. నేను చెప్పినట్లు గుండ్లకమ్మలో పారేసి వుంటే పీడపోయేది" అన్నాడు అక్కసుగా. ఒక్కొక్కరే అక్కడకు చేరుతున్నారు వివరాల కొరకు. మంచం బయట వేసు





కుని కూర్చున్నాడు నాగిరెడ్డి.

మేరీ కాఫీ ఇచ్చి "వంట పని చూసుకోవాలి" అంటూ లోనికి వెళ్ళింది. రచ్చబండ నిండా జనం కూర్చున్నారు.

నాగిరెడ్డి, పంతులమ్మ సమస్య అక్కడ అందరికీ తెలిసింది. పెళ్ళి చేసుకుంటారని కూడా తెలిసింది. ఆ పల్లెలోని వాళ్ళు ఇప్పుడు వారిని భార్యాభర్తలుగానే భావిస్తున్నారు. గ్రామంలో కూడా చాలా మందికి వివరాలు తెలుసు. గతంలో పుకారుగా భావించారు. రాత్రి దాసం పంతులమ్మ ఇంటి మీద దాడి చేయడంతో బండారమంతా బయటపడిపోయింది. ఇప్పుడు ఇక దాచిపెట్టాలని కూడా అతడు అనుకోవడం లేదు. దాచినా ఇక దాగదుమరి!

చీకటి పడింది. డిసెంబరు చలి వీస్తున్నది. ముదుసలులు వణుకుతూ ఇళ్ళలో దూరుతున్నారు. జయరావు, రత్నం కూడా వెళ్ళారు. రాముడు కూడా కొంత సేపుండి వెళ్ళాడు. మంచం తెచ్చి లోన వేశాడు నాగిరెడ్డి.

"నేను ఇంటికి వెళ్ళివస్తాను" అన్నాడు నాగిరెడ్డి.

"అమ్మో! నేను ఒక్కదాన్ని ఇక్కడ ఉండలేను" అంది భయంగా.

నాగిరెడ్డి నవ్వి "ఇప్పుడే వస్తాను. గ్రామంలోని వివరాలేమిటో, మా బాబాయి వస్తే ఒంగోలు వివరాలేమిటో తెలుస్తాయి. తెలుసుకుని వస్తాను" అన్నాడు.

"వద్దులెండి! ఉదయం వెళ్ళవచ్చు. రాత్రి మీరు లేకుంటే నాగతి ఏమయ్యేది" అంది లేస్తూ. చలివేస్తుంటే తలుపు వేసి, గడియ పెట్టింది. ఇద్దరూ ఎదురెదురుగా కూర్చున్నారుగాని ఏమీ మాట్లాడలేక పోయారు.

'ఇతన్ని అనవసరంగా కష్టపెడుతున్నాను' అనుకుంది.

'ఈమెను అనవసరంగా బాధపెడుతున్నానేమో?' అనుకున్నాడు.

"ఆస్తిపాస్తులన్నీ విడిచి అయినా నీ వెంట ఉంటానని ఆ రోజు ప్రమాణం చేశాను. నిన్ను విడిచి నేను మాత్రం బతుకగలనా?" అన్నాడు నాగిరెడ్డి.

అతడి హృదయానికి హత్తుకుని కన్నీరు విడిచింది మేరీ. "నాకు దూరమయితే నేను సహించలేను" అంది నెమ్మదిగా అతడి వీపు నిమురుతూ.




ఒంగోలు నుండి రామయ్య మరుసటి రోజు వచ్చాడు. అందరూ అతన్ని చుట్టుకున్నారు వివరాల కొరకు.

"మొత్తం పది మంది మీద కేసు పెట్టారు. అందులో ఒక ముద్దాయి పంతులమ్మ. ప్రథమ ముద్దాయి జయరావు" అన్నాడు.

"వాడి కాలు తిరిగి వస్తుందా?" అన్నాడు రాముడు.

"విరిగిన కాలు ఎలా వస్తుంది. దాన్ని అతికించ గలిగిన డాక్టర్లు ఇక్కడ లేరు. ఏ అమెరికాకో వెళ్ళాలంటే ప్రెసిడెంటు ఆస్తి అమ్మినా వాడి కాలుకు అయ్యే ఖర్చుకు చాలదు. ప్రెసిడెంటు మాత్రం ఎందుకు ఖర్చు భరిస్తాడు?"

"పోనీలే! వాడికి కాలు తిరిగిరాకుంటే పల్లెలో కుక్కలా పడి వుంటాడు" అన్నాడు రత్నం.

అందరూ వెళ్ళిన తరువాత నాగిరెడ్డిని పిలిచి "సమితి ప్రెసిడెంటు రాజీ ప్రయత్నం చేస్తాను, ఇకముందు పోట్లాడుకొనకండి అన్నాడు. నేను జవాబివ్వలేదు. అందరినీ సంప్రదించి ఆలోచించి చెబుతానన్నాను. మునసబు కూడాఏదో విధంగా ఐక్యంగావుండే ఏర్పాటు చేయాలన్నాడు. ఏం చేద్దాం?" అన్నాడు.

"నీ యిష్టం బాబాయ్! నీవు ఎలా చెబితే అలాగే చేద్దాం. ఏది చేసుకున్నా ఇంతవరకూ మన వెంట వున్న వారికి నష్టం లేకుండా చూడాలి. వాళ్ళు మొదటి నుండి మనవెంట వున్నవారు. వారిని దూరం చేసుకుంటే ఆ తర్వాత మనం ఏకాకులమవుతాం" అన్నాడు నాగిరెడ్డి.

"అంత తెలివి తక్కువ పని ఎందుకు చేస్తాం. ఒకవేళ సంధి ప్రసక్తి వచ్చినా, పంచాయతీ బోర్డు మన చేతికి వచ్చే విధంగానే చేసుకోవాలి. లేకుంటే ఈ సంధి వల్ల లాభమేమిటి? ఈలోగా మురికి కాల్వలు బాగు చేయడానికి మనవాళ్ళను సమాయత్తం చెయ్యి. కాల్వలు తీసినట్లూ వుంటుంది. అదే తోవలో వేస్తే రోడ్డు ఎత్తుకు పనికి వస్తుంది".

మధ్యాహ్నం అన్నం తినేటప్పుడు రామయ్య భార్య నారాయణమ్మ ప్రస్తావించింది నాగిరెడ్డి విషయం. రామయ్య ఆశ్చర్యంగా చూసి "వట్టి పుకారు అనుకున్నాను. నిజమేనన్నమాట!" అన్నాడు.

"నువ్వే అడుగు చెబుతాడు. మా వదిన చెప్పినా, మీ అన్న చెప్పినా, నేను చెప్పినా వినడంలేదు. పెళ్ళి చేసుకుంటాడట. ఇంత బరితెగించి ప్రవర్తిస్తే ఎలా? వాణ్ని అప్పారెడ్డిమీద వైరానికి ఎంచుకున్నావు. ఆ విధంగా వాడు ముందుకు తయారయ్యాడు. అన్నింటిలోనూ ముందుకే పోతున్నాడు. ఆ వెధవ ముండను తెచ్చి ఇంట్లో పెడితే ఇంకేమన్నా ఉందా?"

"నేనూ మాట్లాడతాలే! అయినా వాడు వింటాడన్న నమ్మకమూ లేదు. మొదటి నుండీ ఒకటే పద్ధతి. పైగా ఆ అమ్మాయిని తోసివేస్తామనుకో; ఎదుటివాళ్ళ మనల గురించి కూడ నీచంగా ప్రచారం చేస్తారు. చివరకు ఆడపిల్లల్ని అల్లరి పట్టించేవారిగా జమకడతారు."

"అంటే నీవు కూడా వాడికి వత్తాసు పలుకుతున్నావా?''

''ఎంతసేపూ మీ ఇంట్లో రాదేకానీ, బయట పరిస్థితి చూడవద్దా! ఆలోచిద్దాం. తొందరెందుకు?" అని లేచి బయటకు వచ్చాడు.

మరుసటిరోజు నలభైమందిని పోగుచేసి మురికి కాల్వలు తవ్వడం ఆరంభించారు. సమితి ప్రెసిడెంటు వచ్చేలోగా ఇటువంటి పనులు కొన్ని చేసి, అప్పారెడ్డి కంటే తామే మెరుగైనవాళ్ళమని చూపించి, పంచాయతీ ప్రెసిడెంటు పదవి పొందడానికి రామయ్య ఆలోచిస్తున్నాడు. అందువల్లనే జనాన్ని పోగుచేయడానికి నాగిరెడ్డిని నియమించాడు. గ్రామంలో ఈ సమయంలో ఉన్న ఆకర్షణ నాగిరెడ్డిదే! నాగిరెడ్డి పిలిస్తే రానివాడు లేడు. ఉదయం నుండి మధ్యాహ్నం ఒంటిగంట దాకా కాలువ తవ్వి మట్టిబాటలో పోసి చదును చేశారు. దానిపైన అరఅడుగు మందం గుళకరాయి పరుస్తే రోడ్డు గట్టిపడుతుంది. వర్షాకాలమయినా కాలికి

 

బురద కాదు. ఆ మట్టి తోలించాలంటే లారీలలో ఇతర ప్రాంతాల నుండి తోలించాలి గనుక సమితి నుంచి గ్రాంట్లు అవసరం. గ్రామంలో ఎన్నిసార్లని చందాలు ఇస్తారు? ముందు చదునుచేసి సిద్ధంగా ఉంచాలనుకున్నారు.

రెండవరోజు కాల్వలు తీస్తుండగా వ్యానులో పోలీసులు వచ్చారు. పదిమంది పోలీసులు, యస్. ఐ., సర్కిల్ ప్రెసిడెంటు ఇంటివద్దకు వస్తే ఆయన లేడు. మునసబును పిలిపించాడు సర్కిల్. మునసబు వచ్చిన తరువాత ముద్దాయిల విషయం అడిగాడు "ఎక్కడుంటారు? అరెస్టుచేసి తీసుకెళ్ళాలి"

"ఊర్లో మురికి కాల్వలు తీస్తున్నారు సార్! అందరూ అక్కడే ఉంటారు'' అన్నాడు మునసబు.

''అక్కడికి వెళ్దాం పద" అంటూ లేచాడు సర్కిల్. మునసబు దారి చూపించాడు. వీరు వస్తున్నది రామయ్య చూశాడు. ఎలాగూ వస్తారని ఇంతకు ముందే అనుకున్నారు. అరెస్టు చేస్తారని కూడా తెలుసు. అందువల్ల పారిపోవడం మంచిదికాదని ఎవరిని వెళ్ళవద్దన్నాడు. మునసబు రామయ్యను పరిచయం చేశాడు సర్కిల్‌కు.

పదిమందిలో తొమ్మిది మందిని అక్కడ అరెస్టు చేశారు. పదో ముద్దాయి టీచర్ కొరకు ఇద్దరు కానిస్టేబుల్లనూ, తలారిని పంపారు. పోలీసులను చూసి, రచ్చబండ మీద ఉన్న పిల్లలు ఇళ్ళలోనికి పారిపోయారు. పంతులమ్మ వారిని చూసి "ఏమిటి?" అంది ప్రశ్నార్థకంగా. దానం వాళ్లు విరిచిన కేసులోని పదిమంది ముద్దాయిలలో పంతులమ్మ ఒకరు. 'అందువల్ల మిమ్మల్ని సర్కిల్ తీసుక రమ్మని పంపించారని' వాళ్ళు చెప్పారు.

"ఎక్కడున్నాడు సర్కిల్?"

"గ్రామంలో ఉన్నాడు.''

తలుపుకు తాళంవేసి వారి వెంట కదిలింది. పిల్లలూ, పెద్దలూ—పోలీసులనూ వారివెంటవెళ్తున్న పంతులమ్మనూ చూస్తూ నిలబడ్డారు భయంగా! ఆమెను ప్రెసిడెంటు ఇంటివద్దకు తీసుకువచ్చేసరికి, మిగిలిన వారిని కూడా అక్కడకు చేర్చారు. పిల్లలూ, పెద్దలూ ఆసక్తిగా అక్కడికి వచ్చిచూసి పోతున్నారు. మజానగరం నుండి కూడా చాలా మంది వచ్చారు. ప్రత్యేకంగా ఎలిశమ్మ వచ్చి మేరీని పలుకరించి వివరాలు మాట్లాడి వెళ్ళింది.

ప్రెసిడెంటు ఇంటిలోనే పోలీసులు భోజనం చేసిన తర్వాత సాయంత్రం నాలుగు గంటలకు అందరినీ వ్యానులో చేర్చి పాటికొండ పోలీసు స్టేషన్‌కు బయలుదేరారు. వెళ్తూ ''రేపు కోర్టులో హాజరుపరుస్తాము. జామీనుదారులను తెచ్చుకొని విడిపించుకోండి'' అని చెప్పాడు సర్కిల్.

మరుసటి రోజు నలుగురిని తీసుకొని ఒంగోలు వెళ్ళాడు రామయ్య. వారితో పాటు మునసబుకూడా వెళ్ళాడు. అందరికీ జమీను ఇప్పించి విడుదల చేయించారు.

"పోలీసు పుణ్యమా అని చార్జీ లేకుండా ఎలాగో ఒంగోలు చేర్చారు. ఇంటికి వెళ్లి అమ్మనూ, తమ్ముణ్నీ చూసి వద్దామండీ !" అంది మేరీ నవ్వుతూ నాగిరెడ్డితో.

"ఇదీ ఒకందుకు మంచిదే! వెళ్లి వద్దాం పద" అంటూ రిక్షాలో వెళ్లిపోయారు ఇద్దరూ.

మునసబు ప్రెసిడెంటును కలిసి వివరాలు చెప్పాడు.

"అప్పారెడ్డీ! నీవు ఏకాకివవుతావు. వాళ్లు జనంలోకి వెళ్తున్నారు. నీవూ, నీ మనుషులు జనాన్ని బెదరిస్తున్నారు. పైగా నీ మీదకూడా ముఖ్యమైన కేసుఉంది. ఆలోచించుకో!"

ప్రెసిడెంటు ఆలోచిస్తున్నట్లుఉన్నాడు. పరిస్థితులు తనకు ఎదురు తిరుగుతున్నట్లే ఉన్నాయి. కోర్టుకెక్కిన కేసులు గ్యారంటీగా నిలబడతాయని ఈ దేశంలో ఎవరికీ నమ్మకంలేదు. డబ్బులు విసిరి వేస్తే హత్యకేసులుగా నిర్ధారణ అయిన కేసులు సహితం తేలిపోతున్నాయి. ఇటువంటి తగాదాలు గొప్పవికావు. పైగా ఒకరిద్దరు గాదు. కలిసి కట్టుగా వాళ్లు అందరూ నడుస్తున్నారు. ఇటు చూస్తే తన డబ్బు తిని తిరిగేవారు ఎక్కువమంది. డబ్బు పెట్టుబడి పెట్టకుంటే ఎవరూ కలిసివచ్చే ప్రయత్నం చేయరు. ఒంటరిగా ఎంత సేపని పోరాడడం?

"సమితి ప్రెసిడెంటు జయనారాయణ వస్తానన్నాడు. ఆయనతో మాట్లాడదాం. ఆయన చెప్పింది చేద్దామనుకున్నాను" అన్నాడు ప్రెసిడెంటు. మునసబు మాట్లాడ లేదు.

"నాగిరెడ్డి, పంతులమ్మ పెళ్లిచేసు కుంటున్నారట నిజమేనా?"

మునసబు తలూపాడు. "వాడు చేసు కుంటాడు. వాడు పట్టిందిపట్టు".

"రామయ్యగానీ, సుబ్బయ్యగానీ వ్యతిరేకించలేదా?"

"వ్యతిరేకించారు. చేసుకునే వాడు వాడయితే వ్యతిరేకించి ఏం చేస్తారు? పైగా ఈ కుర్రకారు సహకారంలేకుండా రామయ్య నీ మీద పోటీకి నిలబడగలడా? కుర్రకారుకు వాడు నాయకుడు. రామయ్య మాత్రం ఏంచేస్తాడు? అలాగని ఇంతవరకూ ఒప్పుకోలేదనుకో! అయినా తప్పని స్థితి. సరోజమ్మ అన్నం తినకుండా ఏడుస్తున్నదట."

"చివరకు మాదిగదాన్ని పెళ్లాడి ఊళ్లో కోడలిగా ఇంటికి తెస్తున్నాడన్న మాట?"

"ఏముంది అప్పారెడ్డీ! మనలాంటి పల్లెటూళ్లలోనే పట్టింపులు గాని, పట్టణాలలో ఎవరూ ఇటువంటి విషయాలు పట్టించుకోరు. అయినా వారి పద్ధతి వారిది. వాళ్లతో ఇష్టమున్న వాళ్లు కలుస్తారు; లేనివాళ్లు వ్యతిరేకిస్తారు. మనమయినా అంతే" అన్నాడు మునసబు.

ప్రెసిడెంటు మాట్లాడలేదు. మరునటి రోజు ఉదయం మునసబు గ్రామానికి ప్రయాణమయ్యాడు. "నేనూ వస్తున్నాను పద" అన్నాడు ప్రెసిడెంటు. ఇద్దరూ బస్టాండుకు వచ్చేటప్పటికి ఎల్లాయపాలెం బస్సు సిద్ధంగా ఉంది. ఆ బస్సులోనే ఎనిమిది మంది ముద్దాయిలతో పాటు జామీనుదారులు, రామయ్య వచ్చారు. అందరూ తాడూరు అడ్డరోడ్డు వద్ద దిగి నడక సాగించారు. వారు వీరినిగాని, వీరు వాళ్లను గాని పలుకరించుకోలేదు. వెనుకా ముందుగా సాగారు.

వారం రోజుల తర్వాత సమితి ప్రెసిడెంటు జయనారాయణ మోదేపల్లెవచ్చాడు. ఆయనవెంట మరికొందరు వచ్చారు. జీపు ప్రెసిడెంటు ఇంటిముందుకు వచ్చిఆగింది. వీరు వస్తున్నట్లు ముందుగనే తెలియడంతో అందరూ ఇళ్ళవద్దే ఉన్నారు. నమస్కార ప్రతినమస్కారాలయ్యాక కాఫీలు తాగుతూ కూర్చున్నారు. మునసబుకూడా అక్కడకు వచ్చాడు.

"గ్రామంలో రోడ్లు, కాలవలు బాగా పనిచేయిస్తున్నారు. మీ పంచాయతీకి




డబ్బు పుష్కలంగా ఉన్నట్లుందే?" అన్నాడు జయనారాయణ నవ్వుతూ. ప్రెసిడెంటు జవాబివ్వకుండా ముఖం మాడ్చుకుని తలవంచుకున్నాడు.

మునసబు "అది పంచాయితీ డబ్బు కాదండీ! మా ఊరిలో యువజనసంఘం అని కుర్రకారు ఉంచివెండి. వాళ్లు బావి పూడిక, రోడ్లు, కాల్వలు చందాలు వసూలు చేసి కార్యక్రమాలు సాగిస్తున్నారు" అన్నాడు.

"మా గ్రామం కుర్రకారు మంచిపనులే కాదండీ, చెడ్డపనులు కూడా చేయడంలో ఆరితేరినవారే! మొన్న దాసం అనేవాడిని కాళ్లు విరిచింది కూడా ఈ కుర్రకారే!" అన్నాడు గురవయ్య.

"సరే! మళ్లీ నేను తొందరగా వెళ్ళాలి. అటుపక్షం ఎవరెవరో పిలిపించండి. నాలుగు మాటలు మాట్లాడి వెళ్తాను" అన్నాడు జయనారాయణ. ఎవరు వెళ్ళినా రావడం సందేహమేనని, మునసబు వెళ్లి రామయ్యతో మాట్లాడి తీసుకుని వచ్చాడు. అతనితో పాటు నాగిరెడ్డి, మరికొందరు యువజనులుకూడా వచ్చారు. పలకరింపులు అయ్యాక "రామయ్యా! ఏమిటో చెప్పండి. అనవసరంగా తగాదాలు ఎందుకు? కలిసివుంటే ఏదయినా సాధించవచ్చు. పోట్లాడుకుంటూ ఉంటే ఏ సౌకర్యాలు సాధించలేం. జరిగిందేదో జరిగిపోయింది ఇప్పటినుంచయినా కలిసి నడుచుకోండి. అన్నాడు.

"ఇంతవరకూ మాకు చేతనయినంత



పరకూ అధికారం లేకున్నా గ్రామంలో మంచి పనులే చేశాము. ఇకముందు కూడా ఇట్లే చేస్తాము. రౌడీలను మా మీద ఉసి గొల్పితే మేం నోరు మూసుకొని పడివుండము. వాళ్లకు తగినట్లు బుద్ధిచెప్పి తీరుతాము. దానంగాడు పల్లెకు రౌడీ. పల్లెలో అందరినీ తన్నడం, కొట్టడం, తిట్టడం వాడి హాబీ. అటువంటి వాళ్లకు సపోర్టు చేస్తే మాకెంత బాధగా ఉంటుంది. పైగా పంతులమ్మను ఎత్తుకు వెళ్లడానికి ప్రయత్నం ?"

"అలాగంటే ఎలాగయ్యా ! గ్రామానికి ఉపాధ్యాయుడివి నువ్వు. ప్రెసిడెంటు, వైస్ ప్రెసిడెంటు కలిసి పనిచేస్తే గ్రామం ఎంత బాగుంటుంది? మీ సమస్యలుంటే చెప్పండి సరిదిద్దుకుందాం"

"అయిందేదో అయింది రామయ్యా! జరిగినవన్నీ మళ్లీ రేకెత్తించుకోవడం ఎందుకు ? వాటిని పట్టుకొని పోట్లాడుకోవడం ఎందుకు? కలిసేదానికి వీలుంటే చూడండి"అన్నాడు మునసబు.

"మీ సమస్యలేమిటి చెప్పండి అప్పారెడ్డీ ? నీవు పలుకకుండా కూర్చుంటే ఎట్లా? నీ ఉద్దేశమేమిటో చెప్పు"అన్నాడు జయనారాయణ.

"మీరెట్లా చెబితే అలాగే చేస్తానన్నాను గదా! మళ్లీ చెప్పేదేముంది. మీరే చెప్పండి" అన్నాడు ప్రెసిడెంటు.

"నీ విషయం చెప్పు రామయ్యా!"

"ఇక్కడ కలిసి పనిచేయడమంటే ప్రెసిడెంటుపదవి మాకు రావాలంటున్నారు మావాళ్లు. ఆ విధంగా అయితేనే ఒప్పుకో మంటున్నారు. లేకుంటే కాదంటున్నారు."

"అదెట్లా?ఆయన ఎన్నికై సంవత్సరం కాలేదు. దిగమంటే మర్యాద ఉంటుందా? ప్రజలెన్నుకున్న వ్యక్తి కదా ?"

"ఆ ప్రజలం మేమేకదా! పైగా మెజారిటీ మాకున్నా ఆ పరిస్థితులలో ఆయనను బలపరచవచ్చి బలపరచాం. పోటీ చేస్తే మేమే గెలిచేవాళ్ళం" అన్నాడు నాగిరెడ్డి.

"ఇంకా సమస్యలుంటే చెప్పండి."

"దానం మా మనుషుల్ని కొట్టినా మేము కేసుపెట్టలేదు. వాణ్ని మావాళ్లు కొట్టినందుకు కేసు పెట్టారు. ఇది ఉపసంహరించుకోవాలి."

"ఇది కొట్టడం కాదులే రామయ్యా ! కాళ్లు విరిచేయడం, కొట్టడం ఒకటే అంటే ఎట్లా !" అన్నాడు మునసబు.

"ఇంకా?"

"గ్రామంలో బావుల పూడిక తీయడం, మురికి కాల్వలు, రోడ్లు బాగుచేయడం వీటికయిన ఖర్చు పంచాయితీ యే భరించాలి. కాబట్టి వాటి డబ్బులు మాకు వాపసు ఇవ్వాలి"

"ఇంకా !"

"స్కూలు ఫర్నిచర్ ఏర్పాటు చేయాలి. పిల్లలు కింద కూర్చుని రోజుకో జతగుడ్డలు మసి చేసుకుంటున్నారు. టీచర్ రాయటానికి బ్లాక్‌బోర్డ్, కూర్చోటానికి కుర్చీకూడా లేదు" అన్నాడు రమేష్. జయనారాయణ అతని వైపుచూసి,

"సరే అప్పారెడ్డి! నీ సమస్యలు కూడా చెప్పు!"

"నా విషయాలు మీకు తెలుసు. ప్రత్యేకంగా ఏంచెప్పాలి? మీరు చెప్పినట్లే చేస్తానని ఇంతకు ముందే చెప్పాను."

"సరే ! మీరు గ్రామంలో అందరూ కలిసి ఉండాలనీ, కలిసి పనిచేయాలనీ నా ఉద్దేశం. అందరూ కలిసి ఉంటే




తాడూరు అడ్డరోడ్డునుండి మోదేపల్లె వరకూ రోడ్డుకూడ మంజూరు చేయించుకోవచ్చు. బస్సుకూడా వెంటనే ఏర్పాటు చేసుకోవచ్చు. స్కూలుకు అన్ని సౌకర్యాలు ఏర్పాటు చేయిస్తాము. ఫోన్ సౌకర్యం, కరెంటు సౌకర్యం కూడ వేయిస్తాము. ప్రధానంగా ఒకరిమీద ఒకరు పెట్టిన కేసులు ఉపసంహరించుకోండి. అప్పారెడ్డి మీద పెట్టిన కేసు కూడా ఉపసంహరించుకోవాలి. పోతే ప్రస్తుతం గ్రామంలో ఉన్న పరిస్థితిని బట్టి, జనంలో రామయ్యకే కొంత ఎక్కువ అభిమానం కన్పిస్తున్నది.ఐదేండ్ల పంచాయితీ పరిపాలనలో చెరిసగం ప్రెసిడెంటు బాధ్యతలు తీసుకునే విధంగా చేసుకుందాం. మరో సంవత్సరంన్నర తర్వాత రామయ్యకుగాని, అతని వర్గంలో మరొకరికిగాని ప్రెసిడెంటుపదవి ఇవ్వాలి. గ్రామం బాగుకొరకు కొంత ఖర్చు చేశారు. అవి పెద్దమొత్తాలు కూడా కావనుకోండి. దాన్ని మీరు గ్రామంలోనే ఏదో విధంగా సర్దుబాటు చేసుకోండి. మీకిష్టమయితే ఈ విధంగా కలిసి పనిచేయండి. ఇందులో ఒకరిని కిందకు తోసి ఒకరిని పైకిలేపటమంటూ నేను చేయలేదు. మీరందరూ నాకు కావలసినవారనే ఇంత దూరం వచ్చాను" అన్నాడు జయనారాయణ.

రెండు వర్గాలవారు అందుకు ఒప్పుకున్నారు. కుర్రకారులో ప్రెసిడెంటు పదవి తమకు రాలేదని సణుక్కున్నా, సర్దుకోక తప్పలేదు. సమితి ప్రెసిడెంటు జయనారాయణ వెళ్ళిపోయాడు. అయన వెళ్తూనే రామయ్యవాళ్లు కూడా వెళ్లారు. మునసబు కూడా వెళ్ళిపోతూ "ఇదే మంచిది అప్పారెడ్డీ! మరుగువొడ్డి కేసు నీ నెత్తిన ఉంది. దానివల్ల ఎలాగు ప్రెసిడెంట్ పని పోవడం తప్పనిసరి. కేసుపోయి సగంకాలం ప్రెసిడెంటు పదవి నిలబడినా మంచిదేకదా! వచ్చే ఎన్నికల పరిస్థితి బాగుంటే చూసుకోవచ్చు." అన్నాడు. అప్పారెడ్డి జవాబు యివ్వలేదు.

ఈ విషయంలో కొంత అపజయం, కొంత విజయం సాధించినా, ఇక ఇంటి సమస్య పెద్దదిగా తయారయింది రామయ్యకు. సరోజమ్మ ఏ చెరువులోనో దూకి ఛస్తానంటోంది. తొందరగా దూకి ఛస్తే పీడపోతుందని నాగిరెడ్డి అంటున్నాడు. గ్రామంలో ఉన్న విషయాలతో నాగిరెడ్డి,పంతులమ్మ పెళ్ళిగురించి ప్రముఖంగా ఎవరూ పట్టించుకోలేదు. పైగా ఎవరైనా వ్యతిరేకించి మాట్లాడితే కుర్రకారుతో తగువులు వస్తాయి. కులం చెడుతున్నది నాగిరెడ్డి గనుక అతడి బాధ అతడే పడనివ్వమని అనుకున్నారు గ్రామస్థులు. ఈ పెళ్ళికి గ్రామంలో ఎంతో వ్యతిరేకత వస్తుందని ఊహించినవారు కూడా చివరకు ఎవరంతకువారు సర్దుకోవడంతో ఆశ్చర్యపోయారు.

పెళ్ళి అట్టహాసం లేకుండా నిరాడంబరంగా జరిగినా, పైనుంచి నాయకులు, అధికారులందరినీ పిలిపించారు. అధికారులు ఆదర్శవివాహితులను దీవించి వెళ్ళారు.

నాగిరెడ్డి చెల్లెలు "టీచరొదినా! టీచరొదినా! మనిద్దరం కలసి చెయ్యో చెయ్యో కలుపుకొని,నేస్తంగా స్కూలుకు వెళ్దాం! ఏం?" అంది.

"తప్పకుండా! రోజూ వెళ్దాం. స్కూలులో నీకు,నాకు స్నేహం. ఇంటిలో ఈయనకూ, నాకూ స్నేహం" అంది రాజ్యం జడబట్టి అటూ ఇటూ ఊగిస్తూ.



# ధోరణి

"నమస్కారం డాక్టరుగారూ"

"నమస్కారం. కూర్చోండమ్మా"

"అలాగే డాక్టారూ"

"ఇప్పుడు చెప్పండి మీ బాధేమిటో?"

"ఏం చెప్పమంటారండీ బాబూ నా బాధలు. ఒకటా రెండా ... ఎన్నని చెప్పను?"

"పోనీ అసలు మీ వ్యాధేమిటో చెప్పండి"

"అదేమిటో తెలిస్తే మీదగ్గరకెందుకండీ రావటం? నే నే డాక్టర్నయిపోయే దాన్నిగా"



"సరే మీవ్యాధి లక్షణాలేమిటి!"

"ఏం చెప్పమంటావు డాక్టరు బాబూ. ఒకటే ఆకలి. మళ్ళీ ఏంతిన్నా అరగదు. కూర్చుంటే ఆయాసం. నుంచుంటే నీరసం. ఇంకా..."

"సరె సరె. పొద్దున్నే మీరు ఏం తీసుకుంటారు?"

"ఏం తీసుకుంటారంటే ఏం చెప్పను? ఏం తీసుకోవాలన్నా ఆ ఇంట్లో కుదురుతుందిటండీ. నిజానికి అసలది ఇల్లుటండీ నా ప్రాణానికి సొలెగూడు కాని"

"అది సరె. నేనడిగిందానికి జవాబు చెప్పండి."

"అదేనండీ చెప్పేది. మీరెరుగుదురో లేదో మా అప్పి దయ్యాన్ని. అదేనండీ మా పని చచ్చిందాన్ని. అదసలు ఒకవేళ కొస్తుందంటారా? ఒక పూటవస్తే నాలుగు పూటలు నాగా. అసలే నాకు కాఫీ గొంతులో పడితే కాని ప్రాణాలు గూట్లోకి రావయ్యె."

"అయితే మీరు పొద్దున్నే కాఫీ తాగుతారన్నమాట. మరి కాఫీతో బాటు బిస్కట్లు లాంటివేమన్నా తినే అలవాటుందా ?"

"బిస్కట్లా ? అయ్యో రామా! మీరే లోకంలో వున్నారు డాక్టారూ. బిస్కట్లు, బిళ్ళలూ కొనేటట్లు వున్నాయిటండీ. పూర్వం నా చిన్నతనంలో కానీ పెడితే గుప్పెడు బిస్కట్లు వచ్చేవి. యిప్పుడు రూపాయి పెట్టినా నాలుగు రావే. పిల్లవెధవలకే బిస్కట్లు కొనిపెట్టలేకుండా వున్నాం కదా యిహ బిస్కట్ల ఫలహారమా-బాగానే వుంది..."

"సరి సరి– పోనీ ఇడ్లీ, దోశలాంటివి ఏవైనా తీసుకుంటారా?"

"అలా అడగండి చెప్తాను. ఇడ్లీలంటే నిజంగా నాకు ప్రాణం. మీరు నమ్మరు కాని మా ఆయన కూడా ఇడ్లీలంటే పడి చస్తారు. ఆదివారమన్నా ఇడ్లీవేయవే

# కతలు

తాయారూ అని నోరు విడిచి అడుగుతారు కూడా. అయినా ఇష్టమని చెప్పి ఇడ్లీలు ఊరికే వస్తాయిటండీ. రెక్కలు పడిపోయేటట్లు పిండి రుబ్బాలా?– అసలు రుబ్బటం అనే మాట వింటేనే నాకు ఆయాసం వస్తుంది కదా."

"ఈ సోదంతా ఎందుకమ్మా. అసలు సంగతి చెప్పండి."

"అన్నారూ ? అంత మాట మీరూ అనేశారూ? మా ఆయన లాగానే మీరూ నామాటలు సోది అంటున్నారూ..."

"మీ మాటలు వింటుంటే నాకు పిచ్చెక్కేటట్లు వుంది. మీరు మరో డాక్టరు దగ్గర




కెళ్ళండమ్మా."

"అలాగే ఆ మరో డాక్టరు పేరు చెప్పండి. వెళ్తాను."

"పక్క వీధిలో మూర్తి అనున్నాడు. ఆయనంటే నాకసలే పడదు. దయచేసి అక్కడికి కెళ్ళండమ్మా!"

"అలాగే డాక్టరుగారూ!"

# నిరీక్షణ

•"వచ్చేవేళయింది. గడియో గడియో రావాలి. వచ్చేదాకా గుండెలు ఝువ్వు ఝువ్వు మంటూనే వుంటాయి ... అమ్మాయ్! టైంమెంతయిందే?"

"అయిదయిందమ్మా..."

"అయిదయిందీ ! యీపాటికి రావాల్సిందేనే. నిన్నా మొన్నా ఈపాటికి రాలా? ఇదిగో అమ్మాయ్ ఆగ్లాసులో కాఫీ వేరేగా వుంచు. రాగానే కాఫీగ్లాసు కనపడితే కాని ఊరుకునే రకంకాదు...."

"అలాగేనమ్మా"

"అందులో కాఫీ బాగా వేడిగా వుండాలికూడా. కాస్త వెచ్చబెట్టు."

* * *

"ఎవరికోసం వదినగారూ అంత కంగారుపడిపోతున్నారు. అన్నగారు వచ్చేవేళయిందా ?"

"ఆయనా ? ఆయనకోసం కంగారెందుకు ? ఆఫీసవగానే యింటికి రాకేం చేస్తారు ? ఆయనకోసం ఎదురుచూట్టం ఎందుకు?"

"మరి ఎవరికోసం అంతగా యిదైపోతున్నారు ?"

బాగానేవుంది. యిదైపోకపోవటం ఏమిటండీ ! అన్నట్లు అమ్మాయ్ కాఫీ వెచ్చబెట్టావా ? అదిగో గడియారం గంట కొట్టింది కూడా–మాటలోనే రావాలి మరి"

"ఎవరికోసమండీ యీ ఆదుర్దా అంతా ?"

"ఇంకెవరికోసం? మా పని చేసేదాని కోసం అదొక్కరోజు రాకపోతే నాగుండె

ఆగిపోతుంది వదినగారూ. అసలే నాకు గుండెపడ, ఆయాసం. అమ్మాయేమో చిన్నపిల్లకదా- మా పనిచేసే మనిషి ఒక్కరోజు రాకపోయినా మాకిల్లు గడ వదు. అదిగో...నీకు నూరేళ్ళాయుష్షు... వచ్చావా. రా!...రా! నీమాటే అను కుంటున్నాం.కూర్చో కాఫీతాగుదువుగాని. అమ్మాయ్. అప్పలమ్మకు కాఫీ పట్టావే"

—ఎస్. ఆర్. రావు

# చంపేస్తాను

మధ్యాహ్నం మూడింటికి ఆఫీస్‌నుండి ఫోనొచ్చింది.



"ఏమండి ఏంటి విశేషం? సాయంత్రం ఏమన్నా సినిమా ప్రోగ్రాం వేశారా ఏమిటి?" అని అడిగింది సుధ సంతో షంగా.

అవతలనుండి "అబ్బే కాదు సుధా- మా ఆఫీసర్‌ని ఫామిలీతో సహా రాత్రి డిన్నర్‌కు పిలిచాను. కాస ఏర్పాట్లు చూడు. నేనూ తొందరగానే వస్తాను" అన్నాడు సుధాకర్.

సరేనంటూ ఫోన్ పెట్టేసి ఖంగారుగా పనులు ప్రారంభించింది. స్వీట్ చేసింది. బిర్యానీ కర్రీ వండింది. ఐస్‌క్రీమ్ చేద్దా మంటే జీడిపప్పులేదు. వీధి చివర పచారు కొట్లో తెద్దామని బయలురింది. ఈ లోగా పిల్లలు వచ్చి బాత్రూమ్‌లో గెస్టుల కోసం ఉంచిన కొత్తసబ్బుని, టవల్‌ని పాడు చేస్తారేమోనని, అక్కడ పిల్లలకో చీటిని పెట్టి, తాళం పక్కింటికిచ్చి వెళ్ళింది.

తిరిగివచ్చేసరికి పిల్లలు శ్రద్ధగా చదు వుకుంటున్నారు. వాళ్ళకు నీట్‌గా డ్రెస్ చేసి- తనూ తయారయ్యేసర్కి- సుధా కర్ వచ్చాడు లేటయినందుకు బాధపడ్తూ.

మరో గంటకు ఆఫీసర్ ఫామిలీతో కార్లో నుండి దిగాడు. విందు ఘనంగా జరిగింది. వారు చాలా మెచ్చుకుంటూ తిన్నారు. అయితే తర్వాత కొద్దిగా సీరి యస్‌గా చూస్తూ వెళ్ళిపోయారు.

సుధ, సుధాకర్ వంటగది శుభ్రం చేసారు. చేతులు కడుక్కుందామని సుధా కర్ బాత్రూమ్ కెళ్ళి "సుధా ఏమిటిది?" అని గట్టిగా అరిచాడు.

సుధవెళ్ళి చూసింది. కొత్త సబ్బు టవలు ఎవరూ ముట్టుకోలేదు. వాటి ప్రక్కన పిల్లలకోసం తను రాసిన "ఇవి ముట్టుకుంటే చంపేస్తాను!" అన్న చీటి లోని అక్షరాలు మిలమిలా మెరుస్తు న్నాయి.

—పినిశెట్టి శ్రీనివాస్

Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd. No. H/HD/402